# ఉత్తరాలు

## పాఠకులకి మనవి

పోయినవారం సంచిక ముఖచిత్రం గురించి పాఠకులకి ఒక మనవి చేసుకున్నాము. ఆ సందర్భంలో చెప్పిన కారణాలవల్లనే ఈవారం కూడా ప్రత్యేకమయిన ముఖచిత్రాలు వెయ్యటానికి వీలు లేకుండా ఉంది! వచ్చేవారం ప్రత్యేకమయిన బొమ్మలు వెయ్యగలమని అనుకుంటున్నాము.

వనితాలోకం వ్యాసరచన పోటీలో రెండవ బహుమతి పొందిన శ్రీమతి ఇందుర్తి రుక్మిణిగారు తమ జీవిత వివరాలను తెలుపుతూ రాసిన ఉత్తరాన్ని ఈక్రింద వేస్తున్నాము. —సం.

### శ్రీమతి ఇందుర్తి రుక్మిణి

ఫోటో పంపడానికి నాకు అభ్యంతరం ఏమీ లేదు కాని ప్రస్తుతం తీరక లేదు. కనుక క్షమించండి. ఇంక నా జీవిత విశేషాలు క్రింద పొందు పరుస్తున్నాను.

జననం 1940 ఆగస్టు.

విద్యాభ్యాసం పూర్తిగా విశాఖపట్నంలో. 1966 నుంచీ ఉద్యోగరీత్యా ఉత్తర హిందూదేశంలోనే ఉంటున్నాను. ప్రస్తుతం డెహరాడూన్‌లోని ఆర్డినెన్స్ ఫాక్టరీ ఆస్పత్రిలో లేడీ డాక్టరుగా పని చేస్తున్నాను. భర్త నేషనల్ హైడ్రోగ్రాఫిక్ ఆఫీసులో ఆఫీసరుగా పనిచేస్తున్నారు. మాకు ఒక బాబు, పాప ఉన్నారు. కథలు రాయాలని చిన్నప్పటి నుంచీ కుతూహలం ఉన్నా యిదే నా ప్రథమ ప్రయత్నం. విశాఖపట్నం వెళ్ళాలన్నా, ఆంధ్రులమధ్య జీవితం గడపడం అన్నా నాకు యిష్టం.

### కథలు

12—3—71 సంచికలో నా యిద్దరి కథ చెప్పడానికి చాల దగ్గరలో ఉన్నదనిపించింది.

యడ్ల ఆదినారాయణరావు [విజయనగరం]

### సీరియల్

అతని లక్ష్యం చాలా బాగుగానున్నది. ఇందులో కథను పోషను బాగుగాయున్నది.

పుల్లమరాజు [మునరి మడుగు]

*  *  *

అతని లక్ష్యం సీరియల్ ఈవారం చాలా తమాషాగా ఉంది. అందులోని పద్మనాభం డైలాగులు అచ్చం సినీ నటుడు పొట్టిరాజు పద్మనాభాన్నే అతని ఆకారాన్నే గుర్తుకు తెస్తున్నాయి.

కుమారి బి. రాజేశ్వరి [హిరాసపేట]

### ముఖాముఖి

ముఖాముఖి అన్న శీర్షిక చాలా బాగుగా నున్నది. చదివిన కొద్ది చదవాలని కుతూహలముగా యున్నది. ఆటువంటివి మరి రెండు ఇస్తే బాగుంటుంది.

వి. జగన్నాథం, [జగత్యాల]

### ముగ్గురు మూర్ఖులు

ముగ్గురుమూర్ఖులు వడ్డించే మనవాళ్ళకథలు మరియు సీరియల్ నవల మల్లెలు—ఎర్ర గులాబీలు మొదలైనవి నిష్పందేహముగా మీ పత్రికకు వన్నెతెచ్చు చున్నవి. కొందరు పత్రికద్వారా ముగ్గురుమూర్ఖులు, అను శీర్షికను విమర్శించుచున్నారు. కాని నేను వారితో ఏకీభవించ లేకుండ ఉన్నాను. ఈ శీర్షిక చాలా విజ్ఞాన దాయకముగాను ఎన్నో రాజకీయనాయకుల అసలు తవకే వనులను మరియు వారి బుద్ధిని విపులముగా తెలియ చేయుచున్నది. ఇక వడ్డించే మనవాళ్ళు అను శీర్షిక వల్ల పెద్దపెద్ద ఆఫీసర్లు మొ. వారు బంధుప్రేమ, కుల మత తత్వములను మరియు వారు చేసే కుట్రలు మొ. తేటతెల్లముగా ఎట్లు ఇప్పటికీ పాటించుచున్నారో తెలుపుచున్నది.

హరి, (సంగారెడ్డి.)

*  *  *

12—2—71పత్రికలో ముగ్గురు మూర్ఖులు అను శీర్షికలో ప్రత్యేకముగా రచయితగారు శ్రీమతి ఇందిరాగాంధి గార్ని దుయ్యబట్టినారు. జీవితమున ఉన్నత పదవిలో వున్నవారు అందరికి మంచి చేయుట జరుగని పని. కాన పేరుపొంది అందరికి వినోద, విజ్ఞానముల అందించే మీ ప్రముఖ పత్రిక ప్రత్యేకముగా ఉన్నత పదవిలోవున్న ఒక వ్యక్తిని దుయ్యబట్టుటము మంచిదికాదు.

గొలకారం నరసింహారావు. [గూడూరు]

*  *  *

ఏమండి ఎడిటర్ గారూ, మీరు ప్రచురించిన ముగ్గురు మూర్ఖులు అనే శీర్షికలో సేలంలోజరిగిన సభలలో, విగ్రహారాధనను విరోధిస్తు నాయకర్ చేసిన సభలలో శ్రీరాముని, కుమారస్వాముల, విగ్రహముల మీద, చెప్పులు రాళ్ళు విసిరారు అని పత్రికలు ప్రచురించిన మాట యదార్థమే, అందరికి తెలిసినదే! కానీ మీరు దానిని ప్రచురించి, దానిలో ముస్లిముల మీద, క్రైస్తవులమీద ప్రభుత్వమునకు చాల ప్రీతిగలదని, దానిని మీరు ప్రచురించుట వ్యర్థము. ఆముస్లిముల క్రైస్తవులమీద, కేంద్రప్రభుత్వముకు అభిమానము వున్నట్లయితే, అహమదాబాదులో ముస్లిముల స్త్రీలను చెరిచి, ఆస్తి పాస్తులను నష్టపరిచిన, మీ పత్రికగాని, కేంద్ర ప్రభుత్వముగాని ఎలాంటి చర్య తీసుకొన లేదు గదా. మరి ఆంధ్రప్రదేశ్‌నందు, కర్నూలు జిల్లాలోని కంభంలో జరిగిన గలాటలో, అచ్చట వుండిన మసీదును ధ్వంసపరచగా అచ్చట, సబ్‌కలెక్టరు, ఎస్. పి. మొదలగువారువున్నా ఏమీ చేయలేదు. దానిమీదగూడ ఏమి చర్యతీసికో లేదు. మీరు దానిని ప్రచురించలేదు. ప్రజలలో ఎలాంటి వుద్రేకము లేవదీయుటకు పత్రికలే కారణము కావున మీరు ఇలాంటి వార్తలు ప్రచురించ రాదని ప్రార్థన.

ఎస్. ఎ. మక్బూల్ (ఊద్రవరం)

### వడ్డించే మనవాళ్ళ కథలు

కె. వి. ఎస్. శర్మగారు రచించిన వడ్డించే మనవాళ్ళ కథలు ఎంత బాగున్నవో చెప్పలేము. అయిపోయింది. అని చదువగానే అయ్యో అనిపించింది. జరుగుతున్న నిజాలన్నీ ఎంత చక్కగా వ్రాశారు శర్మగారు! పత్రికద్వారా వారికి నా అభినందనలు తెలుపుకుంటున్నాను.

పి. ఇందిర, [నెల్లూరు]

*  *  *

వడ్డించే మనవాళ్ళకథలు, అయిపోయింది, అని చూసే సరికి చాలా బాధ వేసింది. రచయిత శ్రీ కె. వి. యస్. శర్మగారికి నా అభినందనలు తెలుపగలరు.

—జానకిరామ్ బాలాజీ, (కట్టక్.)

*  *  *

వడ్డించే మనవాళ్ళ కథలు త్వరలో ముగించినందుకు విచారిస్తున్నాను.

పెళ్ళయిన తర్వాత అబ్బాయికి ఉద్యోగ విషయము మేమే చూసుకొంటామని ఆడపెళ్ళివారనటము కొన్ని సందర్భాలలో వింటాము. మరికొన్ని కుటుంబాలు అందరూ ఉద్యోగస్థులే అదృష్టవంతులని చెప్పుకొంటారు. వడ్డించే మహాశయుడు వాళ్ళవాడయితే కుటుంబములోనే కాదు బంధువర్గములోనే నిరుద్యోగులుండరు. ఇంటర్‌వ్యూల ప్రయోజనము నామమాత్రమని సామాన్యుని కన్నీళ్ళు తుడిచే తతంగమని, స్వార్థపరుల స్వప్రయోజనాలకు వుపయోగించుకొనే వేదికగా రచయిత వివరించారు.

ఉద్యోగ పంపకములోని మాయ, మర్మాలు స్వార్థపరత్వం, బంధుప్రీతి, సంఘములోని అవకాశ వాదాన్ని కళ్ళకు కట్టేనట్లు తెలియ చేసారు.

కులతత్వాలు, ఉత్తరాయణం, దక్షిణాయణంలో సామాన్యునికి ఉద్యోగము దొరకటము కష్టమయితే వడ్డించే మనవాళ్ళు కూడ అడ్డు తగిలితే దిక్కులేని వాడికి దేముడే దిక్కు. (దేముడనే వాడుంటే) నిజాన్ని నిష్కర్షగా వెల్లడి చేసిన శ్రీ కె. వి. యస్. శర్మ అభినందనీయులు.

ఈ శీర్షిక లోని నాలుగు కథలు ఒకదానితో ఒకటి పోటీ పడ్డాయి. అన్నిటిలో ఆషాడభూతి అన్న కథ బాగుంది.

—మొనార్క్, (ఏలూరు.)

*  *  *

మీ పత్రికలో వెలువడుతున్న వడ్డించే మనవాళ్ళ కథలు చాలా బాగుంటున్నాయి. 12—3—71 పత్రికలో వినుగుచెందిన విక్రమార్కుడి కథ లో రచయిత నిరుద్యోగ సమస్యను వివరించారు

త్వరలో ప్రారంభం!

# పెద్దకథ
# వదినగారి చెల్లెలు

రచన : 'కిరణ్మయి'

# మీ వస్త్రములను సబ్బుతో ఉతికినంతమాత్రాన చాలదు......







# వస్త్రముల స్వచ్ఛమైన తెల్లదనానికి రాబిన్ బ్లూ వాడండి

మీ తెల్లని వస్త్రములను సబ్బుతో ఉతికినంతమాత్రాన చాలదు. కారణం సబ్బుతో ఉతికితే కేవలం మురికిని, నూనె మరకలను, మరకలను మాత్రమే నివారింపగలదు. కాని వస్త్రములు తెల్లగా లేక వికృతంగా వుంటాయి.

మరి దీనిని నివారించటం ఎలా?

చాలా తేలిక. తెల్లని వస్త్రములను ఉతికిన తరువాత ఒక బొక్కెన నీటిలో స్వచ్ఛమైన బ్లూ—రాబిన్ బ్లూ కలిపి ఆ నీటిలో జాడించాలి. మరే యితర బ్లూలు ఇవ్వలేనటువంటి స్వచ్ఛమైన ప్రకాశవంతమైన తెల్లదనాన్ని రాబిన్ బ్లూ మాత్రమే ఇవ్వగలదు. ఓ చిన్న ప్యాకెట్టు రాబిన్ బ్లూ 100 వస్త్రములకు పైగా సరిపోగలదు. ధరకూడా అతి స్వల్పం.





## రాబిన్ బ్లూ

మాత్రమే తెల్లని వస్త్రములకు స్వచ్ఛమైన ప్రకాశవంతమైన తెల్లదనాన్ని చేకూర్చగలదు.

**RCI** రెక్కిట్ & కోల్మన్ వారి తయారీ

విక్రమార్క, బేతాళ[ఫణిక్కర్, రమణ్] భూతాల్ని నాశనం చెయ్యాలి సుమా అని పరోక్షంగా తెలియజేశారు. వారికి నా అభినందనలు అందజేయ ప్రార్థన. మిగతా మూడుకథలూ ముచ్చటగా ఉన్నాయి.

జ్యోతిలక్ష్మిగారి ముఖచిత్రం పత్రికకే వన్నె తెచ్చింది.

జావేరా, (పిఠాపురం.)

* * *

వర్ణించే మనవాళ్ల కథలు చాలా బాగుంటున్నవి. కాని ఈ వారములో కె. వి. ఎస్. శర్మగారు పప్పులో కాలు వేసినారు. ఇందులో వెంకటరమణన్‌కి 18 మార్కులు, వరదరాజన్‌కి 9 పాయింట్లు, సరిపోయినవి కాని రాఘవన్‌కి పాయింట్లు తక్కువ వచ్చినవి. హైస్కూలు, షార్టుహాండ్ హయ్యరు పరీక్షలు పాసయినందులకు 14 మార్కులు, మరి మెట్రిక్, పి. యు. సి., బి. ఏ. పాసయినందులకు 8 మార్కులు లేక 6 మార్కులు వచ్చును. కనుక యిక్కడ పప్పులో కాలు వేసినారు. కాని వారి ఉపోద్ఘాతము హేతువాదమునకు సమంజసముగా నున్నది. వారి హేతువాదము చాలా బాగున్నది.

జి. వెంకటేశ్వరరావు. [ఆవడి]

## మధ్యంతర ఎన్నికలు

ఎదురు చూసిన ఎన్నికలు రావటం అయిపోవటం కూడ జరిగింది. ప్రతిసంవత్సరం జవహర్ జ్యోతిపేర సలభై రెండువేలు, దేశపరిపాలన పేరిట మంత్రుల కోసం ఒక కోటి రూపాయలు మట్టిపాలు చేసే సోషలిస్టు ప్రభుత్వాన్నే ప్రజలు తిరిగి ఎన్నుకున్నారు.

ప్రభుత్వం చేసే పాపాలను ఎప్పటికప్పుడు బట్టబయలు చేసే శ్రీయుతులు బలరాజామధోక్, ఫెర్నాండెజ్, మధూ లిమాయే, మసానీ మున్నగు వారిని ఈ ఐదవ పార్లమెంటుకు ప్రజలు పంపదలుచుకో లేదు.

జనసంఘం, స్వతంత్ర, యస్.యస్.పి. మున్నగు పక్షాలతో ఒప్పందం అనవసరం లేదన్న హితేంద్ర దేశాయ్, వీరేంద్రపాటిల్‌గార్ల రాష్ట్రాలలో వారి పార్టీ తుడిచి పెట్టుకుపోయింది. మైసూర్‌లో ఒక్క సీటుకూడా పాతకాంగ్రెస్ గెలవలేదు. కామరాజు లాంటి నిజమైన ప్రజానాయకుడు తన రాష్ట్రంలో కల్లక్కిందులుగా పడితే (కామరాజు తప్ప ఆయనపార్టీ వాళ్ళంతా నోడిపోయారు) హితేంద్రదేశాయ్, వీరేంద్రపాటిల్ మున్నగువారు ఐక్యసంఘటన లేకుండా

## ఉత్తరాలు

ఎలా గెలవగలమని అంచనాలు వేశారో అర్థం కాదు.

అయితే డెమోక్రటిక్ ఫ్రంట్‌వారు కేంద్రంలో ఇందిరాగాంధీకి వ్యతిరేకంగా గట్టి ప్రతిపక్షం ఏర్పరచాలన్న దృష్టితో అసలు పని చేయలేదు. తాము అధికారంలోకి రాగలమన్న గర్వంతో వ్యవహరించి తల క్రిందులైనారు.

ఈనాడు దేశంలో ఇన్ని పార్టీలు ఉండటం అనవసరం. పాపం చరణసింగ్ గారికే పనికి రాకుండా పోయిన బి.కె.డి. లాంటి పార్టీలు ఎందుకు మన నెత్తినెక్కడానికి? అందువల్ల శ్రీమతి గాంధీ ప్రభుత్వం దేశంలో ఉన్న అన్ని పార్టీలను రద్దుచేసి, కాంగ్రెస్, డెమోక్రాటిక్ అనే రెండుపార్టీలు ఉండేట్లు చూడటం అవసరం. అప్పుడు సోషలిస్టులు, కమ్యూనిస్టులు, కాంగ్రెస్ పార్టీలోను, పాత కాంగ్రెస్, స్వతంత్ర, జనసంఘం మున్నగువారు డెమొక్రటిక్ పార్టీగాను రూపొందటానికి ఆస్కారం ఉంటుంది. అసలు ఇండిపెండెంట్లు అనే విధానాన్ని రద్దుచేయాలి. (ఎన్నికలు అయినాక ఇండిపెండెంటులను కొనటానికి శ్రీమతి గాంధీ ప్రభుత్వం కొంతనిధిని ప్రోగు చేసిందని అన్ని ప్రముఖ పత్రికలు ప్రకటించాయి. అంటే ప్రజాప్రతినిధులపట్ల శ్రీమతి గాంధీ వర్గానికి అంత తేలిక భావం ఉందన్నమాట.)

శ్రీమతి గాంధీ చూడవలసినది కేవలం తన యొక్క అధికార పీటం గురించి కాకూడదు. దేశ భవిష్యత్ కోసమైనా రెండే రెండు పార్టీలు చాల అవసరం. ప్రభుత్వం ఈ చర్య తీసికోకపోతే ప్రజలు కల్పించుకుని ప్రభుత్వంచేత ఈపని చేయించాలి. అదే విధంగా పార్టీ మారిన, పార్టీనుంచి బహిష్కరించ పడ్డ తిరిగి ఎన్నికలలో పోటీ చేయాలన్న నిబంధన అమలు పరచటం మంచిది. అప్పుడు ముఖ్యమంత్రులు, ప్రధానమంత్రి తమ ప్రభుత్వం ఏ నిమిషాన పడి పోతుందోనన్న భయం లేకుండా పరిపాలన చేయటానికి ఆస్కారం ఉంటుంది. అయితే ఇట్టి చర్యలు ఈ ప్రభుత్వం తీసుకుంటుందన్న నమ్మకం ఎవరికీ లేదు.

—సి. పి. ప్రభాకర రాజు, (మద్రాస్.)

(64 వ పేజీ చూడండి)



ఆంధ్రసచిత్ర వారపత్రిక
వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
శుక్రవారం · 9–4–'71
శ్రీ విరోధికృన్నామ సం॥ చైత్ర మాసం శు॥ చతుర్దశి
సంపుటము : 64 సంచిక : 31
స్థాపితము
1908
ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్
ఆంధ్రపత్రిక కార్యాలయము
1, తంబుచెట్టి వీధి, మద్రాసు-1
విడి ప్రతి వెల 40 పైసలు
పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26·00 |
| 6 మాసముల చందా | 13·00 |
| 3 మాసముల చందా | 6·50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి జమున

(చిత్రకారుడు: శ్రీ ఎం ఆర్. ఎన్. ప్రసాదరావు)


ఇందిరకి అనుకూల వాతావరణం


పార్లమెంటులో ప్రతిపక్షం


మధ్యేమార్గం
రాష్ట్రపతి ఉపన్యాసం
అతివాదులు వామపక్షం
అతివాదులు (కుడి)


కొత్త కాంగ్రెసు
పాత కాంగ్రెసు

# రాష్ట్రంలో మధ్యంతర ఎన్నికలు: అధికార కాంగ్రెస్‌వాదుల నిరుత్సాహం

దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలనే ఉద్దేశ్యంతో ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డిగారు ఇందిరా గాలి ఊపులోనే రాష్ట్ర శాసనసభకు కూడా ఎన్నికలు జరిపించాలని సంకల్పించుకున్నారు. కమ్యూనిస్టుపార్టీ స్వతంత్రపార్టీలాంటి ప్రతిపక్షాలు ఈ సంకల్పాన్ని అవకాశవాదమని విమర్శించాయి. కాని అధికారంలో వున్న రాజకీయపార్టీ తనకనుకూలంగానున్న తరుణం చూసి ఎన్నికలు ప్రకటించడం పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో అంత అసాధారణమైనదికాదు. ఐతే బ్రహ్మానంద రెడ్డిగారి నిర్ణయం ఆయన అనుయాయులకే నచ్చినట్టు కనిపించడం లేదు. ఆంధ్ర ప్రాంతంలో కూడా అధికార కాంగ్రెసువాదులీ విషయం పట్ల అంత ఉత్సాహం కనపరచడం లేదు.

## నాయకుని నిర్ణయం

శాసనసభకు జరిగే ఎన్నికల్లో వోట్లు సంపాదించుకోవాలంటే కేవలం ఇందిరాగాంధి పేరు చెప్పడం అభివృద్ధి నిరోధకులు దేశ పురోగమనానికి కలిగిస్తున్న అంతరాయం గూర్చి ప్రచారం చేయడం చాలదని అందరికీ తెలిసిందే ఐనా విజయం మనదే నని అధికార పార్టీ నాయకులకు నమ్మకం లేక పోలేదు. కాని పంచాయితీ ఎన్నికలు ముగిసిన ఆరు నెలలకు లోక్‌సభ ఎన్నికలు వచ్చాయి. ఇంకా ఆ బడలిక తీరక ముందే మళ్లీ శాసన సభ ఎన్నికల అవసరమేమొచ్చింది? పైగా ప్రభుత్వానికి ఇప్పటి శాసనసభలో కలిగిన ప్రమాదం కూడా ఏమీ లేనప్పుడు ఈ ఎన్నికల తతంగము ఇప్పుడే ఎందుకు? వచ్చే సంవత్సరం ఎట్లాగైనా తప్పదుకదా! అనే ధోరణిలో కాంగ్రెసువాదులు కనుపిస్తున్నారు. కాని నాయకుని నిర్ణయానికి శిరసావహించాలి కదా! ఇబ్బందైనా తెలపకపోముకదానని ఆంధ్ర ప్రాంతంవారు తలలూపుతున్నారు. కాని తెలంగాణా అనుచర వర్గానికి ఇది పెద్ద తంటాగానే తయారైంది.

## నిజంలేని ప్రచారం

ఉప ముఖ్యమంత్రి శ్రీ జె. వి. నరిసింగరావుగారైతే మధ్యంతర ఎన్నికలకు నేను వ్యతిరేకినని, ప్రచారం జరుగుతున్నది, అందులో నిజంలేదు. నిజానికి ఎన్నికలు జరుగాలనే అభిలషిస్తున్నానని ప్రకటన చేశారు. ఆదిలాబాదు లోక్‌సభ స్థానానికి జరిగిన పోటీలో నరిసింగరావుగారి నియోజక వర్గమైన లక్సెట్టిపేటలో ప్రజాసమితి అభ్యర్థికే దాదాపు రెండువేలు హెచ్చువోట్లు వచ్చాయి. ఐనా ఎన్నికలు జరుగాల్సిందేనని నరిసింగరావుగారు అనడం ఆయన ప్రజాస్వామ్య విశ్వాసానికి తార్కాణం. ఇది ముదావహమైన విషయమే. కాని ఆయనలో వలె ఉత్సాహం మరికొందరు తెలంగాణా మంత్రుల్లో కనుపించడం లేదు. వారి నియోజక వర్గాల్లో పరిస్థితి వేరుగా వుంది. పి. వి. నరసింహారావు రాజ నరసింహ, ఇబ్రాహిం, అలీఆన్సారీ, రామచంద్రరావు కల్యాణి, అక్కిరాజు వాసుదేవరావు గారు, తమ నియోజక వర్గాల్లో మళ్లీ ఇప్పుడే పోటీకి దిగడం ప్రమాదకరమైన పని. కార్మికమంత్రి జి. సంజీవరెడ్డిగారి నియోజక వర్గమైన సిర్పూరు (ఆదిలాబాదుజిల్లా)లో కూడా ప్రజాసమితి అభ్యర్థికే హెచ్చువోట్లు వచ్చాయి. ఐతే వీరుకూడా పైకి ఇంత వరకు మధ్యంతర ఎన్నికలను వ్యతిరేకించ లేదు. వ్యతిరేకిస్తున్నారని చెబితే కాదంటారు కూడా. కాని తెలంగాణా ప్రాంతీయ సంఘం అధ్యక్షుడు జె. చొక్కారావుగారు ఈ విషయమై ఢిల్లీ దొర్బారానికి వెళితే వీరందరి మద్దతు ఆయనకుంటుంది. అధికార కాంగ్రెసు అధ్యక్షుడు దామోదరం సంజీవయ్యగారి పిలుపున చొక్కారావుగారు ఢిల్లీ వెళ్ళారు.



ఇప్పట్లోనే శాసన సభకు ఎన్నికలు జరిపించాలా వద్దా అని తుదినిర్ణయం చేయవలసింది కాంగ్రెస్ కేంద్ర పార్లమెంటరీ బోర్డు. ఇప్పుడే ఎన్నికలు వద్దని కాంగ్రెసు అధ్యక్షునికి రాష్ట్రంనుంచి పిటిషన్‌లు చాలా వెళ్ళాయట.

## ప్రభావం చూపని అష్టాంశ కార్యక్రమం

తెలంగాణాకు చెందిన అధికార కాంగ్రెసువాదులలో అధిక సంఖ్యాకుల ఆలోచన కూడా సబబుగా లేక పోలేదు. తెలంగాణా సమస్య పరిష్కారానికి ప్రధాన మంత్రి 1969లో అష్టాంశ కార్యక్రమాన్ని ప్రకటించారు. ఈ కార్యక్రమాన్ని అందరూ చిత్తశుద్ధితో అమలు చేయాలి. తగిన ఫలితాలు కలగక పోతే తెలంగాణా భవిష్యత్తుగూర్చి అందరికీ అంగీకారయోగ్యమైన నిర్ణయం ఏమైనా చేయవచ్చుననేది అధికార కాంగ్రెసు విధానం. ప్రధానమంత్రి ఇందిరా గాంధి గారీ విషయాన్ని చాలాసార్లు విశదీకరించారు. లోక్‌సభ ఎన్నికల ప్రచారం సందర్భంలో ఆమె తెలంగాణాలో చేసిన ప్రసంగాల్లో కూడా ఈ విషయాన్ని స్పష్టపరచారు. తమ కార్యక్రమం అమలు కానియ్యండి అందుకు తోడ్పడండి అని ఆమె తెలంగాణా ప్రజలకు విజ్ఞప్తికూడా చేశారు.

మార్చి 5న జరిగిన లోక్‌సభ ఎన్నికల ఫలితాలను బట్టి ప్రధానమంత్రి అష్టాంశ కార్యక్రమ ప్రభావం తెలంగాణా ప్రజలపై చెప్పుకోతగ్గట్టు అంతగా పడలేదని నిరూపించాయి. ఇలాంటి పరిస్థితిలో తెలంగాణా ప్రజాభిప్రాయాన్ని అనుకూలంగా మార్చుకోవడానికి మరింత ప్రయత్నం చేయకుండానే ఎన్నికల్లో పోటీ చేయడమంటే మరోకసారి ప్రజల వ్యతిరేకతను వారి అసమ్మతిని బహిర్గత పరచి ప్రజాసమితి ఇంకా ప్రేళ్ళు దన్నుకునేటందుకు ప్రోత్సాహం చేసినట్లు అవుతోందని తెలంగాణా అధికార కాంగ్రెసు కార్యకర్తలు పలువురు భావిస్తున్నారు.

ఒక రకంగా శాసన సభకు కూడా ఎన్నికలు జరుగడం అభిలషణీయమే. మరోకసారి ప్రజాభిప్రాయం బయట పడుతుంది. తెలంగాణా సమస్య పరిష్కారానికి దోహదం కలుగుతుంది. ఐతే ఇప్పటి మాదిరి ప్రచారం శాసనసభా ఎన్నికల ఫలితాలు లోక్‌సభ ఎన్నికల ఫలితాల కంటే ఏమంత భిన్నంగా ఉండవని చెప్పవచ్చును. కాని ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోదలచినప్పుడు అది ఏమైనప్పటికీ దాన్ని పాటించాలని తదనుగుణంగా నిర్ణయం తీసుకోవాలని ముందుగానే సంకల్పముండాలి. అదిలేకపోతే ప్రజల్లో ప్రజాస్వామిక పద్ధతిపై విశ్వాసం పోతుంది. వారి భావాల్లోకూడా కాఠిన్యం ఏర్పడుతుంది.

## ప్రబలంగా ఉన్న ప్రత్యేక రాష్ట్రవాంఛ

ఎవరేమన్నా తెలంగాణా మేధావి వర్గాల్లో విద్యావంతుల్లో అత్యధికంగా ప్రత్యేక రాష్ట్ర వాంఛ ప్రబలంగా వుంది. తెలంగాణా మంత్రులు ఇతర పెద్దలు ఎవరూ సరి ఆలోచనతో మార్పు తీసుకురాలేక పోయారు. ఎన్నికల్లో అధికార కాంగ్రెసుకు ఈ పెద్దల మూలంగా అక్కడక్కడా పిసరంత కలిసొచ్చే ప్రయోజనం కూడా లేదని తెలంగాణా ఉద్యమారంభంనుంచి జరిగిన సంఘటనలు నిరూపించాయి. శాసన సభకు జరిగిన ఉప ఎన్నికల్లు, లోక్‌సభ ఎన్నికలుకూడా చాలావరకూ ఈసత్యాన్ని ధృవపరచాయి. కాని తెలంగాణాలోని హరిజనులను, వెనుకబడిన వర్గాలను, అల్ప సంఖ్యాక వర్గాలను సమీకరించి వారికి చెందిన అభ్యర్థులను ఎంపిక చేసి, ప్రోత్సహిస్తే అధికార కాంగ్రెసుకు రాష్ట్రసమైక్యత పేర నేరుగా కాక పోయినా ఇందిరా గాంధి గారి ప్రగతిశీల నాయకత్వం విధానాల పేర విజయం పొందవచ్చున్న ఆశాభావం అధికారకాంగ్రెసు నాయకత్వంలో ఉంది. కాని అభ్యర్థుల ఎంపికను ఈ ప్రాతిపదికపైన చేయబూనుకుంటే బ్రహ్మానంద రెడ్డిగారు తెలంగాణాలో ఇంతకాలం తమ అండ చేరిన సహచరుల్లోను, అనుయాయుల్లోను అధిక సంఖ్యాకులను బలిపీట మెక్కించవలసి ఉంటుంది.

— వి. నాగేశ్వరరావు ●

'ఈ రాజధానికబురు' రాసిన తర్వాత ఆంధ్ర ప్రదేశ్‌లో మధ్యంతర ఎన్నికలు జరగనే వార్త వెలువడింది. —సం॥

శివ శివాయన ముదంబొందు
శివేశా, మహేశా, మృత్యుంజయా మంగళమ్
శివ శంభో సాంబునిన్
శివ శంకరా శశిశ శిరీషశేఖరా॥

శివయ్య నీదయ నాదయ్య
శివన్న, నీకన్న, ఎవరన్న, దిక్కు నాకన్న
శివప్ప నాతప్పెంత దప్ప
శివుడు, హరుడు యొకడౌచెప్పుడే నాకిప్పుడే॥

శివకేశవ హరహరియు
శివా మీ రుభయులకు భేదములేదా
శివుడా నే నమ్మనా
శివుడో హరియో ప్రత్యక్షదర్శన మివ్వవయ్యా॥

శివునిగాంచక కంపితనై
శివయ్యా, నీ నిజరూపరేఖ చూపునంటిన్
శివయ్యకు కరుణలేదు
శివుని విడనాడ నా జీవితాంతమున్॥

—రచయిత్రి: శివభక్తురాలు

(ఈగేయాలు రాసినవారి పేరు భారతదేశంలో వారందరికీ సుపరిచితమే కానీ వారి కోరికపయిన మారుపేరుతో ప్రచురిస్తున్నాము—సం॥)

# ఉద్యోగ విన్యాసాలు

కశింకోట ప్రభాకరదేవ్

రేపు ! రేపే జాయినవ్వాలి కాలేజీలో. రేపట్నుండి తనుకూడా స్టూడెంట్. కాలేజి స్టూడెంట్! .యింకా విద్యార్థిగానే వుంటాడు. ఏ బరువూ, బాధ్యతలు తననంటవు. చీకు చింతా లేకుండా మరో మూడు సంవత్సరాలు గడిపేయవచ్చును.

యిలాంటి ఊహలతో ప్రొద్దుపోవడం గమనించలేదు రాంబాబు.

వెలుతురుతో చీకటి కొట్లాటకు దిగిన సమయం అది! వెలుతురు క్రమక్రమంగా మందగిస్తుంది. సూర్యుడు పశ్చిమాన కృంగిపోతున్నాడు.

'ఏరా బాబు ! చీకట్లో కూర్చోడం ఏంటి? లైటు వెలిగించరాదూ?'

తల్లి ప్రశ్నకు వులిక్కిపడ్డాడు. ఊహా ప్రపంచంలోంచి జారిపడ్డాడు. మెల్లగా లేచి గోడనున్న లైట్‌స్విచ్ వేసాడు.

'మా మామయ్య వచ్చారట. నీతో ఏదో మాట్లాడాలంటూ కబురు పంపేరు. ఓసారి వెళ్ళిరా' అంది.

'ఎవరూ! మామయ్యే!' సందేహం వచ్చింది రాంబాబుకు. మామయ్యంతటివాడు తనకు కబురుపెట్టడం ఏంటి? రియల్లీ వండ్రఫుల్...మోస్ట్ అన్నేచురల్ మ్యాన్.

రాజకీయాలలో ఆరితేరిన మనిషతను. ప్రజలందరూ అతన్ని రాజకీయ నీతిజ్ఞుడు అని అంటుంటారు. ఆమాట అక్షర సత్యమే ననిపిస్తుంది మామయ్య ఆస్తిని చూస్తుంటే. సర్లే...అదంతా తనకెందుకుగాని, తన నెందుకు రమ్మనమన్నట్టు? అదే పెద్ద 'డౌట్'గా వుంది.

డ్రెస్ మార్చుకుని నీటుగా తయారయ్యాడు.

'మామయ్య దగ్గరకు వెళ్లొస్తానమ్మా!' అన్నాడు.

'ఉండ్రా. మీ నాన్నగారుకూడా వస్తారంట' అంది అమ్మ.

'ఊఁ...రానీ...రానీ. కావలిసిందే అక్రి వాళ్ళి దర్శించుకోటానికే' మనసులోనే ఆ మాట అనుకుని,

'త్వరగా రమ్మనమన్నారు!' అన్నాడ పైకి.

యింతలో రానే వచ్చేసారు నాన్నగారు. భుజంమీద వున్న కండువాను సర్దుకుంటూ 'పదరా !' అన్నారు.

యిద్దరం బయల్దేరాం.

ఆ వూరికి చాలా కొద్దిదూరంలో ఒక అందమైన పూలతోట వుంది. ఆ తోట మధ్యగా మరింత అందంగా చక్కని భవంతి వుంది. దీపాలమధ్య ఠీవిగా...ముద్దొచ్చేలాగ వుంది ఆ భవనం. రహదారి బంగళా అనబడు ఆ భవంతిలోనే శ్రీవారి తాత్కాలిక మకాం.

శ్రీవారిని దర్శించుకోడాని కప్పుడే ఆవూరి రాజకీయ భక్తులు క్యూలో నిలబడ్డారు.

మెట్లెక్కుతూ వాళ్ళ (భక్తుల) ముఖాల్ని పరిశీలనగా చూశాను. మా వూరి రాజకీయ పక్షులు, కంట్రాక్టర్లు, సూపర్‌వైజర్లు మొదలగు వారితోపాటు, కౌన్సిలర్లు, ప్రజాసేవకులు కూడా కన్పించారు.

వాళ్ళందరినీ దాటుకుంటూ మెయిన్ రూంని సమీపించాం. సిల్కుడోర్ కర్టెన్‌ను ప్రక్కకు నెట్టి లోన కడుగువేయబోతున్న నేను 'తక్కు'న ఆగిపోయాను.

గది మధ్యనున్న సోఫాలో మామయ్య ఆసీనులై వున్నారు. అతనిచుట్టూ నలుగురు పెద్దమనుష్యులు కూర్చుని వున్నారు. అందులో ఎవరో భక్తుడు కాబోలు సమర్పించిన కరెన్సీ కానుక టేబులుమీద వుంది. శ్రీవారికి నైవేద్యం సమర్పించి, తన కోరికను విన్నవించు కుంటున్నాడొక భక్తశిఖామణి! టేబులుమీద వున్న కరెన్సీని కళ్ళలోనే ఎంతుంటుందో అంచనా వేసి చిర్నవ్వు చిందించారు శ్రీవారు.

భక్తుడు హాయిగా శ్వాస పీల్చుకున్నాడు.

అంతవరకు భక్తులమధ్య కొలువైయున్న శ్రీవారి దృష్టి, అకస్మాత్తుగా గుమ్మంవద్ద నిలబడిపోయిన మేనల్లుడిపైన పడింది.

'అరేఁ ! రా ! బాబూ రా !! ఎంతసేపయింది వచ్చి ?' ప్రశ్నించారు.

సమాధానంగా తను నమస్కారం చేసి 'యిప్పుడేనండి.' అన్నాను లోపలికి వెళ్తూ.

నాన్నకూడా నా వెనుకనే వచ్చేరు. నాన్నని చూడగానే మామయ్య సంతో

వంతో 'రా బావా! కూర్చో' అన్నారు సోఫాను చూపిస్తూ.

యిద్దరం కూర్చున్నాం.

'ఆఁ...బావా! అందరూ కులాసాయేనా?' ప్రశ్నించారు. 'అన్నట్టు ఏం తీసుకుంటారు? కాఫీయా ... కూల్‌డ్రింక్సా?' అంటూ, నాన్న ఏంవద్దని చెబుతున్నా వినిపించుకోక—

'ఏయ్ సెక్రెటరీ! కూల్‌డ్రింక్స్ తెప్పించు' అన్నారు.

ఈ మర్యాదకి వుబ్బి తబ్బిబయ్యాడు నాన్న.

మామయ్య యిదివరకెన్నడూ యిలా పలకరించటం నే నెరగను. ఎప్పుడూ చాలా బిజీగా వుంటాడా మనిషి! రాజకీయాలు అతడ్ని చాలా గొప్పవాడిగా మార్చివేసాయి. అంతటి గొప్పవాడు తనతో...ఆఫ్టరాల్ ... వో ఎల్డీసీ గాడితో మా ట్లాడి, కూల్‌డ్రింక్స్ యిస్తున్నాడంటే నిజమని నమ్మలేక, ఆ సందేహంలోనే కొట్టుమిట్టాడుతున్నాడు నాన్న.

'ఏంటి చెప్మా! మామయ్యలో యింత పెద్దమార్పు? వీల్లేదు. మామయ్యలాంటి వారు మారరు. మారలేరు. ఏదో స్వార్థం వుంటేనే తప్ప!

వీళ్ల దృష్టిలో బంధుత్వాలు కేవలం ఉలిపిరి కాగితాలు. అవసరం అనుకుంటే వాటిని చించుకొని పోగలరు. లేదా, వాటిని అడ్డంపెట్టుకుని తమ పనులు నెరవేర్చుకోగలరు. అంతా పాలిటిక్స్ ... ! జీవితంలో రాజకీయాలు.

యింతలో కూల్‌డ్రింక్స్ వచ్చాయి. ముందుగా మామయ్య నాకు, నాన్నకు వాటిని స్వయంగా అందించి, తనుకూడా ఒకటి తీసుకున్నాడు.

'ఆఁ. రామం! నీ చదువు కంప్లీటయింది కదూ?' ప్రశ్నించాడు.

'తన చదువులో యిన్నాళ్ళకి మామయ్యకేం పనొచ్చింది చెప్మా!?' అని మనస్సులోనే అనుకుని—

'లేదు మామయ్యా! యింకా చదవాలనుంది. డిగ్రీలో చేరుతున్నాను' అన్నాను.

మామయ్య నవ్వేడు 'అలాగ్గటా!' అంటూ.

'చదువుకో. కాని, చదువయింతర్వాత ఏం చేస్తావ్?' ప్రశ్నించాడు.

'ఏం చేస్తానేంటి? ఉద్యోగం.'

'ఆఁ...వుద్యోగం కొరకేకదా ఈ చదువులు. ఆ వుద్యోగం ఏదో యిప్పుడే యిప్పిస్తాను. వెంటనే చేరు.'

నా గుండె ఆగినంత పనయింది. 'చదవొద్దంటాడేంటి? కాలేజీలో చేరాలని తనెంత ఆశపడుతున్నాడు!'

'ప్చ్...వీల్లేదు మామయ్యా! వీల్లేదు. నీమాట పాటించలేను సారీ...అయామ్ వెరీ వెరీ సారీ!' లోలోపలే అనుకుని నాన్నవేపు తిరిగిచూసాను బేలగా.

ఏదో చెబుతున్నాడు మామయ్య.

'ఏమంటా రండి బావగారు! చక్కని వుద్యోగం. చదివి ఏం చేస్తాం చెప్పండి. బోడి డిగ్రీవచ్చినా మహా వస్తే నెలకు మూడొందలు...నాల్గొందలకన్నా ఎక్కువ వచ్చినా రాదు. యిప్పుడు మనకు తెలిసిన కంపెనీలో మంచివుద్యోగం ఖాళీగా వుంది. జీతం ఎనిమిదొందలు' అన్నాడు మామయ్య.

'ఏంటీ...! ఎనిమిదొందలే...?' నాన్న సంతోషాన్ని పట్టలేక ఆమాట పైకి గట్టిగా అనేసాడు.

మామయ్య మీసాలచాటున నవ్వుకున్నాడు.

'అలాగయితే వెంటనే చేరుతాడు. నిక్షేపంలాంటి వుద్యోగం ఎవరైనా కాదనగలరా?' అన్నాడు నావైపుచూసి నాన్న.

నాలో కోపం కట్టలు త్రెంచుకుంది. కాని నేను నిస్సహాయుణ్ణి!

'మామయ్యా! వేశావ్ ఏదో ఎత్తువేసి [illegible] ఏ స్వార్థం లేకుండా మేనల్లుడికి ఎనిమిదొందల వుద్యోగం యిప్పిస్తున్నావంటే నమ్మేసే ఫూల్‌నికాదు. నీ...నీ...కూతుర్ని— మెల్ల కన్ను కూతుర్ని నాకు కట్టబెట్టాలనే కదూ నీప్లాన్? తెలీదనుకున్నావా?' అనుకున్నాను.

'సర్లేఁ... మీరింక వెళ్లండి. నే నర్జంటుగా ఢిల్లీకి వెళ్ళాలి. ప్లేన్‌కు టైం అయింది' అన్నాడు లేస్తూ.

నాన్నకూడా లేచారు.

'వస్తాం' అనిచెప్పి, వో నమస్కారం పారేసి నాన్నవెనకాలే బయల్దేరాను బైటికి.

కొంతదూరం నడిచాక, నాన్న నావైపు తిరిగి—'ఏరా! చక్కని వుద్యోగం కదూ!? అదృష్టవంతుడివి.' అన్నారు.

'అవును నాన్న అలాగే అంటాడు. అనడూ మరి? ఎనిమిదొందల జీతం అనగానే పొంగిపోయి, తను అదృష్టవంతుడినని పొగిడేస్తున్నాడు. కాని...కాని, తన దురదృష్టం నాన్నకేం తెల్సు?'

ఎనిమిదొందల జీతం రావడం అదృష్టమే! ముమ్మాటికి గొప్ప అదృష్టం. అయితే... ఆఁ... మెల్ల కన్నమ్మాయిని — మోస్ట్ ఆక్వర్డ్ అమ్మాయిని కట్టుకుని, జీవితాంతం తన పెళ్లాం అంటూ బాధపడాలి. పదిమంది ఫ్రెండ్సూ తనని, తన పెళ్ళాన్ని, చూసి—

'పాపం... దురదృష్టవంతుడు. పూర్ ఫెలో...పిటీయు' అంటుంటే బాధపడేది



## నెం. 80: 16 క్లూలు (తెలుగు తర్జుమా)

1. ప్రస్తుత సంబంధ కార్యనిర్వాహణలు / భావములు అనుసరించబడనియెడల మానవీయ సంబంధములు ఉద్దేశ్యములు శూన్యములే.

2. చాలామట్టుకు జనులకు అధికారి/సమాజ నిర్దేశానుసారం ప్రవర్తించుట తమను గురించి స్వయంగా యోచించుటకంటె ఎక్కువ సులభం.

3. పూర్తిగా వ్యక్తి కేంద్రంనుండి వేరుగా నియోజితమైన జీవనం సృజనాత్మకం/ఫలదాయకం కాజాలదు.

4. మనుష్యునికి ఇంకొక రెవ్వరున్నూ ప్రతిష్ఠ / స్వతంత్రతను ఇవ్వజాలరు; తనకోసం దానిని తానే స్వయంగా పొందవలెను.

5. ప్రజలయొక్క భావనాత్మక/నైతికదృష్టి కోణాలందలి మార్పులు పెద్ద మంచుదిబ్బ కరుగుగతి యంతటి మాంద్యం మరియు అంతటి అప్రతిరోధ్యం కూడ.

6. మానవ మనస్సునందు ఈశ్వరుడు / మంచియొక్క సందర్భంలో అపసవ్యమైన భావ భావన పూర్తిగా కల్పితమై యున్నది.

7. కృప / కృతజ్ఞత అన్నిటికంటె అతి అరుదైన మానవ గుణమని చెప్పబడింది.

8. మానవుని మరియు సృష్టిమధ్య బిగ్రువలె మానవుని మరియు మానవుని మధ్య బిగ్రువ్యథ / వికాసముకు మూలము.

9. మూలతః—మనము స్మృతులు / తప్పులయొక్క ఉత్పాదనయని రూఢిగా మనము భావింతుము.

10. ఇతిహాసమందు అన్నిటికంటె అతి దారుణ తప్పులు / హత్యలలో కొన్ని తెలిసియున్న వివేకపూర్ణ సవ్య నిర్ణయాం ననుసరించబడియే జరిగినవి.

11. అవకాశములు / వ్యక్తిత్వాలు అధికాంశలో మనం స్వయంగా కల్పించుకొనేవే అని గుర్తుంచుకొనవలెను.

12. ఏ మానవ జీవియున్ను తన వంశం తన స్వయం జాతి / ధర్మం తన కాలం సందర్భమున స్వతంత్రుడై యుండడు.

13. ఈశ్వరపృథ్విలో మనము అన్నిటికంటె అధిక అశాంత/నిర్దయ ప్రాణులమై యున్నాము.

14. ఒక అన్వేషిత ప్రతిభ/సత్యం సహితం, దాని విలువ ఇంకా అనంతర అన్వేషణ ప్రకటన యగువరకు మరియు ప్రయోగమునకు వచ్చే వరకు దీర్ఘకాలం అపరిచితమై యుండవచ్చును.

15. సమయ సమయములందు మన సౌభాగ్యం లెక్కగొనకుండా మానవ దుర్బలత / దుష్టత్వం మార్పు చెందజాలనట్టి యదార్థమై యున్నది.

16. ఒక వనిత/శబ్దం మీ మిత్రుని కోల్పోవ చేయగలదు. లేక యుద్ధమునకు సహితం కారణం కాగలదు.

## No. 80 : 16 CLUBS

(1) In human relations motives are empty unless accompanied by the relevant **Actions / Emotions.**

(2) It is easier for most men to be guided by **Authority / Society** than to think for themselves.

(3) A life which is wholly planned from a centre outside the individual cannot be **Creative / Productive.**

(4) No one can give a man **Eminence / Independence;** he must find it for himself.

(5) Changes in the **Emotional / Moral** attitudes of a people are as slow as the movement of a glacier and as irresistible.

(6) The mind of mankind has utterly misconceived **God / Good.**

(7) **Grace / Gratitude** has been called the most uncommon human virtue.

(8) Tension between man and man like tension between man and nature, is a source of **Grief / Growth.**

(9) Indeed we feel ourselves to be in essence the child of our **Memories / Mistakes.**

(10) Some of the worst **Mistakes / Murders** in history have followed consciously decisions.

(11) **Opportunities / personalities** it must be remembered, are largely of our own making.

(12) No human being is independent of his ancestry, his **Race Religion,** his age

(13) We have become the most **Restless / Ruthless** creatures on God's planet

(14) The value of even a discovered **Talent / Truth** may lie for a long time unknown, till some further discovery brings it into notice and use.

(15) Regardless of our good fortune from time to time human **Weakness / Wickedness** is a fact which cannot be altered-

(16) **A Woman Word** can lose a friend or even cause a wan.

లిట్‌క్విజ్ కొటేషను లన్నియు రచయితల రచనల నుండి గ్రహించబడినవి. అవి వేనికవే పూర్తి అర్థముల గలవి. ఒక్కొక్క క్లూకు మారు పదములు అక్షర క్రమమున నేర్పాటు చేయబడినవి. మొదటి మారు పదముల యొక్క అక్షర క్రమమున క్లూ లన్నియు యేర్పాటు చేయబడినవి. లిట్‌క్విజ్ నీక్లి అఫిషియల్ సొల్యూషనుతో రచయితల పేర్లు, వారి రచనల పేర్లు ప్రకటింపబడును.

# ఉద్యోగవిన్యాసాలు

తనా? లేక నాన్నా ??

నాన్నకేం పట్టింది? కొడుకు పెద్ద సంపాదనపరుడయ్యాడన్న దీమాతో కాలుమీద కాలేసుకూర్చుంటాడు. బాధపడేది తనుకదా!

'మామయ్యా! నా ఆశల్ని ధ్వంసంచేసే శావ్? ఉద్యోగాన్ని ఎరచూపి నన్ను లాగేస్తున్నావ్. కాలేజీలో చేరాలన్న నా కోరికను మొదలంటా పెకలించేస్తున్నావ్' నాకళ్లల్లో నీళ్లు తిరిగాయి.

అంత పెద్ద వుద్యోగం దొరుకుతుంటే నాన్న తనని చదివిస్తాడా? ఊహూ. ఒకవేళ తను వుద్యోగం చెయ్యను, చదువుకుంటానంటే...! ఊర్కోడు. ఆ మాటంటేనే తంతాడు.

'చిక్కుకున్నాను మామయ్యా! చిక్కుకున్నాను. నువ్వేసిన వలలో చిక్కుకున్నాను. మొత్తానికి రాజకీయనాయకుడి పనిపించుకున్నావ్. నా ఆశల్ని ధ్వంసంచేసి కూడా ఏదో మహోపకారం నాకు చేసినట్లు రేపట్నుండి పోజులు కొడ్తావ్. అంతేకదూ? అవును...అంతే...అంతే. నేను వట్టి యిడియట్‌ని. ఫూల్‌ని.

ఆలోచనలతో యింటికిచేరాను. గుమ్మంలో అడుగుపెట్టానో లేదో అప్పుడే నాన్న ఆ వార్తను అమ్మచెవులో పడేసాడు. యిక ఆ వార్త బ్రాడ్‌కాస్ట్ కావడమే తరువాయి.

మరునాడుదయం ఒ జార్జ్ కి అలా వెళ్ళొద్దాం కదా అని బయల్దేరాను.

మురళి పుస్తకాలు పట్టుకుని వెళ్లి పోతుంటే పిల్చాను. వెనుతిరిగి చూసి, నన్ను గుర్తుపట్టి వచ్చాడు.. పరీక్షగా చూసాను వాడ్ని.

నేరోకట్ ఫేంటు, టైట్‌షర్ట్, చేతిలో నో నోటుబుక్కు, దాంతో నో టెన్‌ బుక్కు, పెదాలమధ్యన అందంగా సిగరెట్, కర్లింగ్ క్రాఫ్... మువ్వమూర్తులా కాలేజీ స్టూడెంటులాగున్నాడు.

'ఏరా, ఎడ్మిట్ అయ్యావా?' ప్రశ్నించాను.

'అవబోతున్నాను' అన్నాడు కాలేజీ స్టూడెంటులా పోజుకొడుతూ. తరువాత నా ముఖంలోకి సానుభూతిగా చూసి—

'నీ కుద్యోగం దొరికిందటగా?' అన్నాడు.

'ఊఁ' అన్నాను వాడివైపు అసూయగా చూస్తూ.

LITQUIZ No 80

Rs. 60,000

| MERIT BONUS | MINIQUIZ | UP TO 4 ERRORS | 1 ST PRIZE |
|---|---|---|---|
| Rs. 5000 | A Rs. 7500<br>B Rs. 7500 | Rs. 15,000 | Rs. 25,000 |

## మెరిట్ బోనస్

మిని "ఏ" మరియు మిని "బి" రెండూ గెలుపొందిన పోటీదారు రు. 5000/— విలువ గల మెరిట్ బోనసులో వాటా పొందగలరు.

## లిట్ క్విజ్ నెం. 80 అధికార ఎంట్రీ ఫారము

మొత్తము బహుమతి రు. 60,000/— ఆఖరు ముగింపు తేదీ 14—4—71 బుధవారం

ADDRESS: LITQUIZ No 80, ALANKAR, BALARAM STREET, BOMBAY-7.

గమనిక: 1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి. (2) ఒక కూపన్‌మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి. (3) ఎంట్రీరుసును M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండి పొందిన M.O రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M. O. రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును. (4) I. P. O. క్రాస్‌చేయవద్దు. అది లిట్‌క్విజ్ నెం. 80, బొంబాయి—7 వారికి చెల్లించునట్లు ఉండవలెను.

| | Re. 1 | 1 | Re. 1 | 2 | Re. 1 | 3 | Re. 1 | 4 |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ACTIONS | EMOTIONS | ACTIONS | EMOTIONS | ACTIONS | EMOTIONS | ACTIONS | EMOTIONS |
| 2 | AUTHORITY | SOCIETY | AUTHORITY | SOCIETY | AUTHORITY | SOCIETY | AUTHORITY | SOCIETY |
| 3 | CREATIVE | PRODUCTIVE | CREATIVE | PRODUCTIVE | CREATIVE | PRODUCTIVE | CREATIVE | PRODUCTIVE |
| 4 | EMINENCE | INDEPENDENCE | EMINENCE | INDEPENDENCE | EMINENCE | INDEPENDENCE | EMINENCE | INDEPENDENCE |
| 5 | EMOTIONAL | MORAL | EMOTIONAL | MORAL | EMOTIONAL | MORAL | EMOTIONAL | MORAL |
| 6 | GOD | GOOD | GOD | GOOD | GOD | GOOD | GOD | GOOD |
| 7 | GRACE | GRATITUDE | GRACE | GRATITUDE | GRACE | GRATITUDE | GRACE | GRATITUDE |
| 8 | GRIEF | GROWTH | GRIEF | GROWTH | GRIEF | GROWTH | GRIEF | GROWTH |
| 9 | MEMORIES | MISTAKES | MEMORIES | MISTAKES | MEMORIES | MISTAKES | MEMORIES | MISTAKES |
| 10 | MISTAKES | MURDERS | MISTAKES | MURDERS | MISTAKES | MURDERS | MISTAKES | MURDERS |
| 11 | OPPORTUNITIES | PERSONALITIES | OPPORTUNITIES | PERSONALITIES | OPPORTUNITIES | PERSONALITIES | OPPORTUNITIES | PERSONALITIES |
| 12 | RACE | RELIGION | RACE | RELIGION | RACE | RELIGION | RACE | RELIGION |
| 13 | RESTLESS | RUTHLESS | RESTLESS | RUTHLESS | RESTLESS | RUTHLESS | RESTLESS | RUTHLESS |
| 14 | TALENT | TRUTH | TALENT | TRUTH | TALENT | TRUTH | TALENT | TRUTH |
| 15 | WEAKNESS | WICKEDNESS | WEAKNESS | WICKEDNESS | WEAKNESS | WICKEDNESS | WEAKNESS | WICKEDNESS |
| 16 | WOMAN | WORD | WOMAN | WORD | WOMAN | WORD | WOMAN | WORD |

FREE AFTER 2 COUPONS

MINI A

| | |
|---|---|
| ACTIONS | EMOTIONS |
| AUTHORITY | SOCIETY |
| CREATIVE | PRODUCTIVE |
| EMINENCE | INDEPENDENCE |
| EMOTIONAL | MORAL |
| GOD | GOOD |

MINI B

| | |
|---|---|
| OPPORTUNITIES | PERSONALITIES |
| RACE | RELIGION |
| RESTLESS | RUTHLESS |
| TALENT | TRUTH |
| WEAKNESS | WICKEDNESS |
| WOMAN | WORD |

BOTH FREE AFTER 4 COUPONS

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను మరియు కాంపిటీషన్ ఎడిటరుగారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/—. ఈ పూర్తి ఎంట్రీ ఫారము [4 కూపనులకు] ఫీజు రు. 4/— M. O. రసీదు / I. P. O. / లిట్‌క్విజ్ క్యాష్ రశీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. వాటి నెం. ........................

నెం. 81 ఫారములు పొందుటకై దీనిని పూర్తిచేయండి

FULL NAME ..........................................

..........................................

ADDRESS ..........................................

..........................................

..........................................

POST .................. DIST ..............

80 (ASVP)

IN ENGLISH: CAPITAL LETTERS

FULL NAME ..........................................

..........................................

ADDRESS ..........................................

..........................................

..........................................

POST .................. DIST ..............

ఈ పూర్తి ఫారము కత్తిరించి పంపవలెను

గమనిక: ఇవన్నియు కొటేషనులు. వీనికి రచయిత వాడిన పదములే సరియైన జవాబులు. అఫిషియల్ సొల్యూషన్ ఏది 18-4-71 గల సండే స్టాండర్డ్ సిటీ ఎడిషన్ [కడపటి పేజీ] నందున్ను, బహుమతుల పట్టి లిట్‌క్విజ్ వీక్లీ అడ్వాన్సు—25-4-71 యుండును. పూర్తిగా కుదింపబడి తేది 1-5-71 సండే స్టాండర్డునందును ప్రకటింపబడగలదు. 30 పైసలు పంపి 9 భాషలలో, అనగా తమిళము, తెలుగు, కన్నడ భాషలందు గల తర్జుమాలను పొందండి. మీ ఎంట్రీలతో 10 పైసల పోస్టు కార్డు మీద మీ అడ్రసు వ్రాసి జతపర్చి పంపండి. అఫిషియల్ సొల్యూషన్ పంపగలము. లిట్‌క్విక్ వీక్లీ ఉచిత కాపీని కూడా వ్రాసి పొందండి.

## గతి తప్పిన సిటీ బస్సు!

22 వుదయం పది గంటలవేళ యశ్వంతపురం —జయనగర్ సిటీబస్సు [బెంగుళూరు] జనవంగుడి ప్రాంతంలో గతితప్పి అర్ధచంద్రాకారంలో వో తిరుగు తిరిగి, ప్రక్కనున్న వో స్కూలు ప్రహరీని ఛేదించి, మరో మలుపు తిరిగి సర్రున నలుగుర్ని చంపి, నడిరోడ్డుమీద స్థిమితపడిందట. ముత్తు సేత్ అనే 50 ఏళ్ళ ఆయన సందులోంచి సైకిలు మీద రివ్వున రాజమార్గంలోకి వచ్చేసరికి, ఆయన్ని కాపాడబోయిన డ్రయివరుకు బండీ పట్టుతప్పి యీ ఘోరం జరిగిందట. ఇంతా చేస్తే ఆ సైకిల్ వ్యక్తి కూడా చనిపోయాడట. అంతేగాక 34 ఏళ్ళ జయలక్ష్మి అనే వుపాధ్యాయిని, వెంకటాచలపతి అనే ఆయన, గుర్తు తెలీని వో 26 ఏళ్ళవ్యక్తి— మొత్తం యీ నలుగుర్నీ చంపేసిందటా బస్సు. జయలక్ష్మికి ఐదుగురు పిల్లలట పాపం.

అజంతా వాళ్ళనాన్న
పై లోకంలో
ఉన్నారండీ...?




### అనుమానం–నమ్మకం

కృష్ణమూర్తిపురం అనే ఊళ్లో 29 ఏళ్ళ కృష్ణప్ప అనే కుట్టుపని చేసుకునే వ్యక్తి 22 ఏళ్ళ గవ్వరమ్మ అనే ఆమెను ప్రేమించాడట. కానీ, కొన్నాళ్ళాగా అతనికి ఆమెమీద అనుమానం వచ్చి రాత్రాను అది నమ్మకమై, దాంతో ఆవేశం వచ్చి మావాన్న దగ్గరకు తీసుకువెళ్తా రా అని వో అద్దెకారులో ఆమెను ఎక్కించుకుని, కృష్ణరాజనగరం సరిహద్దులలో వున్న వో మైదానంలో పీక నులిపి చంపి, శవం మీద నగలన్నీ తీసుకుని, ఆ శవాన్ని మైదానంలో విసిరేసి పోయాడట— ఇట్స్ రియల్ లౌవ్ అఫ్...

# ఒక వారం విపరీతం

ఫాలాక్షుడు

### ధాన్యంలో విషం!

బీజాపూరుకు చెందిన తాంబా అనే గ్రామంలో వో పిండిమరలో ఒకాయన ఆడించుకున్న ధాన్యంలో విషం కలిసినందువల్ల ఆ తరువాత పిండి ఆడించుకుని ఆ పిండిని తిన్నవారు— నలుగురు పిల్లలు చనిపోయారట. 25మంది స్థితి ప్రమాదకరంగా తయారయ్యిందట— అసలాయన ఎందుకలా విషం కలిపాడో, అసలేం కలిపాడో కూడా తెలీలేదు.

### ఆత్మహత్యకి కారణం?

బి.యస్సీ ప్యాసయిన గీత అనే వో 20 ఏళ్ళ అమ్మాయి బెంగుళూరు దగ్గరలో వున్న నందిహిల్స్ కొండ మీాంచి దూకి ఆత్మహత్య చేసుకుందట. ఆమె తన చెప్పులను, చేతిసంచీని ఒకచోట వదిలిందట· అందులో ఇద్దరమ్మాయిల ఫోటోలు వున్నాయట· దర్యాప్తుమీద ఆమెకు హెచ్.యం.టి [బెంగుళూరు] లో పనిచేస్తున్న వో ఇంజనీరుతో వివాహం అయ్యిందని తెలిసిందట. ఆమె సంచిలో వున్న ఫోటోలోని యిద్దరమ్మాయిలూ ఆమె చెల్లెళ్ళట. పోయినేడు వారు తుంగనదిలో మునిగి చనిపోయారట. వారి చావు ఆమె ఆత్మహత్యకు కారణమని పోలీసు అనుమానిస్తోంది.

### అర్ధరాత్రి ఆగంతుకులు

కదిరేశన్ స్పిన్నింగ్ మిల్స్‌లో భాగస్వామి అయిన వెంకటేశ్ అనే ఆయన ఇంటి తలుపు అర్ధరాత్రి పూట ఎవరో తట్టారట. ఎవరయ్యుంటారు అని గమ్మున తలుపు తెరిచేసరికి గబగబ ఆయన్ని కత్తులతో కొంతమంది వ్యక్తులు పొడిచి, అప్పుడే బయటకు వచ్చిన ఆయన భార్యనగలూ అవీ లాక్కుని పారిపోయారట. ఇది 17వ తేదీరాత్రి చిత్రదుర్గలో జరిగిన చిత్రం.

### ఆడపిల్లని అల్లరిపెట్టిన విద్యార్థి

బెంగుళూరులో వో పి.యు.సి. విద్యార్థి వో స్కూలు పిల్లకు ఉన్మాదతున్న ప్రేమలేఖలు రాసి, తానో పిచ్చిగా వున్నాని కూడా అందులో సూచించాడట. అంతలో ఆగక, ఆమెను దారికాచి, యిబ్బంది పెట్ట నారంభించాడట. ఈ విషయం ఆమె ద్వారా ఆమె తలిదండ్రులు— వారి ద్వారా పోలీసులు తెలుసుకుని ఆ యువకుణ్ణి టక్కున పట్టేసి కోర్టుకు వప్పచెప్పారుట. 80 రూపాయల జుర్మానా కావాలా, లేక వో వారం జైల్లో విశ్రాంతి కావాలా కోరుకో అన్నారట కోర్టువారు..... గుడ్ ఛాయిస్.

### ఏ భాగం ఎక్కువ అందంగా ఉండాలి?

జర్మనీలో స్టాకింగ్స్ తయారు చేసేవారు వో అభిప్రాయ సేకరణ చేశారుట. మీా శరీరంలో ఏ భాగం ఎక్కువ అందంగా వుండాలని మీారు కోరుతారు అని వో 500 మంది అందమైన ఆడవారిని అడిగారుట· వారిలో 355 మంది ఏకగ్రీవంగా మా కాళ్ళు— మా పిక్కల అందం అన్నారట. వీరంతా 18—35 ఏళ్ళవారేనట. మిగతావారిలో మాకు నడుంఅందంకావాలని 6 శాతం, మా పిరుదులు అందంగా వుండాలని 5 శాతం, మా స్తనాలు అందంగా వుండాలని 14 శాతం, చేతులు అనటాని 4 శాతం అన్నారట.

### పొరపాటు—పోట్లాట

తిరుపత్తూరు తాలూకా కందిలి గ్రామంలో తన్ను అనే అతనిభార్య 18 ఏళ్ళ లలితకూ ఆమె అత్తగారికీ ఆడబిడ్డకూ క్షణం కూడా పడిపడేది కాదట. వో నాడు వంటచేస్తూ లలిత వో గిన్నె కిందపడేసేసరికి, దాంతో అత్తగారూ, ఆడబిడ్డా ఆమెమీాద విరుచుకుపడ్డారట. ఈ పోట్లాటతో విసుగెత్తిన తన్ను కత్తి తీసుకుని తన భార్యను పటుక్కున పొడిచి చంపేశాడట.

మీ అమ్మగారికి
చూపించండీ వార్త
సర్దాపడతారు అవని
మాతృభక్తికి



## పందిళ్ళకి నిప్పంటించిన ప్రేక్షకులు

16వ తేదీన బెంగుళూరులో కాలిబంతి ఆటల పోటీ జరిగిందట. అది ఎటూ తేలక పోయేసరికి టైము మరికొంత పెంచాలని చూపరులు కోరారట. కానీ అప్పటికే కను చీకటి పడుతున్నందువల్ల కార్యవర్గం దానికి సమ్మతించలేదట. దాంతో కోపం వచ్చిన ప్రేక్షకులు పందిళ్ళకు నిప్పంటించారట. నాటకాల్లో వన్స్‌మోరుకు నటులు అదే పాటను పాడుటంలే మళ్ళి మళ్ళి— సో దే ఫాట్!

## భర్తకి విషం పెట్టిన భార్య

మంజారాబాద్‌లో 35 ఏళ్ళ కావేరి అనే ఆమె తన భర్త పొన్నుస్వామిగవుండరుకు అన్నంలో విషం కలిపి పెట్టిందట. అది తిన్న గవుండరు గంట తిరిగే



లోనే చనిపోయాడట. ఇంతకూ కావేరి తన భర్తకు అంత ప్రేమతో విషం పెట్టిన కారణం తెలియ లేదు.

## హైట్స్ ఆన్!

కలకత్తాకు చెందిన 50 ఏళ్ళ మహేష్‌సింగ్ అనే పోలీసు కానిస్టేబులు డ్యూటీలో వుండగా ఎవరో వచ్చి ఆయన్ని పొడిచి చంపేశారట. భోల్‌పట్టి అనే చోట కొందరు దుండగులు ఓ యింట్లోకి జొరబడి, 50 ఏళ్ళ స్త్రీని కత్తి, కటారులతో పొడిచి చంపేశారట.

18వ తేదీన కలకత్తా ప్రాంతాల్లో దొరికిన నాలుగు శవాలలో ఒకటి నక్సలైటుకు చెందిన వారిదని, మరొకటి సి.పి.ఐ. [యమ్] కు చెందినవారిదని తేలిందట. ప్రదీప్‌దాస్ అనే మార్క్సిస్టు వ్యక్తి శవం అనేక గాయాలతో జోడాపూరుర్ వద్ద ప్రాంతంలో దొరికిందట. బసరత్‌కి చెందిన ఇచ్ఛాపూర్ మట్ అనే చోట గుర్తు తెలీని ఇద్దరు యువకుల శవాలు దొరికాయట. దుర్గాపూరులో 18వ తేదీ రాత్రి 50 ఏళ్ళ సురేష్ రాయ్ అనేఆయన్ని ఆయన ఇంటి దగ్గరే ఎవరో పొడిచి చంపేశారట. దర్శ అనే చోట వో మూడు స్త్రీల శవాలు దొరికాయట. ●



### గమనిక

ఉత్తరాల శీర్షికకి రాసేవారు ఈ కింది నియమాలు పాటించాలని మనవి: 1. ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి 2. రాసేవారి పూర్తి పేరు, చిరునామా ఇవ్వాలి 3. ఇంగ్లీషు లిపిలో అక్షరాలు రాయరాదు 4. కాగితానికి ఒకవయిపునవే రాయాలి. 5. సిరాతోనే రాయాలి. —సం॥

తండ్రికి కొడుకులకు ఆనందం కల్గించేదీ, తల్లికి కోపం తెప్పించేదీ — ప్రేమ పదార్థం. ఏదైనా ప్రేమాయణంలో కొడుకు పడితే — కనిపించకుండానే మహదానందం పొందేస్తుంటాడు తండ్రి. కాని తల్లికి ఒళ్లు మండుకొస్తుంది. (బహుశా తండ్రిగారి అనుభవానికిదీ కొంత కారణం కావచ్చుననుకోండి!) 'వెధవ్వేషాలు వెయ్యకు', అనో, 'కళ్ళు తెరుచుకు మునుగు నాయినా!' అనో శ్లేషార్థాలతో హెచ్చరికలు చేస్తూ వుంటారు అమ్మలు. ఇంకా వినకపోతే 'ఈ తల్లి ముండొకత్తుందని లెక్కా పత్రమా?' అనో, 'అడ్డాలనాడు బిడ్డలుగాని గడ్డాల నాడా!' అనో తమని తాము తిట్టుకుంటూ వుండడం కూడా జరుగుతుంది. ప్రేమ గొడవలు వచ్చినప్పుడే అబ్బాయిగారికి ఇంట్లో వారి పైన ఉన్న అభిమాన బలం, ఇంట్లోవారి ఔదార్యబలం కూడా తెలిసొస్తూ ఉంటాయి. అమ్మకూచి బాబులు తాము ప్రేమించినట్టు నోట్టాన వెళ్లగక్కలేరు ఇంట్లో. ఏ పైవాళ్ళో చేరవేసినప్పుడు చిన్నపెట్టు భారతయుద్ధం జరిగి తీరుతుంది. తల్లికి ఆయనగారు

# ప్రేమించేవు జాగ్రత్త!



ఎప్పుడూ అనిపిస్తుందిట — తన బంగారు తండ్రికి ఏ ఆడపిల్లా తగదు! ఏ పిల్లను చూసినా ఆ పిల్లది తగకపోవడానికి సవాలక్ష కారణాలు కనిపిస్తాయి తల్లిగారికి — మా అమ్మకీ అంతే — మా యింటి కోడలు కాబోయిన పిల్లది పెళ్లి చూపులనాడు ఊదారంగు చీర కట్టుకుందిట. ఆ రోజు నుంచి అమ్మకా రంగంటే ఒళ్ళు మంట! అసహ్యం!... ఒద్దనుకున్నా కుర్రవాడి తల్లికీ కోరుకున్న ఆడదానికీ మధ్య పోటీలో పాలు పంచుకోక తప్పదు. ఇటువంటి ఇరకాటపు పరిస్థితులలో కొడుకు భుజం మీంచి ఈ మాతృదేవత భారం తొలగించడంలో తండ్రి భాగం పంచుకుని కొడుకు ఆదరాభిమానాలకి పాత్రుడౌతూ ఉంటాడు. దీనివల్ల ఓ చిక్కు వుంది. తండ్రిలాగా ఇల్లు తప్పించుకు తిరిగితే తప్పించి ఈ ఆడవారి బెడద తప్పదని అనుకోవచ్చు. లేదా 'ఈ ఆడాళ్లంతా ఉపగ్రహాలు— మన చుట్టూ యిలాగే తిరుగుతారు. ఆనందించు. అంతేగాని వారిని సీరియస్‌గా పట్టించుకోకు' అని తండ్రి బోధిస్తున్నాడని గ్రహించవచ్చు.

ఈ ముగ్గురిమధ్య పెళ్లి పీటలపైకి చేరిన అమ్మాయిగారికి కాళ్లూ చేతులూ వణకవచ్చును. ఈ భర్త ఇటు వారి తండ్రిగారికి కార్బను కాపీ కాదు కదా కొంపతీసి? అనుకుని భయపడనూ వచ్చు. తల్లికొంగు వదలని పసివాడా? ఇట్లాంటివే అనుకోవచ్చును. అందుకే ఇటు అబ్బాయి కుటుంబాన్ని అటు అమ్మాయిగారి కుటుంబాన్ని కూడా క్షుణ్ణంగా పరిశీలిస్తే తప్పించి అమ్మాయిగారి భవిష్యత్తు ఎలా ఉంటుందని చెప్పలేం. 'అంతా తెలిసే చెప్పలేం చిట్టి తల్లీ — ఏ తల్లీ తండ్రిని కాపీ కొట్టినా యని తెలిసిన దెయ్యాలు ఫరవాలేదు. కాని కనిపించని దెయ్యాల జాడలు బయటపడొచ్చు మన రాతకొద్దీ అప్పుడేం చేస్తావు?' అంది అనుభవజ్ఞురాలైన ఓ ఇల్లాలు. ఇంకేం దారి? 'అందుకనేగా 'ప్రేమించేవు జాగ్రత్త!' అని హెచ్చరించడం' అంది కొడుకులని కన్న ఓ తల్లి. 'అలా అనకండి తెలియక ప్రేమించి చేసుకుంటే రాత అనుకో వచ్చు. అన్నీ చూసి చేసినప్పుడు చెడితే విధి అంటారు?' అంది ఇంకా జాతకాలు కుదరక వృద్ధ కన్యగా వుండిపోవాల్సి వస్తుందనుకుంటున్న ఓ అమ్మాయి. నాలు



[illegible]లో చదువుతున్న నా మామయ్య ఆ మాట విన్నట్టున్నాడు 'ఏమేవ్ ఆ పెళ్లి చేయించిన పురోహితుడి జాతకం కూడా చూడాలని చెప్పు' అంటున్నాడు. ఏది ఏమైనా నీతి నిజాయతీలు, జీవితగ్రహణాలు, విశ్వాసం ఆత్మవిశ్వాసం మొదలైన లక్షణాలు తల్లి తండ్రులనుబట్టి పిల్లలకి ఏమాత్రమైనా వస్తాయని అవే మన పిల్లల పాలిట శ్రీరామ రక్ష అని అనుకొనే తల్లి తండ్రులు—అటు అమ్మాయిలకి ఇటు అబ్బాయిలకి హెచ్చరిస్తారు—'ప్రేమించేవు సుమా' అని. ●

# డిజైన్ కట్ చోళీ




అమ్మాయిలకే కాదు, అమ్మలక్కూడా అందంగా అమరుతుంది డిజైన్ కట్ చోళీ!

కాకపోతే వయసు మరీ తక్కువవుండి అంగాలు, చోళీలు మాత్రమే వేసుకునే పాపాయిలకిది అందంగా అతకదు. కారణం నేను వ్రాయ వక్కర్లేదు.

కుట్టేవిధానం వివరంగా వ్రాస్తున్నాను. దానిని బట్టి కొంచెం జాగ్రత్తగా అనుకరించ గలిగితే, చక్కటి ఎంబ్రాయిడరీతో కట్‌చోళీ తయారవుతుంది.

36—వ సైజుకే నేను కొలతలు వేస్తున్నాను. అంతకన్నా ఎక్కువ సైజు కావలసినవారు — ఒక్కంగుళం చేతులు బాజూ, బాడీబాజూమాత్రం పెంచుకోవచ్చు. తక్కువ కావాలన్నా అలాగే ఒక్క అంగుళం చేతులు బాజూ, బాడీబాజూ మాత్రం, తగ్గించుకోవచ్చు.

కాని, చేతుల కత్తిరింపు — మెడభాగము, చోళ్ళరుభాగం, అంగుళంలో పావుగవ వంతు మాత్రమే మార్పు చేసుకోవాలి. అదేదీ అవసరం లేని వాళ్ళకి నేను యిచ్చిన కొలతలు సరిగ్గా కరెక్టుగా సరిపోతాయి. జాగ్రత్త మాత్రం చాలా అవసరం.

## జాకెట్ భాగాలు

ముందుగా కట్ చోళీకి, బాడీ ఎదురు భాగంలో వున్న ప్రకారం డాట్సు వేసుకోండి. షేపువచ్చే భాగానికి మాత్రం, కరెక్టుగా $1\frac{1}{2}$ అంగుళాలకి తక్కువ లేకుండ, రెండంగుళాల లోపు ఒకటిన్న రంగుళాలకి పైగాను వెడల్పుగా డాట్స్ వెయ్యాలి. అప్పుడే—బ్రెస్టు ఫార్మేషనుకి, అతికినట్టు సరిపోతుంది. తరువాత ప్రక్క డాట్సు — ఇవి — చాలా జాగ్రత్తగా — క్రాసుగా కుట్టేందుకు ప్రయత్నించండి.

ష్కర్ట్‌లోంచి వచ్చే డాట్స్ అందరికీ తెలుసు. అయినా అతుకు భాగానికి ఒకటిన్నరంగుళాల డాట ఇచ్చి, అదేలాగా బ్రెస్టు ఫార్మేషనుకి సరిపోయేటట్లు పాయింట్‌గా తీసుక రావాలి. బటను పెట్టే భాగానికి నెక్ భాగానికి మధ్యగా [నాటుపెట్టుకున్న ప్రకారం] ఒక డాట్ వెయ్యాలి. ఈ చిన్నడాట్సన్నీ ఒకటిన్నరంగుళానికి తక్కువున్నా పరవాలేదు కాని యెక్కువ వుండ కూడదు.

ముఖ్యమైన భాగం రెండున్నర అంగుళాలున్న క్రాసు పట్టీముక్కని ఒకవైపుకి చాలా మందపాటి బట్టగాని—బజార్లో పిటి కోసముని అమ్ముతారు. [కాన్వాసు.] అదిగాని తీసుకుని— ఈ షేపు వచ్చే క్రాసుపట్టీలాగే సమంగా కత్తిరించి అతుక్కోవాలి. ఒక ముక్కని ముందువైపుకి — రెండవ ముక్కని వెనుకవైపుకి అతుక్కుని జాగ్రత్తగా, కుట్లు ప్రక్కన పడనివిధంగా కుట్టుకోవాలి. ఇలా కుట్టేందుకు చాలా నేర్పూ ఓర్పూ కావాలి. అప్పుడిది చాలా అందంగా కనబడుతుంది.

ఇప్పుడు జాకెట్ కట్టింగ్సన్నీ అతుక్కున్నా— కట్ చోళీ ఎదురుభాగం పూర్తి అయినట్లే. బటన్సు పట్టీలు నచ్చినరీతిగా అతుక్కోవచ్చు. వెనుకభాగాన్ని తయారైవున్న ఎదురు భాగాన్ని భుజాలు చేర్చి కుట్టుకుని తరువాత ప్రక్కభాగాలు అతుక్కోవాలి. వెనుక భాగానికి బెల్టు అతుక్కోవాలి — ఇక మెడ మిగిలివుంది. ఈ మెడ కుట్టే విధానంలో ఎన్నో మెళుకువలున్నవి. ముఖ్యంగా ఒకటిస్తున్నాను. పాపాయిల ఫ్రాకులకి పైపింగ్ కత్తిరించినట్లే. ఈ మెడ పట్టీలకన్నాడ కత్తిరించి, ఒక ప్రక్కనుండి ప్రారంభించి [అతుకు] చివరి వరకు మడతలు పెట్టుకోనక్కర్లేకుండా కుట్టుకు రావచ్చును. యిలా కుట్టిన మెడ పట్టీని వెలికి మెలి పెట్టుకుంటూ చేతికుట్టు వేసుకుంటే, అందానికందం, కుట్టేందుకు వుత్సాహం, యెక్కడా మడతలు సరిచేసుకోవలసిన బాధ లేకుండున, పని ముగిసేందుకు తక్కువ వ్యవధి సరిపోవటం యిదంతా క్రాసుపట్టీలో వున్న గొప్పతనం. జాకెట్ ఎదురు భాగం మాత్రం బట్టని క్రాసుగా వుంచి తీసుకోవటం చాలా గొప్పపని— అందానికందం, పనిలో గొప్పతనం ఉంది.

## ఇక జాకెట్ క్లాతుమీద డిజైన్

36 అంగుళాల కొలతల జాకెట్‌కి 26 అంగుళాలున్న బట్ట చాలు. దానితో ముందుగా—38 అంగుళాలు వెడల్పున్న పంపుపు మార్కు చేసుకుని పొడవు పదమూడంగుళా లుండేలా చూసుకుని ప్రక్కభాగంలోవున్న డిజైన్ నడుముకు వచ్చేట్లు వేసుకోండి. ఇక చేతులు— 6 అంగుళాలు, [ఇంకా కావలసిన వారు వారి అభిరుచిని బట్టి పెంచుకోవచ్చును.] పొడవు—13 అంగుళాలు, వెడల్పు చూసుకుని చేతి చివర మార్కు చేసుకుని — డిజైన్ వేసుకుని—ఈ రెండు భాగాలు—పట్టు నల్ల దారంతో మాత్రమే—కేవలం గొలుసు కుట్టుతో మాత్రమే తయారు చేసుకోవాలి.

ఎదురు భాగాన్ని కూడా సరిగా వెనుకభాగానికున్న కొలతల ప్రకారమే వెడల్పు కత్తిరించుకుని పొడవు మాత్రం— రెండున్నర అంగుళాలు తగ్గించి కత్తిరించు కుంటాం—కారణం రెండున్నర అంగుళాల క్రాసుపట్టీ దానికి చేర్చికుట్టు కుంటాం గనుకను. పోటోలోమాదిరి జాకెట్ వుంటుంది.— గద్వాల జాకెట్‌లాగ అందంగా వుంటుంది—ఆంధ్రలో అమ్మాయిల కిది అందమైన ఆభరణంలోకి లెక్క.

—కృష్ణప్రియ ●











# ఎడారి వెన్నెల

మోర్తల గోపాలరెడ్డి

అద్దంముందు నిలబడ్డ రంగమ్మ గూట్లోవున్న కుంకుమభరిణె తీసుకుని పావలాసైజు బొట్టుపెట్టుకుని, దువ్వెనతో ఓసారి పైపైన దువ్వుకుంది. ఇంకొంచెం ముందుకు అద్దానికి దగ్గరగా జరిగింది. పాపిటి ప్రక్కవెంట్రుకలు కొన్ని తెల్లబడడం మొదటిసారిగా గమనించిన రంగమ్మ కళ్లలో నీళ్లు తిరిగాయి. నలభై పైబడిన వాళ్లకు లోకంలో సహజంగా జుట్టు నెరవడం, వూడిపోవడం సాధారణంగా జరిగే విషయమనే సంగతి నలభైఐదేళ్ల రంగమ్మకు తెలిసి జీవిత సత్యమేమీ కాదు. మబ్బు కమ్మినట్టు నల్లటి జ్ఞాపకాలు తలపుకు వస్తున్నాయి. ఎంతో సంబరపడి ముస్తాబు చేసుకుంటున్న రంగమ్మ కుప్పలా స్టూలుమీద కూలబడింది. మనసంతా వికలమయింది. జీవితంలో తను అనుభవించిం దేమిటి? కోరికల్ని, ఆనందాన్ని దూరం చేసుకుని మోడులా ఈ ముప్పయ్యేళ్లు కన్నెపిల్లలా జీవితాన్ని ఈడ్చుకొచ్చింది. ఎవరికోసం? ఎవరికోసమూ కాదు, కేవలం తనకోసం. అందరి పెళ్లిళ్లలా ముప్పయ్యేళ్ల క్రితం, తనకు పదిహేను సంవత్సరాల వయసులో శేషయ్యతో పెళ్లయింది. శేషయ్య బియ్యే చదువుకుంటున్నాడనీ, కలెక్టరవుతాడనీ, ముప్ఫయివేలు పోసి తనను కన్యాదానం చేశారు అమ్మా నాన్న. గంపెడు ఆశలతో తను అత్తగారింటి కెళ్లింది. కళ్లలో నీళ్లు గుండెల్లో ప్రేమను నింపుకుని అమ్మ తనను రైలెక్కించింది—స్టేషన్‌దాకా మిట్టమధ్యాహ్నం ఎండలో నడిచివచ్చి. ఏవేవో మధురమైన తీయటి స్వప్నాలతో అత్తగారింటికి వెళ్లింది. కాని తను అక్కడ...

'రంగమ్మ పిన్నీ' బయట ఎవరో పిల్లల పిలుపులు.

చీర కొంగుతో కళ్లు వొత్తుకొని మంచంమీది మల్లెపూలు తల్లో తురుముకుని బోషాణంలో వున్న చంద్రహారపు గొలుసు మెళ్లో వేసుకుని 'వస్తున్నానర్రా' అంటూ బయటికొచ్చింది.

'నాన్న నిన్ను పిలుచుకు రమ్మన్నాడు పిన్నీ' అంది పదహారేళ్ల సీతారత్నం.

'అక్కయ్యను పెళ్లికూతుర్ని చేయాలి గదూ పిన్నీ' అంది సీతారత్నం చెల్లెలు సుబ్బలక్ష్మి.

'ఏం మీ అమ్మవుంది గదుటే?'

'ఏమో పిన్నీ అదంతా మాకు తెలీదు. నిన్ను అర్జంటుగా వెంటబెట్టుకు రమ్మన్నాడు నాన్న'

'వూళ్లో యింకెవరూ లేనట్టు' అంది నవ్వుతూ రంగమ్మ.

పెళ్లిపందిరి కళకళ లాడుతోంది. అరిగిపోయిన తెలుగు రికార్డులు ఏడాపెడా మ్రోగుతున్నాయి మా ప్రాణాలు తీయకు మెత్రో. అన్నట్టు ఆడ, మగ, పిల్లలు సందడిగా తిరుగుతున్నారు. దక్షిణపు వాకిటి గుండా రంగమ్మ లోపలికి వెళ్లింది.

'రంగమ్మత్త వచ్చింది, రంగమ్మత్త వచ్చింది' అన్నారు పెళ్లికూతురు చుట్టూ మూగిన ఆడంగులు నెత్తిమీది బరువేదో దిగిపోయినంత స్వేచ్ఛగా.

తలాకొకపని పురమాయించి సుశీల

# ఎడారి వెన్నెల

పదినిమిషాల్లో పెళ్లికూతురిగా తయారు చేసింది. అంతవరకూ నానాయాతన పడు తున్న ఆడవాళ్లంతా ముక్కులమీద వేళ్లు వేసుకుని చోద్యం చూసినట్టు చూడ సాగారు. పిల్లా పాపాలేని రంగమ్మకు తెలీని సంగతంటూ లేదు. పెళ్లిళ్లు, పురుళ్లు బారసాలలనుంచి వ్యవసాయం చేయించడం వరకు ఆవిడకు కుణ్ణంగా తెలుసు. ఎవరికే సహాయం కావాలన్నా ఆమెదగ్గరికి వెళ్తారు, కాదనకుండా వాళ్లను ఆదుకోవడం ఆమెకు పరిపాటయింది. వూళ్లో వాళ్లకు తలలో నాలుకలా వున్న రంగమ్మకు జరిగిన తీరని అన్యాయానికి వాళ్లు చాలాకాలం కన్నీరు కార్చారు.తాము చేయగలిందేమీ లేదని తెలుసు కుని రంగమ్మను వోదార్చారు.

పసుపు బట్టలతో, నునుసిగ్గుతో తల వంచుకుని పక్కచూపులు చూస్తున్న సుశీ లను చూస్తుంటే రంగమ్మ మనసులో వుద్వేగం ఎగసెగసి పడసాగింది. తన వివాహ జీవితం సవ్యంగా సాగివుంటే తనకూ యింత కూతురు వుండేది. కానీ తనకు ఆ అదృష్టం ఏదీ? తన నుదుట యిలా రాసిపెట్టి వుంటే అలా ఎలా జరుగుతుంది? శేషయ్య జ్ఞాపకం వచ్చాడు. ఛీ అతనూ ఏమనిషేనా అనుకుంది.

'ఇదేమిటే చిట్టీ నువ్వు యింకా యిక్కడే వున్నావ్? అవతల, వాళ్లు పెళ్లికూతురి కోసం కాచుక్కూర్చుంటే'అంటూ కనకయ్య రంగమ్మచేతిలో వెన్నెటిబుడ్డి పెట్టాడు. అతనిచేతులు ఆమె మెత్తని అరచేతులకు తగిలాయి. విద్యుత్తులాంటి శక్తేదో గోళ్ల చివరినుంచి గుండెల చివరివరకూ ప్రాకి నట్టయింది రంగమ్మకు. విలువెల్లా కిత కితలు పెట్టినట్టు వొంటిమీది రోమాలు సూదుల్లా లేచాయి. ఎప్పుడూ లేనిది యివాళ తనకెందుకిలా అనిపిస్తోంది?

'వస్తున్నా బావా' అంది రంగమ్మ జీవి తంలో మొదటిసారిగా చలిస్తున్న మనసుకు కళ్లేలు బిగించి పట్టుకుంటూ.

'తొందరగా పదవే చిట్టీ' అంటూ కన కయ్య పెళ్లి పందిట్లోకి వెళ్లిపోయాడు,

తనను చిట్టీఅని పిలిచే చొరవ కనకయ్య బావ కొక్కక్కడికే వుంది. నాన్న చెప్పినట్టు తను కనకయ్య బావను చేసుకుని వుండా ల్సింది. కనకయ్య బావను చేసుకుని వుంటే తన జీవితం హాయిగా నిమ్మకు నీరెత్తి నట్టు వుండేదేమో!

పెళ్లి పందిట్లో ఆడవాళ్లమధ్య కూర్చున్న రంగమ్మ అంతరంగంలో ఆలో చనలు ఆటుపోటుల్లా ఎగిరెగిరి పడు తున్నాయి. కనకయ్య, మంగమ్మ ప్రక్క ప్రక్కన కూర్చుని కన్యాదానం చేస్తున్నట్టు, రంగమ్మకు తెలియనంత పరధ్యానంగా తన జీవితాన్ని నెమరువేసుకో సాగింది.

* * *

రంగమ్మ చిన్నప్పటిపేరు రంగనాయకి. నలుగురు పిల్లలు పుట్టి గిట్టి పోయాక రంగమ్మ పుట్టడంవల్ల, రంగమ్మను అతి గారాబంగా పెంచారు వాళ్లు. బడికి పంపితే నేరుగా తుమ్మలతోపుకువెళ్లే కనకయ్య తనతో పాటు రంగమ్మను కూడా తీసుకుని వెళ్లి బిళ్లంగోడు, చెడుగుడు, తొక్కుడుబిళ్ల, కోతీ కొమ్మంచి ఆడడం నేర్పాడు. కనకయ్యతల్లీ, రంగమ్మ తండ్రీ స్వయాన అన్నా చెల్లెళ్లు. చిన్న తనంనుంచి అన్యోన్యంగా వుండే రంగమ్మ కనకయ్య కలిసి ఐదో క్లాసువరకు చది వారు. రంగమ్మ ఐదోక్లాసుతో స్వస్తిచెప్పి అష్టాచెమ్మ, వైకుంఠపాళీలతో నతమతమైతే కనకయ్య మరో మూడేళ్లుమాత్రం చదివి తండ్రికి వ్యవసాయం చేయించడంలో సాయం చేయడంలో మునిగిపోయాడు' పెద్ద వాళ్లతోపాటు పిల్లలుకూడా ఎదిగి పెళ్లీ డుకు వచ్చారు. ప్రొద్దుటినుంచి సాయంత్రం వరకు పొలాలు దున్నుకుని ఎప్పుడూ పేడ రొచ్చులతో వుండే కనకయ్యకు చచ్చినా పిల్లనివ్వనంది రంగమ్మతల్లి. భార్యమాట కాదనే ధైర్యంలేక, కూతురి యిష్టాన్ని కాదంటున్నాననే బాధతో తాలూకాకు మొదటి గ్రాడ్యుయేట్ కాబోతున్న శేషయ్యకు యివ్వడానికి అయిష్టంగా అంగీక రించాడు రంగమ్మ తండ్రి.

పెళ్లయి అత్తగారింట్లో అడుగు పెట్టిన రంగమ్మకు అక్కడ వుండేది యిద్దరే వ్యక్తులన్న విషయం తెలిసింది. శేషయ్య— అతని తల్లి దుర్గాంబ.

గుమ్మంవద్ద తల్లిప్రక్కన నిలబడ్డ శేషయ్య, ఎడ్లబండి దిగుతున్న రంగమ్మను చూచాడు. భార్య అందంచూసి ఆనందంతో తబ్బిబ్బయ్యాడు. తన కొడుకు కళ్లు పత్తి [illegible] చేసుకుని కోడల్ని తదేకంగా చూడడం, యింట్లో అడుగుపెట్టి పెట్టక ముందే కోడలి ఆకర్షణకు లొంగిపోవడం దుర్గాంబ సహించలేక పోయింది. కూతుర్ని అత్తగారింట్లో దిగబెట్టడానికి వచ్చిన రంగమ్మతండ్రి మర్నాడే వెళ్లిపోయాడు.

దుర్గాంబ భర్త, ఆవిడ యివ్వన ప్రాంగణంలో అడుగు పెట్టాక శేషయ్యను అప్పజెప్పి కన్నుమూశాడు. పుట్టింటివారు ఎవరూ లేకపోవడంవల్ల, ఆస్తిని కాజేయా లని భర్త తరపు బంధువులు రాబందుల్లా కాచుకుని వుండడంవల్ల దుర్గాంబ అతి జాగ్రత్తగా వ్యవసాయం తనే స్వయంగా చేయించ సాగింది. చిన్నతనంనుంచి శేషయ్య తల్లికొంగు పట్టుకుని అమ్మా అమ్మా అంటూ తిరిగేవాడు. అతనికి స్వతంత్రంగా ఆలోచించే శక్తి లేకుండా దుర్గాంబ చేసింది. ఎందువల్లనంటే కొడుకు ఎప్పుడూ తన కనుసన్నల్లో వుండాలనీ, తనమాటకు ఎదురు చెప్పకూడదనీ, ఆమె నిశ్చయించు కోవడంవల్ల చిన్నతనంనుంచి శేషయ్యను అలాంటి వాతావరణంలో పెంచింది. అన్నంలో ముందు వంకాయపచ్చడి కలుపు కోవాలో మునక్కాయల పులుసు కలుపుకో వాలో దుర్గాంబ చెప్పాలి. ఏ రంగుచొక్కా, షరాయి వేసుకోవాలో దుర్గాంబ యివ్వాలి. యిస్కూల్కి చదివే రోజుల్లో చెప్పులు కుట్టించుకోమంది. ఇష్టంలేదనీ పైకి అనలేక, ధైర్యంలేక అయిష్టంగా శేషయ్య శేషయ్య చెప్పులు కుట్టించుకున్నాడు. అతనికి తల్లి అంటే భక్తి అనేకంటే భయం-అనడం సబబుగా వుంటుంది. తనదంటూ ఒవ్యక్తిత్వం లేకపోవడంవల్ల అతని నరాల్లో అమ్మ అంటే పిరికితనం ప్రవహించసాగింది. వోనమాలురాని దుర్గాంబ మెడిసన్ విద్య బియ్యేలో చేరు అంటే కిక్కురుమనకుండా చేరాడు, బియ్యేకంటే మెడిసన్ మంచిదని దుర్గాంబకు నచ్చజెప్పే ధైర్యంలేక. శేషయ్య ఆ రాత్రంతా ఏడ్చాడు. రోగి వుష్ణోగ్రతను ధర్మామీటరుతో కొలిచినట్టు శేషయ్యను కూడా ఎప్పటికప్పుడు చెక్‌చేసి 'అమ్మయ్య ఫర్వాలేదు నా కొడుకు మారలేదు. మార కూడదు' అనుకుని హాయిగా నిట్టూర్చు తుండేది దుర్గాంబ.

తను వచ్చి రెండు రోజులు కావస్తున్నా కనీసం తనను పలకరించని భర్త మీద

# ఎడారి వెన్నెల

రంగమ్మకు కొంచెం కోపంగా వుంది. కోడల్ని వెయ్యి కళ్లతో చాటునుంచి కనిపెడుతూనే వుంది దుర్గాంబ. అప్సరసలా వున్న రంగమ్మను పలకరించాలని శేషయ్యకు లోపల వున్నా, తల్లి చూస్తుందేమో, ఏమంటుందోనని లోపల బిక్కు బిక్కుమంటోంది. తన భార్యతో మాట్లాడ్డానికి యితరులు ఏమంటారోనని భయపడాల్సిన అవసరంలేదని శేషయ్యకు తట్టలేదు.

ఏకనమిక్సు నోట్సు వ్రాసుకుంటున్న శేషయ్యకు గాజుల చప్పుడు వినిపించి వెనక్కు తిరిగాడు. ప్రక్క గది కిటికీ వూచలు పట్టుకుని రంగమ్మ నిలబడి వుంది. రంగమ్మ అందం ఏకనమిక్సు నోట్సు మూయించి, శేషయ్యను లేపింది కుర్చీలోంచి.

దగ్గరికి రమ్మన్నట్టు చెయ్యి వూపింది. ఆటూ యిటూ చూసి పిల్లిలా అడుగులో అడుగు వేసుకుంటూ కిటికీ దగ్గరికి వెళ్లాడు.

'చదువుకుంటున్నారా ?'

'ఊఁ. పరీక్షలు.'

'ఇప్పుడేం పరీక్షలు యింకా ఆర్నెల్లు వున్నాయిగా ?'

'అవుననుకో. చదువుకోకపోతే అమ్మ కోప్పడుతుంది.'

'మీ అమ్మంటే మీకు అంత భయమా?'

ఇరవై య్యేళ్ల శేషయ్యజీవితంలో అలాంటి ప్రశ్న యింతవరకెవరూ వెయ్యకపోవడంవల్ల ఏం చెప్పాలో తోచలేదు.

'అటునుంచి ఈ గదిలోకి రండి కబుర్లు చెప్పుకుందాం' అంది రంగమ్మ కనురెప్పలు కదిలిస్తూ.

రంగమ్మ కళ్ళవైపు చిత్రంగా చూస్తున్న శేషయ్య నోరు చప్పరించి 'అమ్మో యింకేమయినా వుందా అమ్మ చూస్తే?' అన్నాడు చిన్నపిల్లలు బూచి కథకు భయపడిన భంగిమలో.

శారీరకంగా ఎదుగుతున్న శేషయ్య మానసికంగా నానాటికి కుంచించుకు పోతున్నాడనే ఆలోచన మొదటిసారిగా రంగమ్మ హృదయంలో బల్లెంలా గుచ్చుకుంది.

తలుపు చాటునుంచి యిదంతా గమనిస్తున్న దుర్గాంబ వెంటనే రంగంలోకి వచ్చి 'నీకేమయినా బుద్ధీ జ్ఞానం వుందటే భడవా. మానాన్న బుద్ధిగా చదువుకుంటుంటే, చదువు చెడగొట్టి ఏదేదో నూరి పోస్తున్నావ్. నా బిడ్డను నాకు దక్కకుండా చేయాలని చూస్తున్నావ్....దాని మాటలు వినకురా తండ్రీ' అంది.

తల్లి వాలకం చూసి శేషయ్య భయంతో బిగుసుకుపోయాడు.

వస్తున్న దుఃఖాన్ని ఆపుకోవాలని రంగమ్మ నోట్లో చీరె కొంగు కుక్కుకుంది. తను చేసిన నేరం ఏమిటి ? భర్తతో మాట్లాడ్డం తప్పా ?

కొడుక్కు పెళ్లి చేయడం తను చేసిన పెద్ద పొరపాటని దుర్గాంబ అనుకుంది. రంగమ్మను సాధ్యమైనంత దూరంగా వుంచడంవల్ల తన కొడుకు తన చెప్పు చేతల్లో వుంటాడని కూడా అనుకుని ఆలోచనలో పడింది.

పెరట్లో బావి ప్రక్కన అంట్లు ముందువేసుకుని కొబ్బరిపీచు, యిసుకతో వాటిని రుద్దడం రంగమ్మకు చాలా కష్టంగా వుంది. అలవాటులేని ఆ మోటు పనివల్ల చేతులు బొబ్బలెక్కి మంట పుడుతున్నాయి. అమ్మా, నాన్నా తనచేత యిలాంటి పనులెప్పుడూ చేయించలేదు. యిక్కడ కూడా తనే చేయాల్సిన అగత్యం లేకపోయినా అత్తయ్య తనచేత కావాలని చేయిస్తోంది. తను యిలా కష్టపడుతున్నట్టు నాన్నకు తెలిస్తే యింకేమయినా వుందా? తెలియకూడదు.

నోట్లో వేపపుల్లతో మొహంకడుక్కోడానికి బావిదగ్గరికొచ్చిన శేషయ్య అంట్లు తోముతున్న రంగమ్మను చూసి జాలిపడి 'రంగా నువ్వుతోముతున్నావేం?' అన్నాడు.

'పది రోజులనుంచి నేనే తోముతున్నాగా' అంది రంగమ్మ మొహంమీద పడుతున్న ముంగురుల్ని మోచేతితో నెట్టుకుంటూ.

వెనుదిరిగి నాలుగడులు వేసిన శేషయ్యకు తనసలు తల్లితో మాట్లాడగలనా అన్న భయంవేసి ఆగాడు.

'ఇంకా ఏం చేస్తున్నావే? కొంచెం గట్టిగా రుద్దితే నీ బాబుగాడి సొమ్మేం పోయింది, గిన్నెలు అరిగిపోతాయనా లేక నీ చేతులు కంది పోతాయనా అంత మఠారంగా తోముతున్నావ్?' అంటూ అక్కడికి వచ్చింది దుర్గాంబ.

'అమ్మా పాపం...' అంటూ శేషయ్య జోక్యం చేసుకున్నాడు మధ్యలో.

'నువ్వొక వెధవవు కాబట్టే అది యిలా తయారయింది. మొగుడన్నవాడు పెళ్లాన్ని అదుపులో పెట్టుకోవాలన్న ఆలోచనే నీకు లేదాయె'

'నేనేం చేసేదే? పాపం అదొక్కతే...'

'పైగా కన్నతల్లి ముందు పెళ్లాన్ని వెనుకేసుకొస్తున్నావ్. అసలు ఆడవాళ్ల విషయాల్లో నువ్వు కల్పించుకోకు. వెళ్లి చదువుకో!' అని దుర్గాంబ గద్దించడంతో శేషయ్య తల వొంచుకుని తన గదిలోకి వెళ్లాడు.

ఇరవైరోజుల్లోనే రంగమ్మకు జీవితం మీద విరక్తి పుట్టేంతగా నిరాశ చెందింది.

అంట్లు, వంట, పొలం, తిట్లు వీటితో రంగమ్మకు వూపిరాడేది కాదు. కావాలని తన మీద కత్తికట్టి సాధిస్తున్న అత్తమీద అప్పుడప్పుడు రంగమ్మకు కోపం వచ్చినా, అణుచుకునేది, చేసేది ఏమీలేక. మానసికంగా, శారీరకంగా విశ్రాంతి లేని రంగమ్మకు అప్పుడప్పుడు భర్త జ్ఞాపకం వచ్చేవాడు, చీకటిలో జ్యోతిలా. పాపం పిచ్చివాడు అని నిట్టూర్చేది.

ఆ రాత్రి అర్ధరాత్రి వరకూ రంగమ్మకు నిద్ర రాలేదు. ఏవేవో ఆలోచనలు మిణుగురు పురుగుల్లా అంతరంగంలో తిరుగుతున్నాయి. తను యింకా ఎన్ని కష్టాలు పడాలో? ఆయన ఎప్పుడు తనబాధలు గుర్తిస్తాడో? ఇంకా ఎంతకాలం తల్లికి భయపడుతూ వుంటాడో?అత్తతో తను తగాదా పెట్టుకుని భర్తతో బయటికి వెళ్లిపోతే? ఆయనకు అంత ధైర్యం కూడానా? ఆయన వాళ్లమ్మకు భయపడుతున్నంత కాలం తనగతి యిలానే వుంటుంది. ఆయనతో ఈసారి గట్టిగా చెప్పాలి. బియ్యే చదువుకునే వ్యక్తి తల్లికి అంత భయపడతాడా? తన కాళ్లమీద తను నిలబడలేననే పిరికితనమా? వాళ్లమ్మ అనుమతి లేకుండా తనేమీ చేయలేననే అధైర్యమా? ఆయనలాంటి వాళ్ళు, తన లాంటి వాళ్ళు, అత్తలాంటి వాళ్ళు ఈ లోకంలో వుంటారా?

'ఉష్...ఉష్'

కంగారుగా లేచింది రంగమ్మ.

దొంగలా నడుస్తూ వస్తున్నాడు శేషయ్య.

భర్తను చూడగానే ప్రాణాలు లేచి వచ్చాయి. చాపమీద రంగమ్మ ప్రక్కన

కూర్చున్నాడు.

'ఇంకా నిద్రపోలేదా?'

'ఉహూ'

'నువ్వు చాలా కష్టపడుతున్నావ్ రంగా?'

తను కష్టపడుతున్నానని కనీసం భర్త గుర్తించినందుకు రంగమ్మకు కాస్త ఊరట కలిగింది.

'అటు చూడండి బయట వెన్నెల, ఎంత తెల్లగా వుందో?'

'నిన్ను చూస్తుంటే నాకు చాలా బాధగా వుంది రంగా'

'మనం ఏోపని చేస్తే?'

'తప్పకుండా చేద్దాం. చెప్పు'

'ఒట్టు'

'ఒట్టు'

'మనం యిద్దరం ఈ యిల్లు వదిలి వెళ్ళిపోదాం'

'అమ్మో యింకేమయినా వుందా? అమ్మకు తెలిస్తే?'

'కొడుతుందా?'

'కొట్టదు'

'నన్నిలానే చావమంటారా?'

'ఉహూ'

'మరి? మనం సుఖంగా వుండొద్దా? ఎంతకాలం నన్నీ నరకంలో జీవించమంటారు. నే నింతకాలం మిమ్మల్ని చూసుకుంటూ ఈ బాధలన్నీ పడుతున్నాను, బయటికెడితే మనం బ్రతకలేమని భయమా? మీకా అనుమానం వుంటే మా యింటికి పోదాం పదండి. మా అమ్మా నాన్నా మనల్ని పువ్వుల్లో పెట్టుకుని పూజిస్తారు.'

'అమ్మ ఏమంటుందో? ఓసారి అమ్మను అడుగుతాను'

రంగమ్మకు నవ్వాలో ఏడవాలో అర్థం కాలేదు. ఇలాంటి విచిత్రమైన మనుషులు ఎందుకీ సృష్టిలో వుంటారబ్బా అనుకుంది. కేవలం చదువువల్ల మనిషి మానసికంగా ఎదగడు అనిపించింది. ప్రక్క గదిలోంచి వీళ్ళ మాటలు మొదటినుంచి చివరి వరకు వింటున్న దుర్గాంబ కసిగా పళ్ళు కొరికింది. తను ప్రాణప్రదంగా పెంచుకుంటున్న పావురాన్ని డేగ తన్నుకు పోతున్నట్టు బాధపడింది. 'వ్యవహారం శృతిమించి రాగాన పడుతోంది. నా కొడుకును వలలో వేసుకోవాలని ప్రయత్నిస్తోంది. దాని ఆటలు అరికట్టాలి. ఈ చేతగాని; తుఫాను కాక ముందే తన దీపాన్ని తను కాపాడుకోవాలి. తన శేషు ఎప్పుడూ తనమాటే వినాలి'. అని గొణుక్కుంటూ తన మంచంవైపు నడిచింది దుర్గాంబ.

రెండునెలలు రెండు యుగాల్లా గడిచాయి. రంగమ్మకు సరిగా నిద్ర పట్టేది కాదు. ఒకోసారి అన్నంకూడా సయించేది కాదు. మానసిక వ్యథతో రంగమ్మ చిక్కి శల్యమైంది. కూతురి యోగక్షేమాలు తెలుసుకోవాలని రంగమ్మ తండ్రి ఒకటిరెండు వుత్తరాలు వ్రాశాడు. దుర్గాంబ, కొడుకు చేత జవాబు వ్రాయించింది. అమాయకంగా తల్లి మొహంలోకి చూసి తల్లి చెప్పినట్టు అక్షరం పొల్లుపోకుండా వ్రాసి చదివి వినిపించాడు. తను వ్రాసింది పచ్చి అబద్ధమని తెలిసీ, పెదవి విప్పే ధైర్యంలేక కవరుమీద అడ్రసువ్రాసి తన చేతులతోనే పోస్టుచేశాడు. కూతురు రాజభోగాలు అనుభవిస్తున్నట్టు చిత్రించే ఆ వుత్తరం చదువుకుని రంగమ్మ తలిదండ్రులు రంగమ్మ అదృష్టానికి తృప్తి పడ్డారు.

ఆరోజు మిరపచేలో కలుపు తీయించడానికి వెళ్ళిన రంగమ్మ సాయంత్రం ఆరు గంటలయినా యింకా పొలంనుంచి తిరిగి రాలేదు.

'లేనట్టుందే, ఎక్కడికెళ్ళింది?'

కన్నీళ్ళు నిండిన కళ్ళెత్తి కొడుకువైపు చూసింది దుర్గాంబ.

ఏడుస్తున్న తల్లిని చూడగానే శేషయ్య కలవరపడ్డాడు. ఏదో బలీయమైన కారణం లేనిదే తల్లి కంట తడిపెట్టదని శేషయ్య ప్రగాఢవిశ్వాసం.

'ఏమిటే?'

'ఏం చెప్పేదిరా తండ్రీ' అంటూ ఏడుపు ఎక్కువ చేసింది.

'ఏం జరిగిందే?'

'ఏం జరగకూడదో అదే జరిగిందిరా తండ్రీ. మన పరువు కాస్తా గంగలో కలిసిపోయింది. ఇహ మనం నలుగురితో తలెత్తుకు తిరగలేమురా తండ్రీ'

'ఏమయిందే?'

'ఇంకేం కావాల్రా అవ్వవ్వ చెప్పుకుంటే సిగ్గుచేటు నీ పెళ్ళాం ముండ మనకు ఎంత అపకీర్తి తెచ్చిందో చూడ్రా'

'ఏం చేసింది?'

'మన నాయుడుగారి పాలేరు వెధవాయిది...ఛీ ఛీ నానోటితో నేనెలా చెప్పేదిరా తండ్రీ' అంటూ ఏడుపురాగం ప్రారంభించింది.

తల్లి అబద్ధం చెపదని శేషయ్య నమ్మకం. నిజానిజాలు స్వతంత్రంగా ఆలోచించడం అతని బియ్యేచదువు అతనికి నేర్పలేదు. అతనికి అంత స్వంత ఆలోచనే వుంటే తల్లిచేతిలో మైనపు బొమ్మలా వుండేవాడు కాదు.

'నువ్వొక వెర్రి నాగన్నవు. నీకు పరువు గొడవతప్ప మరోధ్యాసే లేదు. నువ్వు వెర్రి నాగన్నవు కాబట్టి నీకళ్ళకు గంతలుకట్టి అది ఎంత నాటకం ఆడుతుందో చూడు. పెళ్ళాన్ని తన్ని అదుపులో పెట్టుకోవాలిరా అని నెత్తీనోరు కొట్టుకుని నీకు చెప్తున్నాను. యిప్పటికయినా కళ్ళు తెరువు' అంటూ కొంగుతో కళ్ళు వొత్తుకుంది.



[illegible]
వుంటదని తల్లి చెప్పేసరికి ఎంతకాలం నిజం వుండదో విషయం మొత్తు కారిన శేషయ్యకు బుర్రకు తట్టలేదు.

'ఎక్కడికిపోయింది?' కోపంతో ఎర్ర బడ్డ కొడుకుమొహం దుర్గాంబకు కొంచెం సంతృప్తిని యిచ్చింది.

'ఇంకెక్కడికి పోతుంది. వాడితో ఎక్కడ కులుకుతుందో రాణీగారు' అని దుర్గాంబ అంటుండగా రంగమ్మ వచ్చింది.

ప్రొద్దుటి నుండి పొలంపనితో అలసి పోయిన రంగమ్మ చీరకొంగుతో మొహం మీది చెమట తుడుచుకుని కొడవలి గూటి మీద పెట్టి వాళ్ళిద్దర్నీ చూసింది.

'ఇప్పటి కయ్యాయన్నమాట పెత్తనాలు' ఆవేశంగా అన్నాడు శేషయ్య.

భర్త స్వరంలో అంత తీవ్రత ఆశించని రంగమ్మ బిత్తర పోయింది.

'పెత్తనా లేమిటండీ? పొలం నుంచి యిప్పుడే వస్తున్నాను'

'పొలంనుంచా? వాడి యింటినుంచా?' అంది దుర్గాంబ.

'అత్తా' అంది రంగమ్మ బిగ్గరగా.

'చూడరా పతివ్రత అరుస్తోంది. అడగ వేరా మొద్దులా నిలబడి చూడకపోతే. నీచేత కాని తనంవల్లనే అది యింత బరితెగిం చింది. జుట్టుపట్టుకుని నాలుగు తన్నకుండా చూస్తావేరా' అంటూ దుర్గాంబ ఊసి కొలిసింది,

ఎదురుగా కనిపించిన ముల్లుకర్ర తీసు కుని రంగమ్మను గొడ్డును బాదినట్టు బాది మెడ పట్టుకుని బయటికినెట్టి 'మళ్లీ ఈ యింట్లో కాలుపెట్టావంటే నిలువునా నరికేస్తాను. వెళ్ళి వాడితోనే వుండు'అంటూ ఆయాసపడుతూ తలుపులు వేశాడు.

తనకొడుకు తను చెప్పినట్టు చేసినందుకు దుర్గాంబ సంతోషపడి 'అన్నం తిందువుగాని పద నాన్నా. ఆ గుదిబండనుకుని మెడకుకట్టి నీకు అన్యాయం చేశానురా తండ్రీ' అంది.

శేషయ్య నెట్టినప్పుడు రంగమ్మ ఎదు రుగావున్న మొండిగోడ మీదపడింది. కత్తిలా వున్న రాతికి నుదురు తగిలింది. శేషయ్య కొట్టిన దెబ్బలకు తోడు ఈ రాతిదెబ్బతో స్పృహతప్పి అలానే పడిపోయింది. ఎప్పుడో ఏనిమిది గంటలకు తెలివివచ్చి కళ్ళు తెరి చింది. చుట్టూ చీకటి. వొళ్ళంతా

# ఎడారి వెన్నెల

నొప్పులుగా వుంది. నుదుటి మీదినుంచి చెంపలవరకు గడ్డకట్టిన నెత్తుటి చార చేతికి తగిలింది. శరీరం కదిలించడానికి కూడా శక్తిలేనట్టుగా వుంది. తూలుతూ వెళ్ళి తలుపు తట్టింది. తట్టి తట్టి తలు పులవద్ద కూలబడింది. గొంతులో వోపిక వున్నంతసేపు భర్తను, అత్తను పిలిచింది. లేచింది. వో నిశ్చయానికి వచ్చింది.

రంగమ్మ వాలకం చూసిన తలిదండ్రులు నోట మాటరాక నిర్జీవ ప్రతిమలయ్యారు. కొనవూపిరితో రక్తసిక్తమయిన బట్టలతో వచ్చిన కూతుర్నిచూసి వాళ్ళు తల్లడిల్లి పోయారు. నాలుగురోజుల తర్వాత మామూలు మనిషయిన రంగమ్మ సంగ తంతా వివరంగా చెప్పింది. దుర్గాంబను చంపేస్తానన్నాడు కోపంతో వున్న తండ్రి. కూతురి జీవితం తనే నాశనం చేశానని తల్లి కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చింది. రెండునెలల తర్వాత రంగమ్మ తండ్రి దుర్గాంబవద్ద కెళ్ళాడు. నీతితప్పిన కోడలు తమ కవసరంలేదని శేషయ్య తరపున దుర్గాంబ చెప్పింది. అల్లుడిని అడిగి ప్రయో జనం లేదని నిరాశగా ఆయన తిరిగివచ్చాడు. ఆర్నెల్ల తర్వాత దుర్గాంబతరపు దూరపు బంధు వొకతను వచ్చాడు.

'దుర్గాంబకు చాలా సుస్తీ చేసింది. శేషయ్య నిన్ను తీసుకురమ్మన్నాడు. వాళ్ల మ్మను చూడడానికి ఎవరూ లేరు' అన్నాడు ఆ బంధువు.

'డబ్బులిస్తే కిరాయి మనుషులు చాలా మంది దొరుకుతారు' అంది రంగమ్మ కోపంగా.

'తప్పమ్మా అలా అనకూడదు. నువ్వు వెడితేనే మంచిది' అని తలిదండ్రులు చాలా సేపు నచ్చజెప్పారు.

'ఎవరికి మంచిది నాన్నా? నేను వెళ్ళి ఆవిడకు స్వస్థత కుదిరేవరకు వెట్టి చాకిరీ చేయాలి. ఆవిడకు జబ్బు నయంకాగానే నన్ను కుక్కను తరిమినట్టు తరిమేస్తారు. నేను అక్కడ సుఖపడలేను నాన్నా. నేను అక్కడికి వెళ్లను నాన్నా' అంటూ రంగమ్మ తండ్రికాళ్ళు చుట్టుకుంది.

'సరేనమ్మా, నువ్వు యిక్కడే వుండు తల్లీ. నిన్ను ఆ యమకూపంలోకి పంపనమ్మా'

అన్నాడు రంగమ్మ తండ్రి.

వచ్చిన పెద్దమనిషి మరేక్కువగా మాట్లాడలేక వెళ్ళిపోయాడు.

దుర్గాంబకు వొంట్లో బాగులేనప్పుడో, శేషయ్యకు సుస్తీ చేసినప్పుడో, సూర్పిళ్ళ ట్రైంలోనో రమ్మని రంగమ్మకు కబురు చేసేవారు. స్వయంగా శేషయ్య ఒక్కసారి కూడా రాలేదు. వాళ్ళు కబురుపంపిన ప్రతి సారి, రానని రంగమ్మ చెప్పిపంపడం పరి పాటయింది. ఏణ్ణార్ధం తర్వాత మనుష్యుల్ని పంపడాలు, ఉత్తరాలు రాసుకోవడాలు పూర్తిగా ఆగిపోయాయి. మొదటి రెండేళ్లు తన జీవితం అడివికాచిన వెన్నెలయిందని బాధపడిన రంగమ్మ క్రమ క్రమంగా తన వివాహంగురించి మరిచిపోయింది. చచ్చినా మళ్ళా అత్తగారిగడప తొక్కకూడదని రంగమ్మ అనుకుంది.

కనకయ్యకు పెళ్లి సంబంధాలు వస్తు న్నాయి. ఒకరోజు కాలవగట్టున కనిపిం చిన రంగమ్మతో కనకయ్య అన్నాడు 'చిట్టీ నీతో వో ముఖ్యమైన సంగతి చెప్పాలి'

ఏమిటన్నట్టు రంగమ్మ చూసింది.

'నాకు పెళ్లిసంబంధాలు వస్తున్నాయి. నీ కిష్టమయితే నిన్ను చేసుకుంటాను. పెద్ద వాళ్లగురించి నువ్వు భయపడాల్సిన పన్లేదు. నే చూసుకుంటాను.'

రంగమ్మ ఆశ్చర్యపోయింది. పెళ్లయి భర్త వదిలిన తనను చేసుకోవడానికి యిష్టపడు తున్న కనకయ్యబావ ఔదార్యానికి రంగమ్మ మనసులో నమస్కరించింది.

'ఇంకా నాకు పెళ్లెందుకు బావా? నన్నిలానే వుండిపోనీ' అంటూ నిర్లిప్తంగా నవ్వింది.

ఎంత ప్రతిమాలినా రంగమ్మ వినలేదు. తర్వాత కనకయ్యకు మంగమ్మతో వివాహం జరిగిపోయింది.

మరో ఐదేళ్ల తర్వాత రంగమ్మ తండ్రీ, తల్లీ ఏడాది తేడాతో, రంగమ్మ జీవితం నాశనమయిపోయిందన్న దిగులుతో శాశ్వ తంగా కన్ను మూశారు.

ఇరవై రెండేళ్ళకే రంగమ్మ వొంటరిదయి పోయింది. భర్తను, అత్తను మనసులోంచి శాశ్వతంగా చెరిపివేసుకుని ఆ వూళ్లోనే స్థిరపడిపోయి, తండ్రి మిగిల్చిన అరెకరాల మెట్టను పదహారెకరాల మాగాణిగా మార్చు కోడానికి మరో యిరవై రెండేళ్ళు పట్టింది.

కర్త... పెళ్లి [illegible] తనే తలోచ
వలు అప్పుడప్పుడు నీటి బుడగల్లా ఒకటి రెండు క్షణాలు నిలిచి టప్‌మని పగిలి పోయేవి.

'చిట్టీ అలా నిలబడ్డావేమే, ఇదిగో అక్షింతలు' అంటూ కనకయ్య పసుపు బియ్యం యివ్వబోయేంతవరకూ రంగమ్మ గతంలోనే వుండిపోయింది.

'తే...తే...' అంటూ అక్షింతలు అందుకుని చెమర్చిన కళ్లను ప్రక్కకు త్రిప్పుకుని పెళ్లి మండపంలో వున్న కొత్త దంపతుల మీదికి విసిరింది. వెయ్యేళ్ళు సుఖంగా వుండమని మనసులో దీవించి.

పెళ్లి పందిట్లో హడావిడి తగ్గేసరికి రాత్రి పదకొండయింది.

'ఇప్పుడేం పోతావ్. ఇక్కడే పడుకో అక్కా' అంది మంగమ్మ.

'తెల్లారగట్ల జీతగాడు వస్తాడు పోతానమ్మా' అంటూ రంగమ్మ చాప మీదినుంచి లేచింది.

'సరే నక్కా' అంటూ మంగమ్మ బొట్టు పెట్టింది.

'పొద్దుపోయింది సుబ్బుల్ని తోడుగా తీసుకెళ్లవే చిట్టీ' అన్నాడు చుట్ట ముట్టించబోతున్న కనకయ్య.

'ఫర్వాలేదు బావా' అంటూ రంగమ్మ బయటికొచ్చింది.

రంగమ్మ యింటికి వచ్చేసరికి వసారాలో అరుగుమీద చుట్ట తాగుతూ వో వ్యక్తి కూర్చుని వున్నాడు. ఎవరబ్బా అనుకుంటూ దగ్గరికెళ్లింది. చీకటిగా వుండడంవల్ల అసలు మొహం కనిపించక 'ఎవరు ?' అంది.

'నేను' అన్నాడు అతను.

అది ఎప్పుడూ వినిన గొంతుక కాకపోవడంవల్ల రంగమ్మ గూట్లో వున్న కోడిగుడ్డు దీపం ముట్టించి, దీపం పైకెత్తి పట్టుకుని అతని మొహంలోకి చూసింది.

యాభై ఏళ్లు నిండాయి. నెత్తి చుట్టూ తప్ప నెత్తి మీద అసలు వెంట్రుకలు లేవు. లావుపాటి మీసాలు తెల్లగా వున్నాయి. అతని కళ్ళజోడు కళ్లలో దైన్యంతో పాటు చెమ్మ కూడా వుంది. నెత్తి మీద పిడుగు పడ్డట్టు రంగమ్మ దిమ్మెరపోయింది. వొడ్డున పడ్డ చేపపిల్లలా మనసులో ఆలోచనలు గిజ గిజ కొట్టుకుంటున్నాయి.

'మీరా!' అంది రంగమ్మ బలవంతాన పెదలు కదుపుతూ.

'నేనే రంగా!' వుద్వేగంతో నిండిన కంఠంలోంచి మాటలు జీరవోగా దొర్లాయి.

అంతే. నిశ్శబ్దం. ముప్పయి ఏళ్ళనుండి పేరుకున్న స్తబ్దత దుప్పటిలా వాళ్లిద్దరి మధ్య పరుచుకుంది.

దూరాన ఎక్కడో పలుపు తెంచుకోవాలని అరుస్తున్న లేగదూడ అరుపు సన్నగా వినిపిస్తోంది.

'ఇన్నాళ్లకు నా కళ్లు తెరుచుకున్నాయి రంగా! ఎందుకూ కొరగానివాడిలా తయారు చేసింది అమ్మ. నేను తనకు దూరమవుతానని నిన్ను నాకు దూరం చేసింది. జడత్వంతో నిండిన నేను పండంటి నీ జీవితాన్ని పాడుచేశాను. పండు యవ్వనంలోవున్న నిన్ను నిర్దాక్షిణ్యంగా నిర్జరారణ్యంలో వదిలి పెట్టాను. స్వతంత్రంగా ఆలోచించుకోనివ్వకుండా పీడలా వున్నింతకాలం అంటిపెట్టుకుని వున్న అమ్మ చచ్చిపోయి ఆర్నెల్లయింది. జీవితమంటే ఏమిటో నాకీ ఆరు నెలల్లోనే అర్థమయింది. రంగా! నిన్ను దూరం చేసుకున్న నా దౌర్భాగ్యానికి నేనెంత బాధ పడ్డానో నీకెలా తెలుస్తుంది? గడిచిపోయిన నీ యవ్వనపు ఘడియల్ని నేను నీకు తెచ్చి యివ్వలేను కాని, యిహ నిన్ను దూరం చేసుకోలేను రంగా. నాతో వచ్చేయ్. ఇవి కాళ్లు కాదు రంగా...' అంటూ రంగమ్మ చేతుల్ని పట్టుకున్న శేషయ్యకు అవి చల్లగా మంచుగడ్డలా అనిపించి అతని గుండె వో లిప్తపాటు స్తంభించి పోయింది.

---

కూరలూ గుణాలూ!

# ఉడుము మాంసం

ఉడుము మాంసం నడుముకు సత్తువ చేస్తుంది. శరీరంలో గల విషపదార్థాలను హరిస్తుంది. జఠరదీప్తి నిస్తుంది. రక్తాన్ని శుభ్రపరుస్తుంది. శరీరానికి బలాన్నియిస్తుంది. పైత్యవాతములను, శూలము, కఫాన్ని హరిస్తుంది. వీర్యవృద్ధి నిస్తుంది. సుఖవ్యాధులు గల వారికి దీని మాంసం మేలుచేస్తుంది. నేతిలో వేయించిన దీని మాంసంతో చేయబడిన లేహ్యం క్షయవ్యాధిని ఉపశమింప జేసేటందుకు తోడ్పడుతుంది.

కాస్త అజీర్ణం చేస్తుంది.

దీని దుర్గుణాలకు విరుగుడు: నువ్వుల నూనె.

## తాబేలు మాంసం

తాబేలు మాంసం చలవ చేస్తుంది. వీర్యాన్ని వృద్ధి పొందిస్తుంది.

మనుష్యుని యొక్క ఏ అవయవం నొప్పిగా వుంటుందో తాబేటి యొక్క ఆ అవయవాన్ని తీసి ఆ నొప్పిగల అవయవంపై వుంచి కట్టుకట్టినట్లయితే నొప్పి తగ్గుతుంది.

తాబేటి గుడ్డులోని పచ్చసొనను, అర్ధ పావు ఆవుపాలలో వేసి, ఎటువంటి దగ్గు గలవారికిచ్చినా ఆ దగ్గు తగ్గుతుంది.

దీని మాంసం గురుత్వం చేస్తుంది.

దీని దుర్గుణాలకు విరుగుడు: యవక్షారము.

## కుందేలు మాంసం

కుందేలు మాంసం కాక చేస్తుంది. వీర్యాన్ని వృద్ధి పొందిస్తుంది. దేహపుష్టిని, బలాన్ని యిస్తుంది. శరీరానికి మంచి కాంతి నిస్తుంది.

కఫం, పైత్యం, మేహం, బొట్లుబొట్లుగా పడు మూత్రవ్యాధి, రక్తం పడే మూలవ్యాధి గలవారికి దీని మాంసం మేలు చేస్తుంది. కళ్ళకు చలువ చేస్తుంది. కొన్ని రకములయిన పుళ్ళు శీఘ్రంగా మానేటందుకు దోహదం చేస్తుంది.

ఉష్ణతత్వం గల శరీరులకు దీని మాంసం అపథ్యకరమయినది.

దీని దుర్గుణాలకు విరుగుళ్ళు :— సిరికా, గంజి.

## జింక మాంసం

జింక మాంసం త్రిదోషములను గొట్టును. జఠర దీప్తినిస్తుంది.

ధనియాలు, ఆవాలు వీనితో కాచిన కషాయంతో జింకమాంసంకలిపి పుచ్చుకున్నట్లయితే వాతరక్తం హరిస్తుంది. దీని మాంసం మల మూత్రాలను బంధిస్తుంది.

జింక మాంసంయొక్క దుర్గుణాలకు విరుగుళ్ళు:—1. సిరికా 2. పులుసు.

—సేకరణ: ఆకుండి నారాయణమూర్తి




### జరిగిన కథ

రఘు, రామం, వేణు ముగ్గురూ అన్నదమ్ములు. వాళ్ళ ముద్దుల మరదలు సుధ. సుధ ఒంటిపిల్ల. సుధ తల్లి జానకమ్మ. బర్మానుంచి కాందిశీకురాలిగా వచ్చిన జానకమ్మకి ఆశ్రయమిచ్చారు శర్మగారు. ఆయన భార్య పార్వతమ్మకి సుధ అంటే ఎనలేని అభిమానం. రఘు సుధ మీద ఎక్కువ అభిమానం చూపిస్తూ వుండడం రాధ కనిపెడుతూనే వుంది. రఘుని ఆకర్షించడానికి రాధ ఫాషన్ పరిశ్రమకి వెశాల చేర్తుంది. మంచి డాక్టరనిపించుకోవాలని, లక్ష్యాన్ని సాధించాలని రఘు కోరిక. దగ్గరజేరిన రాధ ఆకర్షణనుంచి తప్పుకుంటూ మనసు లక్ష్యంవైపు కేంద్రీకరిస్తుంటాడు రఘు. సుధ వివాహం కోసం చేసే ప్రయత్నాలు రఘు సలహా మీద జానకి అవు చేస్తుంది. రఘు మనసు పరిపరివిధాల పోతున్నది. సుధకి అన్యాయం చేస్తున్నానేమో అని అతను బాధపడుతున్నాడు. సుధ కాలికి ఆపరేట్ చేశారు. సుధ ఇప్పుడు అందరిలాగా నడవగల్గుతున్నది. రాధ ప్రవర్తన రఘుని చాలా ఇబ్బందిపెడుతున్నది. రాధ మోసపోతుందేమోననేదే అతని బాధ. తను సుధని పెళ్ళిచేసుకుంటున్నట్లు రాధతో చెప్పేశాడు రఘు.

---

## 16

ఆ తరవాత వారంలో బంధుమిత్రుల సమక్షంలో శాస్త్రసద్ధతిని నిరాడంబరంగా రఘూ సుధల వివాహం జరిగిపోయింది. పాపం ప్రయత్నంగా రాధకూడా ఈ పెళ్ళికి వచ్చిందిగాని అందరిలాగా పరిపూర్ణానందాన్ని మాత్రం అనుభవించలేక పోతూండేది.

రఘు విదేశ ప్రయాణాన్ని గురించిన ఇబ్బందయిన పనులన్నీ ఆ దారే చూసుకున్నా ప్రయాణానికి ఒక్కవారం మాత్రమే వ్యవధానం వున్నందున, మైసూరు బృందావనం మొదలైనవి మాత్రమే తిరిగి వచ్చేశారు. అదీ, పార్వతమ్మగారి ప్రార్థన ప్రకారం లలితాంబగుళ్ళో, కుంకుమపూజలూ వగైరాలన్నీ అయి అవిన్నీ తృప్తిపరిచేకనే రఘు తన ప్రయాణం పెట్టుకున్నాడు.

మైసూరు నుండి తిరిగొచ్చిన మూడో నాడే రఘు ప్రయాణం! శీలున్నంతవరకూ ఏవేవో తయారిస్తూంది జానకి. సుధవాట్నని పొందిగ్గా, పట్టుకెళ్ళేందుకు సరిపోయే తూకానికి మించకుండా కట్టి పెడుతుంటే, తల్లితో మాట్లాడుతూ ఉయ్యాల బల్లమీద కూర్చున్నాడు రఘు.

శ్రమకి వెనకాడకుండా జానకి చూపుతూన్న ఆ శ్రద్ధకి తన్లో తనే ఆశ్చర్యపడుతూ గౌరవంగా ఆవిడవేపే చూస్తున్నాడు రఘు. మొదట్నుంచీ కూడా జానకి యందొక గొప్ప గౌరవ భావమే రఘుకి. అంతే కాదు కలకల్లాడుతూండే ఆవిడ మొహం చూస్తున్నప్పుడల్లా 'ఈవిడ నుదుటి తిలకం దైవం చెరపలేదు. పొరపాట్న జరిగిందేమో,' అన్నట్లుగా ఒక భ్రమ కల్గుతూండేది అతనికి. ఎన్నిమార్లో ఇలా తోచినప్పుడల్లా ఆవిడకీ దుర్గతిపట్టినప్పటి సంభవాన్ని గురించి తల్లినీ, అత్తనీ ఏవేవో ప్రశ్నలు వేస్తుండేవాడు కూడా.

ఒకసారి ఇక వుండబట్టక పార్వతమ్మగారితో, 'అత్తకీటువంటి రాత పట్టుండదేమో, ఆ మొహం చూస్తే తెలియడం లేదూ' అని అనేశాడు కూడా రఘు.

'అయ్యో అదే కళ్ళారాచూస్తే అంతకంటే ఇంకా ఏం రుజువు కావాలి బాబూ. కళకళ్ళాడే దాని మొహం చూస్తుంటే నాకూ అలాగే అనిపిస్తూ వుంటుంది. మనకి మాత్రం ఏమిటిబాబూ, దాన్ని చూసిన వాళ్ళంతా అలాగే బాధపడుతుంటారు. ఆ దైవానికి మరి ఇంత ఉత్తమురాలైన దీనిమీది ఇంత నిర్దయ ఎందుకల్గిందో గానీ. అందుకే ఒక్కొక్కసారి, దీనికింత బాధ తెచ్చిపెట్టాడంటే, ఇక దేవుళ్ళలో ఏం సత్యం వుంది పోనిద్దూ, అనుకుంటాను. మళ్ళీ అంతలో ఇదంతా పూర్వజన్మ ప్రారబ్ధం, ఇప్పటిది కాదు, అని మళ్ళీ నాతో నేనే సర్దుకుంటూ వుంటాను. ఇలాగే దాన్నిచూళ్ళేకా, మానాలేకా, ఆ నాట్నుంచీ ఇలాగే కాలం గడుపుకొస్తున్నాను బాబూ' అన్నారు చెంగుతో కళ్ళొత్తుకుంటూ ఆవిడ. రఘు కూడా కొంత సేపాలోచన్లోపడి తరవాత తన ముఖ్య స్నేహితుల్ని కల్సుకుందుకు బయటి కెళ్ళిపోయాడు.

రాత్రి దీపాలు పెట్టాక ఇంటికొచ్చిన రఘు 'ఇవిగో సుధా, మన ఫోటోలు' అంటూ గదిలో బట్టలు సర్దుతూన్న సుధ వద్దకొచ్చి 'ఎలా వచ్చాయి, నవదంపతులు ఉల్లాస ప్రయాణంలో తీసుకున్న ఫోటో లెలా వుండాలో అలాగే వున్నాయా?' అన్నాడు. తనూ రాధాకలిసి తీసుకున్న ఫోటోల్నిచూపి సుధ అనాడన్న అదే ధోరణిలో తనూను.

'హాఁ? అంతకన్నా గొప్పగానే వున్నాయి' అంది. కొంటెతనంగా అతన్తోపాటు తనూ ఆ ఫోటోల్ని చూస్తూ.

'అన్నట్టు బావా?' అంటూ ఏదో చెప్పబోయిన సుధని—

'ఆ. ఆ. ఆగు, ఇంకా బావా ఏమిటి ఇటుపైన నాపేరుతో—'

'పెళ్ళేదు నువ్వు నిర్ణయించిన పద్ధతి ప్రకార ఇంకో మూడేళ్ళదాకా మునపటి బావనేగా' అంది సిగ్గుతో కూడిన కొంత నవ్వుతో సుధ.

'అబ్బో పిట్టబాగానే కూతపట్టిందన్న మాట, ఆ సిగ్గంతా ఏమయిందో అమ్మాయి గారికి...' అంటూ సుధని దగ్గరకి తీసుకో

బోయాడు రఘు.

'ఆ. ఆ పెద్ద ఉత్తరంలో లిఖించిన షరతులన్నీ గుర్తున్నాయా?' అని రఘు అరోజు తన నడిగిన ధోరణితోనే అడుగుతూ తుర్రున పారిపోయింది సుధ. సుధలో వచ్చిన చలాకీ తనానికి మురిసిపోతూ తన ప్రయోజకత్వాన్ని తల్చుకుని మనసార తృప్తి పడ్డాడు రఘు.

ఆ మర్నాడు బంధు మిత్రులందరి సాగనంపులతో అమెరికాకి ప్రయాణం అయ్యాడు రఘు. శర్మా పార్వతమ్మ గార్లూ, సుధా, సహాయార్థం వేణూ, బొంబాయి వరకూ కూడా వెళ్ళి రఘుని 'ప్లేన్' ఎక్కించి మొక్కుదల్చిన దేవుళ్ళకి మొక్కుకుంటూ వెనక్కొచ్చారు.

బావకిచ్చిన బాసకాపాడుకుందుగ్గాను ఎంతో శ్రద్ధగా చదువు సాగిస్తూంది సుధ.

సుధ మాటనేర్పుకీ బుద్ధి కుశలతకీ చురుకుతనానికీ కాలేజీలో పరిచయం వున్న వారంతా ఆశ్చర్య పోతూండేవారు. మనుష్యులవీ జంతువులవీ శరీరాలు కోసి పాశాన్ని జరి



పిస్తూన్నపుడు చలించకుండా ధైర్యంగా నిలబడి అవన్నీ శ్రద్ధగా అవగాహన చేసుకుంటూండే సుధ ధైర్యాన్ని విబ్బరాన్ని చూసి, మొదట్నుంచి ఇంత ఆసక్తి చూపే వార్ని మేమింతవరకు చూడనేలేదన్నంతగా ఆశ్చర్యపోయే వారక్కడి ప్రొఫెసర్లు.

అంతకంతకూ అతి శ్రద్ధను చూపుతూ అందర్నీ మించిపోతున్న సుధని చూసి,

'నీ గొప్పతనాన్నంతా ఎగదన్నేటంత గొప్ప డాక్టరుగా తయారవు తుందయ్యోయి నీ భార్య సుధ. ఎందుకన్నా మంచిది కాస్త ముందు జాగ్రత్తగా వుంటావని రాస్తున్నాం' అంటూ రఘుకి అతి ప్రాణస్నేహితులైన కొందరు రఘుకు దాపే ఉత్తరాల్లో రాస్తూంటే,

'మీ భార్య సుధాదేవి ఇంత అపార తెలివైనదీ, కార్యదీక్ష గలదీ అంటే ఆ ఘనతంతా నిజానికి నీకే చెందుతుంది రఘూ. ఎదో ఒక అవిటిపిల్లని గురించి మన భవిష్యత్తు నెందుకు లోకువ చేసుకోవాలీ, అనిగాని ఒకరికి ఉన్నతస్థానం లభించ జేసేందుకు గౌరవం పొందించేందుకూ మన మధ్య మన మెందుకు శ్రమపడేదీ, అని నువ్వుగనక అనుకుంటుంటే, సుధాదేవిలోని ఆ శక్తి తెలివితేటలూ చురుకుతనం మొదలైన ఈ ఇప్పటి ఆవిడ కీర్తికి కారణంగా వున్న ఈ లక్షణాలన్నీ వృధాగా ఆవిడలోనే జీర్ణమైపోయుండేవి కదా! అలా కాకుండా నీ శ్రమని లక్ష్యం చెయ్యకుండా నువ్వు చూపిన ఈ శ్రద్ధే ఆవిడ మహోన్నతస్థితికి కారణమయింది. భేష్ రఘూ. నీ లక్ష్యసాధనకు మేమంతా మెచ్చుకోవడంతోపాటు గర్విస్తున్నాం'అంటూ అతన్నీ అతని ఆదర్శాల్నీ వేనోళ్ల పొగడుతూ రాసేవారు అతని ఆత్మమిత్రులు మరి కొందరు.

ఇక అక్కడ రఘు సంగతా? అసాధారణమైన ఆ విచిత్రపు కేసుగురించి ఆ డాక్టరుతో పనిచేస్తూన్న ఆ వుత్సాహానికి తోడు ఇటు సుధ ప్రయోజకత్వాన్ని గురించి ప్రసంగిస్తూ తన స్నేహితులు వ్రాస్తున్న వుత్తరాలుచేరి అతన్ని బ్రహ్మానందంలో ముంచేస్తున్నాయి.

ఆ ఆనందాన్ని సుధకి విపులంగా రాయాలని అనుకుంటూనే, ఎప్పటికప్పుడు అందు కవకాశం చిక్కడంలే దతనికి. అందుకని ప్రారంభించిన ఉత్తరంలో తన మనసులోని ఉత్సాహం కొద్దీ తను వైద్య పరిశోధనలు

# అతని లక్ష్యం

చేస్తూన్న ఆ వ్యక్తినిగురించీ అతని చరిత్రని గురించీ తమ పరిశోధన్లతనిముందు ఎంతవరకూ పనిచేస్తున్నాయో, మొదలైన విషయాలతోనే ఉత్తరమంతా నింపేసి, ఆ సంగతి తరవాత గుర్తొందుకుని బాధపడుతూ మళ్లీ ఉత్తరంలోనైనా రాయాలని అనుకునేవాడు. ఇలాగే వరసగా జరిగిపోతూంది అతని ప్రయత్నం.

ఏ దెలావున్నా, మొత్తానికి అందరి మనసుకీ స్తిమితం ఒక విధమైన ప్రశాంతి కుదరడంవల్ల కాలం అతి త్వరగా దొర్లుకుపోతూ సుధ చదువు పూర్తికావచ్చింది.

రఘుకి మళ్లీ ఒకసారి ఇంటికి వెళ్లాలన్న ధ్యాస ఏడాదినుంచీ కల్గుతూన్నా తను వైద్యం చేస్తూన్న ఆ వ్యక్తికి ప్రజ్ఞకళ్లే అవకాశాలు ఎప్పటికప్పుడు కనుపిస్తూన్నట్టనిపిస్తూన్నందున ఆ చివరి ఫలితాన్ని కూడా తను దగ్గరుండి చూసివెళితే ఇక త్వరలో మళ్లీ రావాల్సిన పనుండదను కుంటూన్నందున అలాగే వారాలూ నెలలూ గడిచి మరో సంవత్సరంకూడా పూర్తయిపోయింది.

ఇక్కడ సుధకీ చదువుతో చాలావరకూ కాలక్షేపం అయిపోతూన్నా మధ్య మధ్యలో బావ జ్ఞాపకంకూడా తరుచూ వస్తూనే వుండేది. అదీగాక ఎప్పుడూ వదిలిపెట్టుండడం అలవాట్లేనందున రఘునొదిలి ఇన్నాళ్లిలా వుండడం సుధకెంతో కష్టంగా వుంటూంది. అప్పుడప్పుడూ విడిగా ఒక్కర్తే కూర్చుని బావతో తను గడిపిన ఆ రోజుల్ని గుర్తుకు తెచ్చుకుని అల్పానందంతో తృప్తిపడుతూ వుండేది, ఒక్కొక్కసారి మరీ బెంగనిపించినప్పుడు 'ఏవిటో ఈ బావ లక్ష్యాలూ ప్రయత్నాలూనూ, దేనికైనా హద్దూ పరిమితంటూ ఉండొద్దూ?' అని చిరాకుపడేది. మళ్లీ అంతలోనే. ఇదేం తెలివితక్కువతనం మరి బావకంత దీక్ష తలపెట్టిన పనిలో వుండబట్టేగా తన జీవితం ఈ విధంగా రాణించగల్గుత. అయినా బావ ముందే పెట్టేసివెళ్లిన గడువూ ఈ సంవత్సరమంతా ఇంకా వుందిగా అదీగాక. తన స్వప్రయత్నాల్ని గురించి ఏవిధమైన అడ్డంకులు, ఎప్పుడూ కల్పించకూడదన్నదీ బావ రాసిన నిబంధనల్లో అదీ ఒకటిగా. గడుసుబావ ఇందుకేగావల్ను అన్నింట్లకీ ముందే ఒప్పందాలు చేయించాడు.

రెండో నిబంధన గురించి గుర్తుకు రాగానే సుధ మొహం ఎర్రబడిపోయి, ఆ కొత్తల్లో జరిగిన ఒక సంఘటన గుర్తుకొచ్చింది.

'హనీమూన్'కి వెళ్లొచ్చినప్పట్నుంచీ ఒంట్లో కొంచెం నిస్త్రాణగా వుంటూన్న తనకి ఒకరోజు వికారంగా ఉండి కొద్దిగా వాంతు లారంభించేయి.

'అబ్బబ్బ ఆరోజు మొదలుకుని శాంతక్కయ్య చేసిన అల్లరి, హడావిడీ ఇంతా అంతానా?

ఇక ఆ అక్కయ్య మాటల్ని నమ్మి 'ఏం తినాలనుంది! అంటే—ఏం కావాలనుంది' అంటూ అత్తయ్యా 'అమ్మా'ల ఆనందంతో ఒకటే గెంతులు. 'హు వోసి పిచ్చి అమ్మల్లారా! బావా నేనూ చేసుకున్న ఒప్పందం మీకేం తెల్సున'ని నవ్వుకుంది తను. దైవ వశాత్తూ మొగవాళ్ల వరకూ ఈ విషయం పాకుకుండా అంతా భ్రమన్నది వీళ్లకే అర్థమైపోయింది గనక సరిపోయింది' ఇలా అప్పుడప్పుడూ గతాన్ని నెమరుకి తెచ్చుకుని నవ్వుకుంటూ వుండేది సుధ.

'అబ్బ ఎంత సేపని అలా ధ్యానిస్తావే చెల్లెమ్మా, నాకు కవిత్వమన్నా ఒచ్చేదవదు కదా? నీమీద నాలుగు పద్యాలన్నా అల్లుదామంటే' అంది వీణముందర కూర్చుని వరాగ్గా ఏదో ఆలోచిస్తూన్న సుధ భుజాలు పట్టి ఊగిస్తూ, శాంత.

'అబ్బ హడలిపోయానక్కా' అంది ఉలిక్కిపడ్డ సుధ.

'అయితే విన్నవి ఏం ప్రయోజనంలే. మా మరిదికి కొంచెంకూడా మంచి చెడ్డలు తెలియక పోయాక.' దొంగకోపం నటిస్తూ సుధపక్కని కూర్చుంది శాంత.

'తనకి తెలియన్దీ నువ్వు తెల్సుకున్నదీ అంటూ ఏం వుందక్కయ్యా నువ్వు మరీని' అంది సుధ.

'ఆ చాల్లెద్దూ, నీ వెనకేసుకు రావడం నువ్వూనూ. ఇటువంటివాడు ముందే పెళ్లి చేసుకెళ్లడం మాత్రం ఎందుకూ? అని.'

'ఎందుకా తనజోలికి మరెవ్వరూ రాకుండా ఈతీగెల బురఖా తొడ్డపడ్డానికి...'

'ఆ ఈ కబుర్లకేంలే కానీ, ఇలా ఏళ్లతరబడి అతనక్కడా, నువ్విక్కడా వుండడం అన్నది నీకు కష్టంగా లేదూ?'

'అబ్బే, అందుకేగా ముందు జాగ్రత్తగా

బావ నన్ని చదువులో ఇరికిస్తే' అంది నవ్వుతూ సుధ.

'ఏమో బాబూ నామట్టుకు నేనే అయితే ఇలా వెళ్లనిచ్చుండేదాన్నిగాను, ఒకవేళ వెళ్లినా ఇన్నాళ్లుండ నిచ్చేదాన్నిగాను తెలిసిందా.' అలొల్లక అరవై ఏళ్లూ మొగుడొల్లక ముప్ఫయ్యేళ్లూ అన్ని సామ్యంలాగా ఈ సరదాగా వుండాల్సిన—'

'అలా అనుకోవడం చాలా పొరపాటక్కయ్యా,మనుషులమై పుట్టింది ఒక్క సుఖపడ్డానికేనా! అంతకన్నా ముఖ్యమైన విధాయకాలెన్ని లేవూ.'

'ఏమో సుమా నాకవన్నీ తెలియవ్...'

'నిజంగా బావ అక్కడ సాధిస్తున్న అమోఘమైన విషయాన్ని చదువుతూంటే...నాకటువంటి అదృష్టం, అవకాశం, ఎప్పుడన్నా పడుతుందా? అని పిస్తూందంటే నమ్ము. అంత శిథిలమై పోయిన ఒక శరీరాన్ని మళ్లీ కూర్చి సరిజేసి సాధించారంటే— '

'ఏవిటే?' ఆశ్చర్యంగా అడిగింది శాంత.

'యుద్ధ సమయంలో అపాయాల్లో గాయపడ్డ వారందర్నీ కాపాడుతూండే ఒక డాక్టరు ఇక్కడి ప్రిస్సు పాలు ద్వారా బావకి పరిచయమయ్యాడుట. నాకాలు వైద్యమప్పుడుకూడా బావతో అతనూ వచ్చాడుట. ఆయన ఇరవై సంవత్సరాలపైగా ఆ కేసులో పనిచేస్తున్నారుట.'

'అమ్మ బాబో ఆయన వైద్యం చెయ్యడం మాకెలావున్నా ఆ రోగి ఇన్నాళ్లూ ఎలా పడుండగల్గాడు అని. నేనేనక్కైతే చాటుగా ఏ విషమో పుచ్చుకుని—'

'అబ్బ ఏమ్మాటక్కయ్యా' కసిరింది సుధ.

'లేకపోతే పాతికేళ్లపాటు వోమనిషి జబ్బుతో పడుండడమేమిటి చెప్పు. విడ్డూరం!'

'అబ్బబ్బ పూర్తిగా ఉప్పుంగా అంత తొందరేమిటే సీరూ. ఆయన ఇన్నేళ్లబట్టీ తీసుకోవడం లేదు. యుద్ధంలో ఎముకలన్నీ పొడైపోయి. మనిషిరూపంటూ లేకుండాపోయి ఒక ప్రాణం మాత్రం నిలబడిందిట మరి. ఆ గాయాల్లో ఎట్నుంచీ ఆ గాయపడ్డ వారితోపాటు లటు కొట్టుకొచ్చాడో ఇతను.'

'అంటే?'

'అంటే గాయపడ్డ వారందర్నీ యుద్ధ

# అతని లక్ష్యం

భయాల్నుంచీ మజలీలు మజలీలుగామారుస్తూ వుంటారుగా! అలా ఏదేశంనుంచి ఏ దేశానికి తీసుకు రాబడ్డాడో పాపం అతను! అతని శరీరంమీద ఎనిమిది పెద్దాపరేషన్లూ, పన్నెండుచోట్ల చర్మపు అతుకులూ, అంటే నాకాలుకి వేశారు చూడూ! అలాగ జరిగాయిట. తప్పనిసరి అవడంవల్ల,'

'రామరామా? ఇంతకీ అతనెలా వొచ్చాడో బాబూ!'

అదృష్టవశాత్తూ రెండేళ్లపాటు ప్రజ్ఞే లేదుట అతనికి. ఆ తరవాత ప్రజ్ఞ వచ్చిందిట గానీ, స్థిరంతప్పి మతిభ్రమలాగే మాటాడేవాడట. అలా వాదాపు పదహారేళ్లపాటు గడిచాక మళ్లీ వో లారీ విపత్తులో గాయపడి, ఇదివరకూ అతగ్గా మిగిలిన వకటి రెండు ఎముకలూ మళ్లీ విరిగి కూర్చున్నాయిట. మళ్లీ ప్రజ్ఞకూడా వచ్చిందిట.'

'ఏడ్చినట్టేవుంది. లేకపోతే యముడి చేతుల్లో పడ్డవాణ్ణి. వీళ్లు విడిపించి బతికిద్దామనే?'

'బతికిస్తున్నారుగా? అవన్నీ మళ్లీ అతికి చర్మమంతా మళ్లీ కుట్టి అన్నట్టు ఎంతో అందంగా ఉంటే అతని ముఖంమ్మీద వో అంగుళం చర్మం అతకాల్సొస్తే, పాపం తనకి కాస్త మచ్చా పడ్డా ఫరవాలేదనుకుని బావ తనదేం వ మీ ది చర్మాన్నిచ్చాడుట కూడా.'

'పైగా ఇదోహటా ఇంతకీ అతనేమయ్యాట్ట.'

'ఈ మూడేళ్లబట్టీ ప్రయత్నాల్బయ్యగా చెయ్యగా మనిషంతా ఎప్పట్లా అయ్యాట్టగానీ, ఇంకా ప్రజ్ఞమాత్రం రాలేదుట.'

'అయితే అతనికి తెలివొచ్చేదాకా మీ ఆయన రాడా? చాలా బాగుందిలే అతన్ని చెయ్యడం, నువ్వు మెచ్చుకోవడమూను.'

'నువ్వూ ఈ మెడిసెన్ చదివుంటే తెలిసొచ్చే దక్కా. ఇటువంటి అవకాశాల కోసరం ఎంత తాపత్రయం పడుతూంటారోనూ.'

'వెర్రి కుదిరింది. రోకలి తలకి చుట్టమన్నాట్ట. ఊఁ' నిట్టూరుస్తూ లేచింది శాంత.

'అయింది. అతనికి తెలివొచ్చే అవకాశాలన్నీ బాగా తోస్తున్నాయిట. అది కాస్తా దైవ కృపవల్ల త్వరగా జరిగితే—'

'ఇంతకీ మీ ఆయన వెళ్లింది—'

'ఆ కోర్సు నిరుడే అయిపోయిందిగా? ఇప్పుడిక ఆగిందల్లా ఇతనికోసరమే నన్ను మాట. అంటే ఈ పని తగలక పోవడమో తెమిలి పోవడమో జరిగుంటే ఈ ఏడాది. అక్కడ పనిచేసి వద్దాం అనుకున్నాడు. ఆటువంటి దేదీ వీలులేకుండా దాన్తోనే సరిపోయింది. అబ్బ. ఈ కేసు గనక జయిస్తేనా.'

'వోడనిండా కీర్తిపోసుకు వొస్తాడు మీ ఆయన. అంతేనా? ఇంకా డబ్బు సంపాదించి ఏవేవో కొని తెస్తాడేమో. మనకూ కావలసినవేవో కొట్టెయ్యొచ్చునని నేననుకుంటే'

'అటువంటివన్నీ ఎవరు పడితే వారే తెగ్రలుగాని ఇంత గొప్పకీర్తిని ఎవరు సంపాదించుకు రాగ్రలని అక్కా,' అంది పరవశించిపోతూ సుధ.

ఏవిటో శాంతకిమాత్రం ఈ విషయాలేవీ ఏమంత రుచించలేదు. కొత్తగా పెళ్లయిన దంపతులు హాయిగా కులాసాగా గడుపుకో వలసిన కాలాన్ని ఇలా ఎవడో ఊరూ పేరూ లేని వో అనామకుణ్ణి బతికించి బట్ట కట్టించా లనుకుంటూ ఇలా మూర్ఖత్వంగా దేశాలకడన వుండిపోవడమేవిటి? ఇంతకీ అతడే గొప్ప దేశనాయకుడో గనక అయినా, ఏదో అతణ్ణి బతికిస్తే, ఎందర్నో వుద్ధరిస్తాడనన్నా అనుకోవచ్చు. ఏవిటో ఇదొక వేలంవెర్రి. అంతకన్నా ఏమీ లేదు.' అనే అనిపిస్తూంది శాంత మనసుకి.

అయితే రాధా, నళినీ మొదలైనవారంతా మాత్రం అతడినిగురించి ఎంతో ఆసక్తి చూపుతూ ఆ వివరాల్ని తెల్సుకుందుకు తరుచూ సుధకి ఫోన్లు చేస్తుండేవారు. వాళ్లందరికీ రఘు స్వయంగా వక మనిషిని తనే సృష్టించి ఆ మనిషికి ప్రాణం పొయ్యడం కోసరం పాటుపడు తున్నట్టుగానే అనిపిస్తూంది.

అయితే వారలా అనుకోవడంలో పొరపాటేమీ లేదనే చెప్పాలి. ఎందుకంటే ఆ శిథిల శరీరాన్ని బాగుచేసి, దానికి ప్రజ్ఞ తెప్పించేందుగ్గాను వారు అక్కడ పడుతూన్న శ్రమకీ, ఆలోచన్లకీ, నిజంగా ఒక మనిషిని తయారించి ప్రాణం పొయ్యడంకూడా అంతకన్నా సులువుగా నే వుండేదేమో.

అంతంత పరిశోధనలు జరుపుతున్నాడు రఘు, మొదలైన డాక్టర్లంతా అక్కడ.

ఎలాగైతేనేం తమ ప్రయత్నాలు ఫలించి అతనికి ప్రజ్ఞ వచ్చిందనీ అందువల్ల తను బయల్దేరి వస్తున్నాననీ, తను అక్కడే వుండి పోయేది, లేక మళ్ళీ వెళ్ళవలసుండేది; అలా వెళ్ళవలసుంటే సుధనికూడా తనతో తీసు కెళ్ళడమో, మానడమో అన్న విషయాన్ని అన్నీ కొన్ని కారణాలవల్ల ముందు నిర్ణ యించు కుందుకు వీలవలేదనీ రాశాడు రఘు.

ఆ సంగతి తెల్సుకున్నప్పట్నుంచీ ఇక సుధకి చదువు తలకెక్కడం మానేసింది. ఎంత ప్రయత్నించినా చదువులో బుద్ధి పోక పోవడం చూసి 'అబ్బ. తీరా ఆఖరుకొచ్చే సరికి తనకే అశ్రద్ధెలా వచ్చిందీ ? ఇన్నా ళ్ళూ ఆగిన బావ ఈ ఆరేడు నెలలూ వుండినన్నా ఈ ప్రయాణం పెట్టుకు న్నాడు కాదూ,' అని బెంగపడసాగింది సుధ.

రాసిన ప్రకారం రఘు వచ్చాడు. ఈ సారి సుధమాత్రమే బొంబాయివరకూ వెళ్ళింది. బొంబాయిలోని స్నేహితు లందరి బలవంతం మీదా, రెండురోజులక్కడ ఆగి వారందరి తోటీ కులాసాగా కాలక్షేపం చేసేసి సుధతో సహా విశాఖ వచ్చాడు రఘు.

'అక్కడాగా వెందుకు రఘూ, పిన్ని నీ కోసరం తపించిపోతూంది పాపం' అన్నాడు రఘుని చూడ్డంతోనే రామం.

'బాగుందండీ మీ ర డ గ డం. వెళ్ళ వలసినవారు అక్కడకే వెళ్ళినప్పుడు, ఇక ఆయనకి ఇల్లెలా గుర్తుకొస్తుందనీ' అంది నవ్వుతూ శాంత.

'అందరూ మీలాగే అనుకోకండొదినా,' అన్నాడు. శాంతచీరె పట్టుకు నిలబడున్న బాబుని ఎగరేసి ఎత్తుకుని వెళ్ళి, పార్వతమ్మ గారి పక్కనే ఉయ్యాలబల్ల మీద కూర్చుంటూ. ఆ తరవాత అంతా కులాసాగా వేళాకోళాలు వాగ్వాదాలుతో కొంతసేపు హాయిగా కాలక్షేపం చేశారు.

'అయితే నువ్వు ఒకవారంలో మళ్ళీ వెళ్ళి పోవాలన్నమాట' అన్నారు దారిలో కార్లోనే కనుక్కోవలసినవన్నీ కనుక్కున్నందున తిన్నగా తన ఆఫీసురూములో కెళ్ళిపోయిన శర్మగారు తన పనులేవో చూసుకున్నాక మళ్ళీ హాల్లో కొస్తూ.

'అవున్నాన్నా' తను తెచ్చిన ఆట సామా న్లతో బాబుని ఆడిస్తూన్న రఘు లేచి వస్తూ అన్నాడు.

'సుధనీ తీసుకెళ్తావా?'

పరీక్షలయ్యాక ఆలోచించాలి.

'ఏమిటంత తొందరా. మళ్ళీ ఆ చుట్టా లకి సేవ జెయ్యడానికేనా?' హేళనగా అడి గింది శాంత.

'అన్నట్టు అతనికెలా వుంది రఘూ' అన్నారు ఆదుర్దాతో పార్వతమ్మగారు.

'వో అతన్ని గురించి మీ అందరికీ కూడా ఆదుర్దా పట్టుకుందా ఏం? అయితే ఒదిన అన్నట్టు అతను మనకి తప్పకుండా చుట్టమే అయ్యుండాలి. లేకపోతే నేనంటే అతనో ఏళ్ళ తరబడి పరిచయం వడ్డాను గనక నాకు మాత్రం అలా అనిపిస్తూం దేమో అనుకుంటే?—'

'ఏం మాకు మాత్రం? ప్రతివారం నీ వద్ద నుంచి ఉత్తరం రావడంతోనే సుధ దాన్ని సవిస్తరంగా చదివి మాకు అర్థం చెప్పతూండడం, మేమంతా..మీఅద్భుతచర్యల్ని నోరు వెళ్ళబెట్టుకుని వింటూండడం. ఈ మూడేళ్ళాయి మీ ఉత్తరాల మూలకంగా అతడు మాకూ —'

'అంటే సుధ చెప్తూన్నది మీ స్వవిష యాల్ని మినహాయించుకునే సుమా. గాభరా పడకు' అన్నాడు హాస్యంగా మధ్యలో రామం.

'ఆ ఆపాటి సరసత కూడానా మీ తమ్ముడికి. ఇదుగో ఏమైనాసరే ఈసారి సుధనీ మీతోపాటు తీసుకెళ్ళాల్సిందే, లేకపోతే ఊరుకునేది లేదు —'

'ఎవరూ! మీరా? సుధా?' నవ్వుతూ అడిగాడు రఘు.

'అదంతా మీకెందుకూ క్రియ జరపండి, అంతే' ఖచితంగా చెప్పేసింది శాంత.

'అయినా ఇందు కేపాటి కమీషనేమి ట్నీకు' వేణు అడిగాడు.

'ఎందుకూ?'

'చిన్నొదినెగారి తరపున వాదించేందుకు. అంతే కదురా' రామం అడిగాడు.

'అదా నేనేదో అడిగాను. అదేదో ఇస్తా నంది. అవన్నీ మీకెందుకూ మధ్యా' నవ్వాపు కుంటూ అంది శాంత.

ఇంతలో మురళీ వాళ్ళంతా రావడంతో అందరూ మళ్ళీ మామూలు మాటల్లో పడ్డారు. అయితే ఇవ్వీ చూస్తూ, వింటూ గుమ్మంలో నిలబడున్న జానకి హృదయం మాత్రం 'అయ్యో. ఈ రఘు వంటి కార్య దీక్షగల డాక్టర్లు తన భర్త అపాయా నికి గురైనప్పుడూ వుండుంటే వారి ప్రభావం వల్ల ఆయన్ను బతికించుండే వారేమో కదా?' అని కొట్టుకుంటూంది. మళ్ళీ అంతలో, 'అయ్యో రామ, వారుంటే మంగళ్ళి పిల్చుండేవారన్న సామ్యంలాగ అటు వంటి జాగ్రత్త ప్రదేశాల్లో గనక వుండి వుంటే ఆయనకీ ప్రమాదం ఎందుకు సంభవించుంటుందనీ, అసలూ. ఆ రుద్ర భూమివంటి ఎడారిలో తిండికీ నీళ్ళకీ కరువైపోతే ఇక—'అనుకుని మనసుని ఊర డించుకుని లోపలికెళ్ళిపోయింది ఇక అక్కడ నిలబడలేక జానకి.

(ఇంకా ఉంది)



# 'కుటుంబనియంత్రణ ఉద్యమం ఎలా సాగుతోంది...?'

ఆహారోత్పత్తిని పెంచడం ఎలా? జనాభా పెరుగుదలని అరికట్టడం ఎలా?—ఈరెండు సమస్యలూ ప్రపంచంలో చాలా దేశాల్ని వేధిస్తూ ఉన్నాయి. యాభై కోట్లుపైన జనాభా కలిగిన భారతదేశానికి కూడా యివి చాలా అత్యవసరంగా ఎదుర్కో వలసిన సమస్యలే అయ్యాయి.

జనాభా పెరుగుదలకి రకరకాల కారణాలు ఉంటే, మనదేశానికి సంబంధించినంత వరకూ మనుష్యుల సగటు ఆయుర్దాయం పెరగడం, అవిభక్త హిందూ కుటుంబ వ్యవస్థ ఉండడంమూలాన వ్యక్తి ఆర్థిక స్వోమతతో సంబంధం లేకుండా సామాన్యంగా యుక్తవయస్సు రాగానే వివాహాలు జరగడం, మనదేశ వాతావరణాన్నిబట్టి స్త్రీలలో గర్భధారణావకాశం సుమారు ముప్ఫై సంవత్సరాలపాటు ఉండడం... యిటువంటి కొన్ని కారణాలు చెప్పుకో వచ్చును. ఆహారోత్పత్తి, పారిశ్రామికోత్పత్తి పెరుగుతూ ఉన్నాకూడా జనాభా పెరుగుదలతో పోల్చిచూస్తే అవి తక్కువే అవడం మూలాన జాతీయాదాయం పెరిగినట్టుగా వ్యక్తి సగటు ఆదాయం పెరగడలేదు. వీటన్నిటినీ దృష్టిలో పెట్టుకుని, మన ప్రభుత్వంవారు కుటుంబ నియంత్రణ ఉద్యమం ప్రచారం చేయడం మొదలు పెట్టారు.

ఈ ఉద్యమం ప్రచారంకోసం ప్రభుత్వం కోట్లరూపాయలు ఖర్చుపెడుతోంది. ఎవరి వ్యక్తిగత పరిస్థితులబట్టి వారు ఆచరించడానికి అనుగుణంగా, నాలుగైదు రకాల పద్ధతులను ప్రజల దృష్టిలోకి తీసుకొచ్చింది. ఆ సందర్భంలో ప్రజలకు అదనపుఖర్చు ఏమీలేకుండా ఉండడంకోసం ఆయా మార్గాలు ఉచితంగా లభ్యం అయేటట్టుగా ప్రభుత్వం ఏర్పాటు చేసింది. కుటుంబ నియంత్రణ కేంద్రాలని తెరిచారు. పత్రికల ద్వారా, ఏదో రూపంలో ప్రచారంసాగిస్తూ ఉన్నారు. ఈ సందర్భంలో సహకరించిన డాక్టర్లకూ, కొన్నిచోట్ల ప్రచారంసాగించిన సంఘ సేవకులకూ, ఆపరేషన్లు చేయించు కున్న వ్యక్తులకూ ప్రతిఫలం ముట్టచెపు తున్నారు.

ఈ ఉద్యమం పద్ధతులు కొన్నిరకాల దుర్వినియోగానికి లోనవుతున్నట్టుగా విమర్శలు లేకపోలేదు. ఏవో అంకెలూ—ఏవో పేర్లూ చూపిస్తూ కొందరు డాక్టర్లూ, కొందరు సంఘసేవకులూ ప్రభుత్వధనాన్ని దుర్వినియోగం చేసినట్లూ, అందుకోసమే కొన్నిచోట్ల అవసరంలేని వ్యక్తులకు కూడా ఆపరేషన్లు చేయించినట్లూ, మరికొన్ని చోట్ల మనస్ఫూర్తిగా ఇష్టపడని వ్యక్తులని వారు మభ్య—పెట్టినట్లూ...రకరకాల వార్తలు ప్రచారంలోకి వచ్చాయి. వీటన్నిటికీ కారణం ప్రభుత్వ విధానం కాకపోవచ్చు, కానీ కొంతమటుకైనా ప్రభుత్వ యంత్రాంగం బాధ్యత వహించవలసి వస్తుంది. కుటుంబ నియంత్రణ సాధనాలు విరివిగా లభ్యం అవడం అవివాహిత యువతీయువకులపై కొంత దుష్ప్రభావాన్ని కలుగచేయ వచ్చునని కొందరు అంటూంటారు కానీ ఈవిమర్శ హేతువాదానికి నిలబడదు.

రకరకాల కారణాలవలన ప్రభుత్వం ఖర్చుపెట్టే డబ్బుకి తగినంతగా ఫలితాలు కనిపించడం లేదనే చెప్పవచ్చును. దేశాన్ని దృష్టిలో పెట్టుకుని చాలామంది ఉద్యమ ప్రాముఖ్యత గుర్తించినా కూడా వారిలో కొంతమంది మాత్రమే కుటుంబ పరిస్థితుల్ని దృష్టిలో పెట్టుకుని ఆచరిస్తున్నారు. ధనికులకు కుటుంబపోషణ అంతభారం కాదు. ఆడా, మగా, పిన్నా, పెద్దా...యింట్లో అందరూ కష్టపడి జీవితాన్ని వెళ్లబుచ్చే బీదవారిలోకూడా చాలా మంది ఈ ఉద్యమాన్ని స్వీకరించడంలేదు. నెలజీతం మీద ఆధారపడే మధ్యతరగతి కుటుంబీకులు ఎక్కువగా ఈపద్ధతులను అవలంబిస్తున్నట్లుగా అనిపిస్తుంది. మత దృష్టితోచూస్తే ఈపద్ధతులు అన్నిమతాల ప్రజలకీ కొత్తవేఅయినా కొన్ని మతాలవారు వీటిని తీవ్రంగా విమర్శిస్తూ ఉండడం మూలాన ఆయామతాల ప్రజలుకూడా వీటిని చెప్పుకో తగినంతగా అమలుపరచడం లేదనే చెప్పవచ్చును. సాంఘిక ఆచారం, మతవిశ్వాసం, కుటుంబ సంతోషం ఆర్థిక స్వోమత, శరీరారోగ్యం...లాంటివి ఎన్నో కలిసి ఉన్నటువంటి ఈ సున్నితమైన విషయానికి సంబంధించిన ఈఉద్యమం దిగ్విజయానికి కొంత వ్యవధి తీసుకుంటుంది.

ఇది ఒక రకమైన సాంఘిక సమస్య కాబట్టి, అందరూ సహకరిస్తేనే కాని ఈ ఉద్యమం విజయవంతం కాదు. వివిధ మతాధికారులు, మారుతూన్న ప్రపంచంతో పాటు మారి, ఈతరంవారిదే కాకుండా రాబోయేతరాల ప్రజలు అవసరాలనుకూడా దృష్టిలో పెట్టుకుని, ఈ ఉద్యమంపట్ల వారికున్న వైముఖ్యతను తొలగించుకోవాలి. ప్రభుత్వంవారు తాము ఖర్చుపెట్టే డబ్బు అంతా సద్వినియోగం అయేటట్లుగా, తమ యంత్రాంగాన్ని సరిదిద్దుకోవాలి. ఈఉద్యమ విజయానికి, విద్య, విజ్ఞానం చాలా సహకరిస్తాయి కాబట్టి, గ్రామాలలో వయోజన విద్యనుకూడా త్వరగా పెంపొందించాలి. ఈ ఉద్యమానికి సంబంధించిన డాక్టర్లూ, సాంఘిక సేవకులూ తమ నైతికస్థాయిని నిలబెట్టుకోవాలి; అవసరమైతే పెంచుకోవాలి. ఉద్యమం ప్రచారం కేవలం ప్రభుత్వం వారిచే నియమింపబడ్డ ఉద్యోగస్థులకే వదిలేయకుండా, ప్రతిఊర్లోనూ, ప్రతి పట్టణంలోనూ గృహిణులుకూడా పూనుకోవాలి.

—పి. జయలక్ష్మి

---

'కుటుంబ నియంత్రణ ఉద్యమం ఎలా సాగుతోంది ?' అన్న దానికి ఖచ్చితమైన జవాబుచెప్పటం కష్టం.అది ఆయా మతాల ప్రభావంమీద ఆర్థిక స్థితిగతుల మీద ఆధారపడి వుంటుంది. కొన్ని కొన్ని గ్రామాలలో ఆయా పరిసరాలమీద, పరిస్థితుల మీదకూడ కొంతవరకు ఆధారపడి వుంటుంది.

కాని ప్రస్తుతం జరుగుతున్న కుటుంబ నియంత్రణ కార్యక్రమాలను పరిశీలిస్తే ఊహించినంత శీఘ్రగతిని ఈ ఉద్యమం సాగటంలేదు అనిపిస్తుంది. 'దీనికి కారణాలు ఏమిటి?' అని ఆలోచిస్తే మనకు తోచేవి ఇవి. మన ప్రజలలో విద్య, వివేకం కలిగి సుసంపన్నులైన కుటుంబీకులు చాలామంది ఎవరి బోధనలు ఆవసరం లేకుండానే కుటుంబ నియంత్రణ పద్ధతులను అవలంబిస్తున్నారు. ఎటొచ్చీ అక్షరజ్ఞానంలేక, చెప్పినా వినిపించుకునే స్థితిలోలేని అమాయక ప్రజలే ఈ పద్ధతులను నిరసిస్తున్నారు. ముఖ్యంగా కూలి, నాలి చేసుకుంటూ పొట్టపోసుకునే కుటుంబీకులకు కుటుంబ నియంత్రణ పద్ధతులమీద సరియైనదృష్టి ఉన్నట్లు తోచదు. 'నారు పోసినవాడు నీరు పోయక పోతాడా?' అని సరిపెట్టుకొని బ్రతుకును భారంగా ఈడుస్తూ జీవనయాత్ర సాగించేవారు ఒక రకమైతే; 'పుట్టిన పిల్లలను కొన్ని సంవత్సరాలు ఏదో మాకున్నదానితోనే పెంచి పెద్దచేస్తే, ఆ తరువాత కులవృత్తి చేసుకుంటూనో, కూలి చేసుకుంటూనో వాళ్ళపొట్ట వాళ్ళు పోసుకుంటారు. మా పిల్లలు మాకు బరువు కాదుగా?' అన్న ధోరణిలో మాట్లాడే వాళ్ళు మరొక రకం. 'ఆ మీ పిచ్చిగాని, దేవుడిచ్చే సంతానాన్ని వద్దంటామా? ఎంత పాపం!' అని వేదాంత ధోరణిలో మాట్లాడే వాళ్ళుకూడ లేకపోలేదు. పై మనస్తత్వం కలిగిన జనులలో కుటుంబ నియంత్రణోద్దేశాన్ని విపులీకరించి వాళ్ళ మనస్సులకు హత్తుకునేలాగ బహుళప్రచారం చేయవలసివుంది. అయితే యిప్పటివరకూ జరిగిన ప్రచారంవల్ల కుగ్రామాలలోకూడ కుటుంబ నియంత్రణ గురించి సంచలనం కలిగిన మాట నిజం. కాని పెద్దయెత్తున ప్రచారం జరిగితేగాని ఎక్కువ మార్పు రావటానికి అవకాశం వుండదు.

కుటుంబ నియంత్రణకొరకు ప్రస్తుతం ప్రభుత్వం అవలంబిస్తున్న విధానాలు చాలావరకు ప్రజలకు నచ్చుతున్నట్లే కనిపిస్తున్నవి. కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేయించుకున్నవారికి ప్రభుత్వం వారిచ్చే పారితోషికాలే ముఖ్యంకావు. ఆపరేషను చేయించుకున్న తరువాత ఆ వ్యక్తిని నారానికొకసారైనా పరీక్షిస్తూ, ఏ చిన్నయిబ్బంది కలిగినా తగిన ఉచితవైద్య సౌకర్యాలు కలుగజేయడం ప్రభుత్వం వారి ముఖ్య కర్తవ్యం. 'ప్రైవేటు డాక్టర్లే కాదు, ప్రభుత్వ వైద్యులుకూడ శ్రద్ధగా రోగులను చూస్తున్నారు' అన్న మంచి పేరు గ్రామాలలో వచ్చినప్పుడే ప్రజలలో మార్పు తీసుకురావడం సులభసాధ్యం అవుతుంది. కొంతమంది ప్రజలకు వారి కుటుంబ డాక్టర్లమీదే మంచి గురి, నమ్మకం వుంటూంటాయి. అటువంటప్పుడు వాళ్ళు ఏ డాక్టరు దగ్గరకూ వెళ్ళరు. అందువలన ప్రైవేటు డాక్టర్లందరికీ 'ఆపరేషన్లు చేయించుకునే వారికి ఉచిత వైద్య, వసతి, భోజనసదుపాయాలు కలిగించాల'ని ప్రభుత్వం ఆదేశించిన కొంతవరకు ఇది విజయవంతం కాగలదు. అయితే కొంతకాలంనుంచి ప్రైవేటు డాక్టర్లుకూడ ఉచిత వసతి, వైద్య సౌకర్యాలు కలుగజేస్తున్నారు. భోజన విషయంలోకూడ యిది అమలు జరుగుతూ మరింత కట్టుదిట్టంగా ఉండాలి. కనుక ఈ ఉద్యమం విజయవంతం కావడానికి ప్రైవేటు డాక్టర్లుకూడ చాలవరకు బాధ్యులు.

కుటుంబ నియంత్రణ పద్ధతులు పట్టణాలలోనూ, పల్లెలలోనూ విరివిగా ప్రచారంలోకి వచ్చినవి. కుటుంబ నియంత్రణ పక్షోత్సవాలు, వారోత్సవాలు, నిరోధ పక్షోత్సవాలూ, ట్యూబెక్టమీ శిబిరములు; మున్నగు వానివల్ల గ్రామసీమలలో కుటుంబ నియంత్రణ పద్ధతులు కొన్నియైనా అమలు పరచబడు చున్నవి. అయితే యీ పద్ధతుల వల్ల ఆయా పరికరాలు కొంత దుర్వినియోగానికి లోనవుతున్నమాట వాస్తవం అనిపిస్తుంది. ఆ దుర్వినియోగం కొద్దిలో వుంటే ఫర్వాలేదు. లేనప్పుడు కొన్ని లక్షల, కొట్లరూపాయలు బూడిదలో పోసిన పన్నీరు అవుతున్నవి.

ఈ కార్యక్రమం ఇంకా ఎక్కువ విజయవంతం కావాలంటే ప్రతి కుటుంబ నియంత్రణోద్యోగి ప్రజల సందేహాలకు ఓపికతో తగు సమాధానాలిస్తూ వాళ్ళ మనసులో మార్పు తీసుకురావటానికి ప్రయత్నించాలి. ఇందుకు వైద్యుల సహాయం, వారు రోగుల యెడ ప్రవర్తించేతీరు చాల ముఖ్యమైనవి. ప్రజలలోకి వెళ్ళి ప్రచారం చేసేటప్పుడు అసలు సంతానం లేనివాళ్ళు సలహాలు అడుగుతుంటారు. అటువంటి వారి విషయంలోకూడ ప్రభుత్వం తగిన శ్రద్ధతీసుకొని, అందుకు తగిన ఆపరేషన్లు ఉచితంగా చేస్తూ వున్నట్లయిన ప్రభుత్వం మీద ప్రజలకు ఒకవిధమైన సద్భావం కలగటానికి అవకాశంవుంది. ఆ విధంగా ప్రజలకు సన్నిహితులై వారిలో మార్పు తేసుకు రావచ్చు.

ఈ ఉద్యమ ప్రచారానికి వుపయోగిస్తున్న కరపత్రాలు, వాల్‌పోస్టర్లు ప్రజల దృష్టిని ఎక్కువగా ఆకర్షించు చున్నట్లు కనిపించదు. నీటికన్న నాటికలు, ఫిలింప్రదర్శనలు, బుర్రకథలు సామాన్య ప్రజానీకాన్ని ఆకట్టుకోగలవు. విని తెలుసుకున్నదానికన్నా చూచి గ్రహింపు చేసుకున్నది ఎక్కువకాలం మనస్సులో నిలిచిపోవటానికి అవకాశంవుంది. అందువలన ఎక్కువమంది పిల్లలుగలవారి సంతాపాలు, తక్కువ పిల్లలున్నవారి సంతోషాలు వ్యక్తంచేస్తూ కుటుంబ నియంత్రణావశ్యకతను నాటికలద్వారా, ఫిలిం ప్రదర్శనలద్వారా గుర్తించేలా చేయవలసిన అవసరం యెంతైనావుంది.

—పిన్నక ధనలక్ష్మి



# అఋణానంద లహరి




ప్రశాంత

అందమైన భుజాలను కురులు పత్తుకునేట్లు ఆకాశంలో మబ్బులు భూభుజాలను మత్తుగా పత్తుకుంటున్నాయి. ఆకాశంలో రంగురంగుల మబ్బుల్లా రకరకాల మనుషులు పలురకాల భాషలు.

మద్రాసు బస్‌స్టాండ్‌లో తిరుపతి బస్ ఇంకా రాలేదు. జనం మాత్రం నిండుగా ఉన్నారు. స్టాండ్‌కి ఆలస్యంగా వచ్చిన ఆనంద్‌కి మిగిలిందల్లా కండక్టర్ 'ఫో' సమాధానం.

'అన్నీ రిజర్వ్ అయిపోయాయి సార్. ఇప్పుడు వస్తే ఏం ఉంటాయి?' ఆనంద్ షేక్స్పియర్ మొహం వెయ్యడం ఆ వింత చూసినట్లు వెంటనే దగ్గర్లోంచి తెలుగు వారపత్రిక చాటునుంచి ఓ నవ్వు రావడం జరిగాయి. అయినా అది అంతటితో ఆగలేదు. ఇదంతా గమనిస్తున్న ఓ నల్ల అరవనాడార్ తన పక్కనున్న అలిమేలుకి ఇదంతా చూపి ఇంకా పెద్దగా కనీసం నూరు [illegible] హీరో అంత గొప్పగా పెళ్ళని నవ్వెయ్యడంతో ఆ వారపత్రిక మీద, కాదు కాదు, దాని చాటునున్న అమ్మడి మీద ఇంకా కోపం వచ్చింది.

బ్లాక్ డ్రింక్లైట్ సారీ...బలం లేని ఈ నాటి సగటు యువతిలాంటి పొట్టి జాకెట్టు ...నీకు నేనేమన్నా తక్కువ తిన్నానా అంటూ పోటీ చేస్తున్న అంతకంటే పొట్టి పమిట. ఆ పమిట సందులోంచి వస్తున్న చేతి గుప్పిట్లో వారపత్రిక...ఇన్నింటికీ సమన్వయంతో అర్థ చంద్రాకారంలో వంతి

నిలబడ్డ పాశ్చర్. అప్పటికే అవలేరు. ఆ పక్కనే ఆ అమ్మడు తాలూకు అత్త, పిన్ని వదిన, అమ్మ వగైరా వగైరాల్లో ఏదన్నా అవవచ్చు వో నలయ్యైయేళ్ళ నూటనలభై పౌన్ల అతి భారీకాయం.

ఆవిడ తననే చూస్తున్నదని గ్రహించి తల తిప్పి సిగిరెట్‌పాక్ చించాడు. ఆలోచించాడు టక్కెట్ ఎలా సంపాదించడమా, ఆ నోట్సు ఉమన్ పక్క నిలబడి అప్పుడు అప్పుడు తన అవస్థకి నవ్వుతూ సైలెంట్ కోల్డ్‌వార్ చేస్తున్న సౌందర్యపు రిజర్వాయర్‌లాంటి ఆ అమ్మడ్ని ఎలా దిమ్మ తిరిగేలా దెబ్బకొట్టడమా అని.

బడలోంచి రెండు పాయలుగా చీలి గాలిలో ఆదుకుంటున్న డిశంబరు పూల చెండును చూస్తుండగా నారాయణరెడ్డిగారి 'నవ్వులా ఇవి, కావు నవపారిజాత...' అని గుర్తురాబోయినా ఎదురుగా తనని వదిలేసి పోయిగా బస్సెక్కేస్తున్న జనాన్ని ఖట్టి.

'వడ్డించిన విస్తరి మీ జీవితం.

డబ్బున్నవాళ్ళ రిజర్వేషన్ ఈ భూమి సమస్తం' అనిపించింది.

తనకి సీటు లేదే అని వో మూల లోపల ఏడుస్తుంటే ఎవడో వచ్చి సూట్‌కేస్‌తో పొడిచి 'తప్పుకోవయ్యా పక్కకి' అనేశాడు. మరోసారి అమ్మడు నవ్వడానికి ఛాన్స్. కిమ్మనకుండా తలెత్తి దూరంగా చూసిన ఆనంద్‌కి దగ్గర్లోనే స్టాండింగ్ కాఫీబార్ దగ్గర కాఫీ తాగుతున్న డ్రైవర్ కనిపించే వరికి గ్లాసు తాగినంతగా జోరుగా అటుకేసి వెళ్ళాడు.

తమ డిపార్ట్‌మెంటులో పైవాళ్ళు కింద వాళ్ళకి చేసే అన్యాయాలని పరాయివాళ్ళ వరయినా చెప్తే, కాస్త సానుభూతి చూపి నట్టు తమపట్ల కనిపిస్తే దానికి ఆనందించడం మానవ నైజం.

అందుకే రోడ్డురవాణా సంస్థ బస్ రేట్లు పెంచడం నుంచీ పై అధికార్లు తక్కువ జీతగాళ్ళని ఎలా ఏడిపిస్తారు దాకా సానుభూతిగా మాట్లాడి డ్రైవర్‌కో ఫిల్టర్ టిప్‌డ్ సిగిరెట్ టిప్ చేశాడు.

గణగణగణ బస్సుగంట. ఫిల్టర్ ధర్మమా అని ఆనంద్‌కి ఆ రాత్రి మద్రాసులో హోల్డింగ్ తప్పింది. బస్సెక్కేశాడు. అదృష్టం ఉంది. అందుకే అమ్మడి సీటు దగ్గర్లోనే ఖాళీ ఉంది.

కుడిసీట్ల వరసలో కిటికీ పక్క కూర్చున్నది నీలిరంగు చీర నీలవేణి. ఒళ్ళో కృష్ణవేణి, చేతిలో ఇంకా ఆ వారపత్రికే ఉంది. పైన సూట్‌కేస్ సర్దుతున్న ఆనంద్ కళ్ళు తిరిగాయి అకస్మాత్తుగా. పైత్యం పనిగాదు సుమండీ.

'మిస్ అరుణ ఎం. ఏ (ఫైనల్)' అని కనిపించినందుకు పక్కనున్న వో సూట్‌కేసు మీద. 'ఫైన్' అనేసింది పెద్దగా లోపల సందు లేక బయటపడ్డ ఆనందుడి డెందం తాలూకు అమితానందం.

'టికెట్ సార్'

పదిరూపాయలనోటు ఇస్తూ 'ఈబస్సు ఫైనల్‌గా ఎన్ని గంటలకి తిరుపతి వెళ్తుంది?'

'షుమారు పది గంటలకి'

'నాన్సెన్స్! ఏం చెప్పడమయ్యా అది, ఆడవాళ్ళ వయస్సు చెప్పినట్టు.' కండక్టర్‌కి ఈసారి బ్రెయిన్‌లో ఏదో డయల్ అయినట్టుంది. 'అంతేసార్! రెంటితో ఏవీ ఖచ్చితంగా చెప్పలేం.'

అర్థం అయినవాళ్ళు నవ్వారు. అన్యాయమూ దొరికినవాళ్ళు కాస్త మెడలు సాగదీసి ఆడసీట్ల వేపోసారి చూశారు. ఈసారి చూచిన అరుణ చూపులో చురుక్కుమని తగిలింది.

'చాలా చమత్కారంగా మాట్లాడుతున్నావే! ఎం. ఏ. చదివావా? ఫైనల్‌లో ఆపేశావా ?'

'అంతదాకా చదివితే ఇవెందుకు చించేవాడ్ని ? నోట్లు లెక్కపెట్టేవాడ్ని సార్.'

'మరి ఏం చదివావ్ ?'

'ఏదో ఎం. ఎల్. ఎ. చదువు' మళ్ళీ నవ్వుల్లో పడ్డారు జనం.

అందరి నవ్వుల్తో బేసిన్‌బ్రిడ్జి దాటేసింది బస్.

ఆనంద్ కూర్చున్నాడనేగానీ లాభం ఏం ఉంది? అరుణ పక్కనున్న పిన్నిగారు గుడ్లార్పకుండా అతనిచూపులు తమవేపు తిరగనివ్వకుండా తిరుబాటుగా కూర్చుని ఉంది. ఏమాత్రం నిద్రపొయే సూచనలు కనిపించడంలేదు. ఖర్మరా భగవంతుడా అనుకొని వెనక్కి ఆనుకొని లింగరింగ్ షాడోస్ తెరిచాడు, కాస్త ఆలోచనల నావకి లంగరువేసే ప్రయత్నంలో.

అంతకన్నా మార్గం దొరకలేదు పాపం పూర్ ఆనంద్‌కి.

అటు పిన్నికి ఇటు ఆనంద్‌కి కనిపించకుండానే అతను పడుతున్న అవస్థ చూస్తున్నది అరుణ. ఇదో కాస్త కాలక్షేపంలా ఉంది. వనితావాణినుంచీ వారంవారం సీరియల్స్‌దాకా ఆస్సలేం రుచించక గాబోలు చేతులోని పత్రిక చల్లగా ఒళ్ళోకి జారిపోయింది.

వారపత్రికల్లో రాసేవాళ్ళేగాదు వారపత్రికలూ అదృష్టం అయినవే.

జీవితంలో మిగిలిపోయే రోజుల్లా అనుభవాల గుర్తుల్లా అక్కడ దూరంగా దీపాలు మిణుకు మంటున్నాయి. ఆకాశంలో నక్షత్రాల తళుకును మబ్బుల్లోంచి వస్తున్న మత్తు వెన్నెలను అందుకోడానికి రమ్మంటున్నట్టు అరుణ ముంగురులాడుతున్నాయి స్వేచ్ఛగా.

హాల్ట్!... బస్సు ఆగింది. ఆనంద్ కోసంగాదు. వేసిన రైలుగేటుకోసం. గేటు మూసిన దోవకోసం. జనం దిగుతున్నారు.

'వేరిగళ్ వేరిగళ్...' ఇంకా అరవగాలి తగ్గ లేదన్నమాట.,

లావు పిన్నిగారికి కనిపించకుండా మధ్య ఎవరూ అడ్డులేకుండా అరుణను చూస్తూ బయట నిలబడబోయిన యత్నంలో అప్రయత్నంగా ఫిల్టర్‌టిప్‌డ్‌ని తలకిందులుగా అంటించేసిన కథానాయకుడు. పలకమారడం ...ప్రక్కనున్న సన్నపాటి టైట్‌ప్యాంట్ ...ఆ వెంట సైడ్‌బ్యాటీ నవ్వులు రివ్వున దూసుకు పోయాయి.

పూరానంద్ పూరా దెబ్బతిన్న రేస్‌హార్స్‌లా నీరుగారిపోయి మైలురాయిమీది మోచేతిమీద వంగిపోయి అన్యాయం అయిపోతున్న తన పర్సనాలిటీ గురించి విచారవ్యగ్రమనస్కుడయ్యాడు.

మెడ నొప్పిపుట్టి తల ఎత్తేసరికి డ్యూటీమీద ఉన్న సీనియర్ ఆఫీసర్లలా అరుణనే సైడ్ బ్యాటీని చూసి ఇన్‌స్పైర్ అయిపోతున్న బహుళ యువక సందోహం కనిపించింది.

అరుణ ఆమెవెంట డాడ్జిమోడల్ బాడీగార్డు బస్సు దిగబోవడంలో ఆఫీసర్లు డ్యూటీనుంచీ రిలీవ్ అయారు.

పైరుకోసిన పంటపొలాలవేపు అరుణ నడిచి వెళ్లడం ఒంటిగా ఉన్న వెన్నెలతో ఆడుకోడానికా అనిపిస్తున్నది. ఇప్పుడే పినాతే

# అరుణానందలహరి

ఇంటో ఏం రాసేవాడో !

'బస్సుదిగిన మిస్సా ?

కాదు కాదు మృదులతర మహాసౌందర్యపు బోయనసిస్సు !'

బస్సుగంట మోగింది. జనం సీట్లలో సర్దుకుంటున్నారు. ఆడవాళ్లకోసం యథా విధిగా మరి కాసేపు ఆపాల్సి వచ్చింది. అన్నిచోట్లా రిజర్వేషన్స్, కన్సెషన్స్. అందుకే అబల అంటే సైలెంటుగా బలము చూపునది అని కొత్త వ్యాఖ్యానం చేసినా తప్పు లేదేమో.

బస్సులో నడిచివెళ్లే దారికి కాస్త అడ్డంగా, సీటుకి ముందుకు జరిగి కూర్చు న్నాడు అల్లరానంద్, ఏం అంటుందో చూద్దాం అని. కాని పాపం !... పాపం ముందుగా పిన్నిగారే వచ్చి మనమదు లాంటి మంచబ్బాయిని మోకాలుతో నులక మంచాన్ని నెట్టినట్టు నెట్టి ఆగి మరీ అమ్మడికి దారి ఇచ్చి 'ఇంక ఏలుకో దారి అంతా' అన్నట్టు వెళ్లి కూర్చుంది.

అంత తన మనోనేత్రాలతోనే తన పాలిట అశరీరవిధి వంటి ఆ మహాశరీర విధిని నిందించి తలతిప్పి చూడకుండా ఉండటానికి ప్రయత్నించాడు.

ప్రేమికుల మనస్సుల్లో విద్యుత్ సదృశ ఆలోచనా తరంగాల్లో స్టాపింగులు వస్తు న్నాయి, వెళ్తున్నాయి. పెరిగిన బస్సు వేగా నికి షట్టర్లుమూసే స్పెట్టర్లు తొడుగు తున్నారు పాసింజర్స్, ఈ కాలం గడుసు అమ్మాయిల పిడికెడు పమిటతో ఆడు కోడం అంటే ఆ గాలికి ఇష్టం. దాన్ని ఎన్ని వేపుల విసిరెయ్యవచ్చో, ఎగిరే ఆ పమిట కోసం అమ్మాయిల్ని ఎన్ని వంపులు తిప్పవచ్చో గూడా దానికి బాగా తెలుసు. ఆ పమిట తవలజే చిన్నపీలిక కోసం వీళ్లు డాన్స్ చేస్తుంటే చూసేవాళ్లకి ఆనందాయకం. సినిమాతారలు వాళ్ల టైలర్లు వయసు మనసులకి చేసేసేవ గణనాతీతం.

బస్సు పుత్తూరు దగ్గర పడింది. గుండెల్లో ఏదో అన్వయం కుదరని ఆత్రం. భరించనివ్వని తొందర.

...ఇప్పుడు అరుణ నెలాగయినా పలక రిస్తే ఎలా జవాబిస్తుందో? ఆ మెనోరు తెరిస్తే చలి కలకలమని నవ్వుతుందా? వెన్నెల చిన్నల బోతుందా? అందాల ఆకాశం అంధకారం అయిపోతుందా?

...............

'మీ పేరు'

'అరుణ!...ఏం బాగుందా?'

'మీలో బాగుండని దొకటి ఉందా? ఏం చేస్తుంటారు?'

'బస్సు ఎక్కుతూనే సూట్‌కేసుమీద చదివి ఆలిండియారేడియో చేసేశారుగా?' నవ్వు. ఒళ్ళంతానవ్వే. తియ్యటి సమాధానం ఇచ్చే ప్రశ్న అడగాలి. 'స్త్రీ రచయిత్రుల్లో మీకెవరు ఇష్టం'

'...' నాన్సెన్స్ అనిపించినా అరుణ అందంముందు ఆమాట ఎలా అనడం?

'......'

'మరి మీకో?' అబ్బ! కోసిన కోహాలా ఎలా అడిగింది. తనూ అడిగాడు ప్రాణాలు తీసే పత్రికా విలేఖరిలా.

'ఆదివిష్ణు'

'మీ మగబుద్ధి పోనిచ్చారుగాదు'

'కోపంగాగూడా మీరు చూడ సొంపుగా ఉంటారు!'

'అహా! అలాగా?...మీదగ్గర ఇంకా ఆ తాతలనాటి తుప్పుపట్టిన మగాళ్ల ఆయుధాలున్నాయన్న మాట?' అబ్బో అబ్బో ఎంత అద్భుతంగా దెబ్బకొట్టింది.

'ఎన్ని ఉన్నా మీముందు నిరాయుధుడ్నేగా అరుణా?' ఏమిటి? తనే ఇంత చమత్కా రంగా మాట్లాడింది ?'

'ఆనంద్!' ఆనందంగా కాదు అందంగా.

'నిజం అరుణా మిమ్మల్ని చూస్తుంటే మీగురించి భావిస్తుంటే—'

బస్సు ఇచ్చిన సడెన్‌బ్రేక్ కుదుపుకి రింగరింగ్‌షాడోస్ మూడుసీట్ల అవతలకి జంప్ చేస్తే కలలానంద్ ముందు కెగిరిపడి పదహారో నెంబర్‌సీట్ తగిలి మళ్లీ లోకం లోకి వచ్చి 'ఆహా' అని అన్నివేపులుగా విని పించిన నవ్వు తనని చూసే అని అర్థం చేసు కోక తప్పలేదు.

'హరి భగవంతుడా నువ్వు నిజంగా ఉన్నావా హరించుకుపోయావా!' అనుకోడం లోనే అకస్మాత్‌గా తిరపతి బస్‌స్టాండ్ కని పించేసింది' ఇంక దిగవచ్చునంటూ.

ఎక్కాల్సిన బస్సు మిస్సవలేదు గానీ మిస్సుతో పలకరింపే జరగలేదు. పెధవది జీవితంలో దేనికైనా టెంప్టింగ్‌నేచర్ ఉండాలి. తనెందుకూ పనికిరాడు, వారపత్రి కల్లో ఎవరి జీవితాలో చదివి ఆనందించ డానిక తప్ప.

వస్తానన్నట్టు చూసింది అరుణ పిన్ని గారిపక్కన రిక్షాలో కూర్చుంటూ.

టాటా అన్నట్టు చెయ్యి ఊపింది బయలుదేరిన రిక్షాటాపు సవరిస్తున్నట్టు వెనక్కి తిరిగి. నాటి శకుంతలకి నేటి పూబంతులేం తక్కువ తీసిపోరు.

నెలలు వారాలు నారాలు నెలలు బారలు బారలుగా సాగిపోతున్నాయి. ఫలితం శూన్యం.





అరుణకోసం తిరపతేమిటి నెల్లూరు; అల్లూరు కొత్తూరు, పుత్తూరు తిరిగేశాడు చిత్తు చిత్తుగా.

అరుణ కనిపించలేదు...నిజంగా కనిపించ లేదు.

మిగిలిందల్లా అరుణ ప్రణయానికి తన మద్రాసు ప్రయాణానికి గుర్తు బాధ. అసంతృప్తి.

తాక్సీజ్‌లో పెయిల్యూర్ కూపన్లా మిగిలిందల్లా నాటి బస్ టికెట్.

ఎరుగను ఎటకో ఈ పయనాలు.
తడిపేను కన్నీట ఈ నయనాలు...

...............

* * *

'ఇదిరా అసలు కథ' అన్నాడు కృష్ణ చదవడం పూర్తిఅయిన కాగితాలు టేబుల్ మీద పడేస్తూ.

'ఆ తర్వాత ?'

'ఇంకేం ఉంది? ఆ అరుణకోసం ఆనంద్ గాలించి గాలించి ఆఖరికి ఎక్కడుందీ కనుక్కొన్నాడు. కానీ ఫలించలేదు. ఆమె ప్రేమ కోసం కళ్ళుపూసేలా ఒళ్ళుపూసేలా తపించి పరితపించి ఆఖరికి ఆ నిర్భాగ్యుడు—'

'ఆత్మహత్య చేసేసుకున్నాడు' పూర్తి చేశా.

వాడు ఛర్రుమని 'అంత సింపుల్‌గా తీసుకుంటావని తెలిస్తే నీ దగ్గరికి అసలు రాకపోదును. ఏం రచయితవురా? రేపు నేను చచ్చినా ఇంతేగా ?'

'అదిగాదురా వెధవా, ఇందులో రాసిన ప్రకారం ఆ అమ్మాయి అతనిమీద బస్సులో ప్రేమగానే ఉన్నట్టు కనిపించిందే, మరెందుకు కాదన్నట్టు.'

'అక్కడే ఉంది మెయిన్‌క్లిక్. దాన్నే ఆడ బుద్ధి అంటారు. బస్సులో తను చూసిన మిసమిసలకి పకపకలకి ఆ పిచ్చోడు కరిగిపోయి 'త్వమేవ శరణం మమ' అనెయ్యడంతో ఈ అతి సౌందర్యపు భారత్ బ్యూటీ 'పిచ్చివెధవాయ్ ఏదో బస్సులో రెండుసార్లు చూస్తే అరసారి నవ్వితే దాన్నే లౌ అనుకుంటే ఎలా ? ... అసలు వాట్‌డూయూ మీన్?' అనేసింది. దాంతో దాంతో ఆర్తి—'

వాడ్ని ఆపేస్తూ 'సరే ఇంక అర్థం అవుతున్నదిలే' అనేశా. పైకి ఏం అనక పోయినా ఆ అమ్మాయి మంచిపని చేసిందనిపించింది చెప్పద్దూ. అయినా వాడ్ని తృప్తి పరచడానికి 'ఈ రోజుల్లోనూ

ఇలాంటివి జరుగుతాయి అంటావా?'

'నీతోడు! కావాలంటే ఇది చూడు. ఇది అతను చచ్చిపోతగారాసిన ఆఖరి ఉత్తరం' అని వాడు ఎంతో బాధగా అందించాడు. కృష్ణమాట నిజం. అరుణవలన మోసపోయి బ్రతకలేననీ అందుకే తనకథ అర్ధాంతరంగా ఆగిపోయిందనీ ఏదేదో అందులో ఉంది. కానీ నాలోమాత్రం అరుణ విచిత్ర మూర్తిగా మనసులో మెదిలింది.

ఆ పాత్రపట్ల ఏదో మధురానుభూతి ఉత్సుకత కలిగాయి.

'ఈ ఆభాగ్యుడిపట్ల నీకూ కొంత బాధ్యత ఉంది.'

'ఏమిటి? ఏమన్నా చందాలివ్వాలా?'

'కాదు. అరుణలాంటి రాక్షసిణులు ఇంకా లక్షమంది ఉన్నారు దేశంనిండా. వాళ్ళకి తమ సౌందర్యంపట్ల వయస్సుపట్ల మహా పొగరు. వాళ్ల చూపుల్లో నడకలో ఈ మనుషుల్ని 'ఆఫ్టరాల్'గా తీసుకొనే భావం ఉట్టిపడుతుంటుంది. వాళ్లకి కలంతో బుద్ధిచెప్పాల్సిన బాధ్యత రచయితగా నీమీద ఎంతైనా ఉంది' కృష్ణ సీరియస్‌గా అవేశంతోనే చెప్తున్నాడు గానీ వేధనది నాకందులో సైలెంట్ హ్యూమర్ కనిపిస్తున్నది.

వాడు ఇంకా చెప్తున్నాడు. 'అరుణ నిండు జీవితాన్ని ఎలా వంచించిందో నీ కలంతో అద్భుతంగా చిత్రించు, ఈ కథకి ముగింపు రాయ్' భారంగా నిట్టూర్చి 'అలా అయినా ఆ అభాగ్యుడి కింత ఆత్మశాంతి ఆ దౌర్భాగ్యురాలికింత బుద్ధి—'

'వోరేయ్! పరువునష్టం దావా వేస్తుందేమోరా. అసలే సామాన్యురాలిలా లేదు'

'అందుకే అరుణ సైలెంట్‌గా కుళ్లి ఏడ్చి చచ్చేలా రాయ్'

'మన కెందుకువచ్చిన గొడవలే పోనిద్దు' స్వచ్ఛం అయిన ఆంధ్రుడిలా.

'అదేం కుదర్దు. చచ్చినట్టు నువ్వు రాయాల్సిందే. 'బాయ్ మీట్స్ గరల్ — గరల్ లాఫ్స్ ఎట్‌బాయ్' కథలు రాస్తారూ? దేశానికి ఉపయోగపడే సజీవ సాహిత్యం ఏనాటికి, ఏనాటికి మీ రచయితలు రాస్తారు ?'

ఇంకో గంటసేపు లెక్చరిచ్చి అరుణమీద అక్కసు అంతా కక్కి ఆఖరికి నాచేత రాయడానికి ఒప్పించాడు.

నేను ఒప్పుకోడం ఏమిటి వాడు నాచేత రాయించడం ఏమిటి అన్నీ వారం రోజుల్లో జరిగిపోయాయి.

వాడికోరిక తీరింది. కథ పూర్తి అయింది. అరుణనో అందమైన రాక్షసిగా చిత్రించడంతో వాడికి సంతృప్తి మిగిలింది. నన్నో మహా రచయితగా పొగిడేసి వెళ్లిపోయాడు.

వాడే పోస్టుచేశాడు గాబోలు. సంపాదకుడు ఏకళనున్నాడో వారం తిరక్కుండానే వచ్చేసింది పత్రికలో. అది బహుముఖ ప్రశంసలందింది. అరుణనలా చిత్రించడంలో ఎందరమ్మాయిలు వారపత్రిక ఉత్తరాల కాలంలో ధ్వజం ఎత్తుతారోనని ఎదురు చూశా. ఫర్వాలే రెస్పాన్స్ బాగా వచ్చింది. ఆ కథ ధర్మమా అని ఇంకో నాలుగు వెంటవెంటనే రాయడానికి ఉత్సాహం కలిగింది.

కానీ నాకు విచారం కలిగించింది ఒక్కటే. ఆ కథ 'అరుణానందలహరి' రాసినప్పటి నుంచీ మళ్లీ నావేపు తిరిగి చూడలేదు కృష్ణ. మా ఇంటివేపే రావడం మానేశాడు' మనస్సుకి కష్టం వేసింది. 'అవసరానికి వాడుకొన్నాడా' అనిపించింది. రెండు నెలలుగా వాడి సమాచారం ఏం అందడం లేదు.

*  *  *

మామూలు జీవితంలో పడిపోయా. రోజులు వస్తూ పోతున్నాయి.

ఆవేళ ఆదివారం. అంటే ప్రతి పగలు పౌరుడికీ సైలెంట్ పండగన్నమాట. టైం తొమ్మిది అవుతున్నా ఇంకా బద్ధకంగా ఉండి పక్క దిగలేదు. వో వైపు శ్రీమతి మంగళహారతి వినిపిస్తున్నా దుప్పటి తన్ని పడుకొన్నా.

'అబ్బబ్బ లేవండి ఇంక. శలవు రోజున గూడా సుఖం లేదుగదా. కాస్త లేచి మొహం కడుక్కొని అలా కూర్చుని పేపరు చదవరాదూ, నే వంట చేసుకుంటా.'

'నన్నేమన్నా చదవనిస్తావా పాడా, ఎంతసేపూ మీ వాళ్ల గొప్పదనం చెప్పి నా ప్రాణం తియ్యడం తప్ప. కాంగ్రెస్‌వాళ్ల వాగ్దానాల్లా ఎంతకాలం ఈ మాటలు వినమంటావ్?'

'సందు దొరికితే చాలు మావాళ్ళు దొరుకుతారు మీకు' అని మూతిని మూడు బన్నుమలుపులంత వంకరగా తిప్పి 'ఇదుగోండి, అనవసరంగా మావాళ్ళ జోలికి వెళ్ళారో?—' అల్టిమేటమ్ జారీచేసింది జారిపోతున్న జానెడు చీర పమిటతో అవస్థపడుతూ మేడమ్ అర్చన.

'అందుకే మేడమ్, మేం లేస్తే అపొజిషన్ వాళ్ళలా ఏదో అంటాం గాబట్టి, ఇలా పడుకొని,'

'అహా! అదేం కుదర్దు. మరీ పసిపాపల్లా ఏమిటా గారం?' అనేసి దుప్పటి పూర్తిగా లాగేసింది. ఇంకా నాబాధ ఏం చెప్పను ? గదిలో బంధించి పెద్దగా విజయవాడ రేడియో స్టేషన్ తీసి చచ్చినట్టు వినమంటే ఎలా ఉంటుందో అలా అయింది నా పరిస్థితి.

లేచి కూర్చుంటూ, 'అదికాదు మిసెస్ నా!'—

'ఇదుగో, పేరుపెట్టి పిలిస్తే పిలవండి. లేకపోతే లేదుగానీ ఏమిటా కుంటి పేర్లు ?'

'నన్నేం చెయ్యమంటావోయ్. మీ ఆడవాళ్ళు అన్నింటా ఫార్వర్డ్‌గదా ఇప్పుడు. అర్చన, దీపారాధన, ప్రార్థన, సంయమన—'

'తల ఆడిస్తూ 'ఊ ఊ! ఇంకా చెప్పండి సింగినాదం జీలకర్ర మిరప్పొడి...'

'సమ్మెందెవర్నో మీ ఆడవాళ్లని. అవి పెట్టుకొనే రోజూ రావచ్చు. మీ ఆడవాళ్ళు ఎంతకైనా తగుదురు'

'ఏం చేశామేమిటి?'

'అదుగో ఆ పేపరు చూడు. దాన్నిండా మీ ఇందిరాగాంధిగారి గొప్ప పనులే'

'మావాళ్ళ మీదనుంచి ఇందిరాగాంధి మీద కెళ్లారూ? మమ్మల్నేదో అనకపోతే—'

'ఉషారుండద్దూ' అనేసి కొంటెగా నవ్వి అర్చన భుజాల మీదకి వంగుతూ 'అర్చనా! మానాన్న డబ్బు సంపాదించలేదుగానీ లేకపోతే నిన్ను మన స్టేట్‌కి—'

చాల్లేండి. ఆవిడ్ని ఒక్కదాన్ని చేసి మీ మగాళ్లంతా పెట్టిన తిప్పలు చాలకా?' అనేసి వీధిలోంచి వినిపించిన పేపరు కుర్రాడి పిలుపుకి అటు వెళ్ళింది. పోగొట్టుకున్న ప్రేయసిలా ఆ దుప్పటిని వోసారి చూసి మెల్లిగా బాత్‌రూం వేపు నడిచా.

కాల్‌గేట్‌వారి ఆదేశం ప్రకారం నాదంత రక్షణకి కాల్‌గేట్ బ్రష్‌నే నోట్లో పెట్టానో లేదో వీధివేపునుంచి మా ఆవిడ

వేసిన ఒకే ఒక్క కేకకి నేను హడలి పోయా. అర్చనకి ఏమన్నా అయిందా అని గాదు, మేడమ్‌గాంధి గవర్నమెంటుకి ఏమన్నా అయిందా అని.

...అనుకున్నంతపనీ అయింది. రాత్రి రేడియో వినలేదేమో, తెల్లారేసరికి పేపర్లో పంచవర్ష ప్రణాళికా మానిఫెస్టో అంత పెద్ద అక్షరాల్లో సాక్షాత్కరించింది.

కానీ అసలు తమాషా ఏమంటే, మేం ఇద్దరం నోటమాట రాకుండా నిలబడి పోడానికి కారణం ఆ న్యూస్ కాదు.

...ఎదురుగుండా కృష్ణ! అదీ ఊరికే గాదు పక్కనెవరో అమ్మాయితో. నేనింత వరకూ ఎరగని ఎవరో అందమైన అమ్మాయితో పొద్దునే నా కంట్లో సాక్షాత్కరించాడు.

మాటరాని నేను. చలనంలేని అర్చన.

'.........' ఏం అడిగానో గుర్తులేదు.

'ఆశీర్వదించు అక్కయ్యా' అంటూ వంగాడు అర్చన కాళ్ళమీదకి. అది ఆశీర్వాదానికో, రాబోయేవాడికి ఇప్పుడే రక్షణ సన్నాహమో అర్థం గాలేదు. పైగా వంటింట్లో ప్రిఫరెన్స్ సంపాదించడానికి అప్పుడప్పుడు వాడు వేసే ఇలాంటి ట్రిక్ అలవాటే.

పక్కనున్న అపరిచితతో కృష్ణ 'అరుణా! అక్కయ్యతో లోపలికెళ్ళు' అన్నాడు. అర్చన గూడా ఎంతో పరిచయున్నట్లుగా లోపలికి తీసుకెళ్ళింది. రిక్షావాడు సూట్‌కేసులు ముందుగదిలో పెడుతున్నాడు.

అంతా అయోమయం గందరగోళం.

వాడుమాత్రం సైలెంట్‌గానూరు చిత్రాల మహానటుడు అంత పోజులో సైలెంట్‌గా సిగరెట్ తాగుతూ కిటికీకి ఆనుకొని బయటకు చూస్తూ ఎంతకీ మాట్లాడడు. వెధవ తెలుగు సినిమా సస్పెన్సూ వీడూను.

ఇంక భరించలేక 'ఒరేయ్ ఎవర్రా ఆ అమ్మాయి? ఇన్నాళ్ళూ ఎక్కడ తగలడ్డావ్? ఇప్పుడు ఎక్కడనుంచీ రావడం?'

'ఒక్కొక్కటే అడుగు. తీరిగ్గా చెప్తా.'

'తొందరగా చెప్తావా ఆ సామాను బయట పారేయించనా?'

అందుకేనోయ్ మొదటి నమస్కార బాణం హోం మినిస్టర్‌కి కొట్టింది. వారి అనుమతితో ప్రవేశించాంగాబట్టి మమ్మల్నెవరేం చెయ్యలేరు' దీమాగా.

'సరేలే చెప్పు.'

బలంగా మరొక దమ్ములాగి సిగరెట్ అవతల పారేసి వాడు నా దగ్గరికివచ్చి రెండు చేతులూ పట్టుకొని 'ఇదంతా నువ్వు నువ్వుపెట్టిన భిక్ష. నువ్వే లేకపోతే అరుణ నాకు దక్కేది కాదు.'

'అంటే?'

'రెండునెల్ల క్రితం నీచేత కథ రాయించింది ఈ అరుణ నాబడు వనితారత్నం మీదే. ఆ ఆనంద్ ఎవరో కాదు. ఈఆనంద కృష్ణుడే. అరుణ విషయంలో మొదట ఫెయిల్ అయిన నేను అదంతా నీ ముందు చెప్తే తేలిగ్గా కొట్టిపారేస్తావని మరో వ్యక్తి పరంగా చెప్పాల్సి వచ్చింది. నిన్నిన్‌స్పైర్ చెయ్యడానికి అతన్ని చంపాల్సి వచ్చింది గూడా. ఆమెచేత మొదట త్రుణీకరింపబడిన నాకు, నీ కలంనుంచి మంచి కథే మార్గాంతరంగా కనిపించింది. ఆఫ్ కోర్స్ హృదయాన్ని కదిలించే స్పష్టీకరణ చేశావ్. అది ప్రింట్ అయింది. దేశం అంతా చదివింది. అరుణా చదివింది.

అందులో ఆనంద్‌లా ఆమె లేకపోతే నేనూ ఆత్మహత్య చేసుకొంటూనన్నా. మెత్తగా మెరిసే కత్తిలా నవ్వేసి చేసుకో పొమ్మంది, ఇంకేం చెయ్యడంరా భగవంతుడా అని ఏడుస్తుండగా...ఏడుస్తుండగా,'

'తొందరగా చెప్పి ఏడువ్.'

'చిన్న లక్ కలిసివచ్చింది. మన ఊళ్ళో భాగ్యదాత అనే అకాడమీ పత్రిక ఒకటి ఉంది. తెలుసుగా, రెండునెల్లకోసారి కొద్ది ప్రకటనలతో వస్తుంటుంది. లాగి స్తంభానికి గుద్దుకొంది. కారుకింద కోడి పడింది లాంటి వార్తలే పతాక శీర్షికలయిన ఆ పత్రికలో నాలాంటి వాడెవడో (ప్రేమికుడే) ఆత్మహత్య చేసుకొంటే, అమోఘ ముద్రారాక్షస వరప్రసాదమా అని నా పేరన అచ్చుఅయింది. ఇదీ మన మంచికే అనుకొని అరుణకో నాలుగు కాపీలు ఇంకో ఆరు పేజీల ఉత్తరం పంపా.

...దాని ప్రభావం ఎలా ఉంటుందో అని ఎదురుచూశా.

అంతే సక్సెస్... గ్రాండ్ సక్సెస్...జాక్‌పాట్ కొట్టేశా బ్రదర్. తెర వెనకనుంచి కథ నడుపుతున్న మీ పిన్నికూతురు కమ్మా రాధ కవిత ప్రార్థన—'

'అబ్బబ్బ! నీకీ దేశంలో చాలామంది తెలుసులే. అసలు సంగతి చెప్పు.'

'ఏతత్ మహిళామండలి అంతా ఈ వార్త పేపర్లో వచ్చిన మర్నాడే అరుణతో పాటు పబ్లిక్ గార్డెన్స్‌లో అసెంబుల్ అయారు. మాటల సందర్భంలో నామాట రావడం అరుణ అసలు మనసు బయటపడటం జరిగాయి.

'ఆనంద్‌గారు ఇంతపని చేస్తారనుకోలేదు. ఇంకొన్నాళ్ళు ఏడిపించి పరీక్షలవగానే అసలు విషయం చెప్పేద్దామనుకొన్నా. ఛీ! ఛీ! ఈ మగాళ్ళకి ప్రేమించడమేగానీ ప్రేమించిన ఆడదాని మనస్సు తెలుసుకోడం తెలీదు' అని ఆ కలకంఠి కలస్వరంబున ఏడ్వసాగె.

అంతే డియర్ రైటర్! గార్డులు గ్రీన్ సిగ్నల్ ఇవ్వడం నేను పొదలమాటునుండి బయటపడటం అరుణ నిరుత్తర అయి



# వారఫలం

**9-4-1971 శుక్రవారం మొదలు**
**15-4-1971 గురువారం వరకు**

**మేషం :** వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీరు ప్రయోజనం లేని శ్రమకు గురి కాగలరు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృషభం :** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. పోటీ వారితో మాట పట్టింపులు తగవు. రాజకీయవ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. వారం ఆఖరులో వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**మిథునం :** ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు బాగుంటాయి. పోటీ వారిలో గౌరవం లభిస్తుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. వారం ఆఖరులో మీరు అనుకొనేది ఒకటి, జరిగేది మరొకటి కావచ్చును.

స్త్రీలకు—దైవకార్యాలు నెరవేరతాయి. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**కర్కాటకం :** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చాలా బాగుంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**సింహం :** సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి రాగలదు. నూతన విషయాలను తెల్సుకొంటారు. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. కోర్టు వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగాఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య :** అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. అధికారుల వలన జరుగవలసిన వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**తుల :** కొన్ని వ్యవహారాల్లో అనవసరమైన శ్రమ కలుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారం మధ్యలో అనుకూలమైన మార్పులు వస్తాయి. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. అన్ని వ్యవహారాల్లోను మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**వృశ్చికం :** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు తిరిగి అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు :** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో ఆకస్మికంగా చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**మకరం :** వ్యాపారంలో అనుకూలవార్తలను వింటారు. బంధుమిత్రులను కల్సుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాలుబాగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కుంభం :** కొన్ని వ్యవహారాల్లో ఆందోళనకు గురి కాగలరు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. ప్రయాణాలు వాయిదా పడతాయి.

**మీనం :** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. వారం మధ్యలో వ్యతిరేకమైన వార్తలను వింటారు. వ్యాపారంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం ఆఖరులో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

—మురళీ ●



సీరియల్

# మల్లెలు మరుమల్లెలు

యర్రం చంద్రశేఖరం

**జరిగిన కథ**

లక్ష్మయ్యగారొక మోతుబరి రైతు. శాంత ఆయనకి ఏకైక కుమార్తె. తల్లిదండ్రులు లేని మేనల్లుడు రామాన్ని చిన్నప్పటినుండి తనే పెంచి పెద్ద చేస్తాడు. రామం చదువు హెచ్.ఎస్, సి.తో ఆపేసి వ్యవసాయపు పనులు చూసుకుంటాడు. అతను పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగా వుంటాడు. శాంతను కాలేజి చదువుకు పంపిస్తారు. కాలేజిలో ఆమెకి శారద అనే బీదవిద్యార్థిని స్నేహితురాలవుతుంది. శారద విషాదగాథ శాంతను కదిలించి వేస్తుంది. శారదకి ప్రభాకరం పరిచయమవుతాడు. ప్రభాకరానికి కాశీలో ప్రసాద్ స్నేహితుడవుతాడు. ప్రభాకరం దుడుకు స్వభావాన్ని కని పెట్టి ప్రసాద్ అతని ప్రవర్తనని మార్చాలని ప్రయత్నం చేస్తాడు. సుందరానికి అలవనితలంపుగా నీరజతో పరిచయమయ్యింది. నీరజ యింటికి వెళ్లి ఆమె తండ్రికి వైద్యం చేసే భారం తన మీద వేసుకున్నాడు. నీరజ సుందరంపై ఎన్నో ఆశలు పెట్టుకున్నది. సుందరం తనవూరికి ప్రయాణమై వెళ్లిపోయాడు. సుందరానికి శాంతపై మోజు. శాంత రామాన్ని అభిమానిస్తున్నది.

## 13

ఆరోజు ఆదివారం ట్రైనింగుకాలేజీకి శెలవు. శారద తను యిదివరకు ఉన్న హాస్టలులోనే మళ్లీ చేరింది. శాంతతో కలిసి ఉండడం అలవాటుపడిన శారద రెండుమూడు మాసాలు ఏదో తెలియని బాధ అనుభవించింది. ఇప్పటికీ తీరిక సమయాలలో శాంతనుగురించిన ఆలోచనలు ఆమెకు వస్తూనే ఉంటాయి.

ట్రైనింగు కాలేజీలో చేరి ఆరుమాసాలు దాటాయి. రెండుమాసాల క్రితం ఒక్కసారి మాత్రం శ్రీపతిగారి యింటికి వెళ్లి వచ్చింది. శ్రీపతిగారు అన్నపూర్ణమ్మగారు కనీసం వారానికొకసారైనా తమయింటికి వచ్చివెడుతూ ఉండవలసిందని ఎంతో ఆప్యాయంగా కోరారు. కాని చదువుధ్యాసలో పడిన శారద మళ్లీ వెళ్లలేకపోయింది. ఆరోజు శెలవు కావడంవల్ల వెళ్లాలనికోరిక కలిగి బయలుదేరింది.

శారద శ్రీపతిగారింటికి చేరేసరికి ఉదయం పది దాటింది. హాలులో ఎవ్వరూ కనిపించలేదు. పరిచయం ఉన్నయిల్లే కాబట్టి నేరుగా శ్రీపతిగారి గదిలోపలికి వెళ్లింది.

'రావమ్మా! వారానికి ఒక్కసారివచ్చి వెడుతూండమని చెబితే యింతకాలానికి వచ్చావా?' గుమ్మంవద్ద కనుపించిన శారదను లోనికి ఆహ్వానిస్తూ అన్నారు శ్రీపతిగారు.

ఎంతో కష్టంమీద తలఎత్తి వచ్చిన వారెవరాఅని చూసి మళ్ళీ తలగడపై తల ఆనించిన అన్నపూర్ణమ్మగారు 'నీవాతల్లీ!' ఇంతకాలానికి గుర్తొచ్చామా? బాగున్నావా అమ్మా?' శారదను అడిగారు నీరసంవల్ల కంఠస్వరం వణుకుతూ ఉంది.

'బాగానే ఉన్నాను' అని సమాధానం చెప్పి ఒక్కక్షణం ఆగదిని, శ్రీపతిగారిని, అన్నపూర్ణమ్మగారిని పరిశీలించింది శారద. మంచం ప్రక్కగా ఉన్న స్టూలుమీద ఒక చిన్నతరహా మెడికలుషాపు వెలిసింది. అన్నపూర్ణమ్మగారి ముఖంలో దైన్యం తాండవిస్తూ ఉంది. ఆమె అలా మంచంపట్టి ఎన్నిరోజులైందో ఊహించుకోలేక పోయింది శారద. శ్రీపతిగారు పీక్కుపోయి కళతప్పిన ముఖంతో ఆ మంచానికి ప్రక్కగాఉన్న కుర్చీలో కూర్చున్నారు. శారద వెళ్లి మంచంపై అన్నపూర్ణమ్మగారి తలాపున కూర్చొని వారి కళ్లల్లోకి జాలిగొలిపే చూపులతో చూడసాగింది;

'ఇలా ఉందమ్మా మా పరిస్థితి. మీ అమ్మగారు మంచమెక్కి పదిరోజులైంది. చేతనయ్యో చేతకాకో లేచి పనులు చేసుకుంటున్నంత వరకు సక్రమంగానే గడిచిపోయింది. మంచానపడిన మరుక్షణం నుండే చాలాబాధ పడుతున్నాము.' శ్రీపతిగారి మాటలు వారి పరిస్థితి రెండూ శారద హృదయాన్ని కదిలించి వేశాయి.

'బాబుగారూ! ఇంత యిబ్బందిగా ఉంటే నాకు కబురుచేయలేక పోయారా? నేనేమై పోయాననుకున్నారు? ఇది మీ ఉప్పుతిని పెరిగిన శరీరం. మీఋణం ఎన్నిజన్మలకు మాత్రం తీర్చుకోగలను? అవసరం వచ్చినప్పుడు మీకు సేవచేసే భాగ్యానికి కూడా నోచుకోలేదా నేను. అంత పరాయి...' అంతవరకు మాట్లాడిన శారదకు దుఃఖంవల్ల ఆపైన మాటలు పెగిలిరాలేదు.

అసలే దీనావస్థలో ఉండి శారదను ఆస్థితిలో చూసిన అన్నపూర్ణమ్మగారు శ్రీపతిగారు బాధతో విలవిలలాడి పోయారు.

'తల్లీ! కాఠిన్యంవహించి నిన్ను అనరాని మాటలన్నాము. నిర్దోషివైన నీపై ప్రభాకరం మోపిన నిందకు ఎంతో కుమిలిపోయాం. నిస్సహాయురాలైన నీకు నిలువ నీడలేకుండా చేశాం. ఇంకా ఏముఖం పెట్టుకొని నీదగ్గరకువచ్చి అడగమంటావమ్మా? అయినా నేను రావాలనే అనుకున్నాను కాని చదువుకుంటున్న ఆ అమ్మాయిని ఎందుకు యిబ్బంది పెడతారు?' అని మీ అమ్మగారే వద్దన్నది.' అన్నారు శ్రీపతిగారు.

'ఇప్పుడవన్నీ ఎందుకండీ బాబుగారూ? రేపే ట్రైనింగు కాలేజికి శెలవు పెడతాను. అమ్మగారికి పూర్తిగా స్వస్థత చిక్కిన తర్వాతే మళ్లీ కాలేజీకి వెడతాను.' అన్నపూర్ణమ్మ

గారి ముఖంలోకి ఆప్యాయంగా చూస్తూ అంది శారద.

'తల్లీ! నాకోసం నీవు కాలేజీకి వెళ్లడం మానుకుంటావా? నీవుయిక్కడ ఉన్నంతకాలం నాకు ఎంతో సాయంచేశావు. నీవు వెళ్లిపోయిన తర్వాత నిన్ను తలవని రోజంటూ లేదు.' బలహీనతవల్ల ఒక్కొక్కమాట ఎంతో ప్రయత్నంమీద అనగలిగారు అన్నపూర్ణమ్మగారు. ఆప్యాయతతోనిండిన శారద మాటలు అన్నపూర్ణమ్మగారికి అశ్రువులను తెప్పించాయి.

తన పమిటచెంగుతో వారి కన్నీటిని తుడుస్తూ 'బాధపడకండి. నేను వచ్చానుగా ఆ భగవంతుడి దయవల్ల అన్నీ చక్కబడుతాయి. మీరు నిశ్చింతగా ఉండండి' శారద మాటలు వారిద్దరికీ ఎంతో ధైర్యాన్ని కలిగించాయి.

* * *

శారద శ్రద్ధతోచేసిన పరిచర్యలతో, మనసుకు ఉల్లాసం కలిగించే కబుర్లతో అన్నపూర్ణమ్మగారు శారీరకంగా, మానసికంగా త్వరగా కోలుకున్నారు. శారదను డాక్టరుగారు కూడా ఎంతో అభినందించారు. పథ్యం పెట్టి రెండురోజులైంది. శారద శ్రీపతిగారి యింటికి వచ్చి పదిరోజులు దాటి పోయింది: అన్నపూర్ణమ్మగారు లేచి తిరుగుతూ తమ పనులు తాము చేసుకోగలుగుతున్నారు. కాని యింటి పనులు చేసుకోగల శక్తి యింకా ఏర్పడలేదు.

ఒకరోజు సాయంత్రం సుందరరామయ్యగారు, నీరజ, శ్రీపతిగారి యింటికి వచ్చారు. వారు /వారానికి రెండుమూడు సార్లు వచ్చి చూసి వెడుతూనే ఉన్నారు. ఆ కారణంగా శారదకు నీరజకు ఎంతో చనువు పెరిగింది. నీరజ 'అక్కా, అక్కా' అని శారదను ఎంతో ఆప్యాయంగా పిలుస్తూ శ్రీపతిగారి యింట్లో ఉన్నంతసేపూ శారద వద్దనే కులాసా కబుర్లతో కాలక్షేపం చేస్తూ ఉంది

మొట్టమొదటి రోజు సుందరరామయ్యగారిని చూసిన శారదకు ఫోటోలో తన తల్లి ప్రక్కన ఉన్న యువకుని రూపం స్ఫురణకు వచ్చింది. పోలికలు చాలా వరకు కలుస్తాయి. కాని మనుష్యులను పోలిన మనుషులు ఎంతోమంది ఉంటారనుకొని సరిపెట్టుకుంది.

నీరజ తనపై చూపుతున్న ఆప్యాయతకు శారద మనసు వెన్నలా కరిగిపోయి ఆమెను తన సహోదరిగా ప్రేమించ సాగింది.

అన్నపూర్ణమ్మగారిని పరామర్శించిన తర్వాత శారద, నీరజలిద్దరూ మేడపైన ఉన్న ప్రభాకరం గదిలోపలికి వెళ్లారు. శారద ఆ యింటికి వచ్చిన రోజు యిల్లంతా చెత్తాచెదారంతో చూడడానికి ఎంతో అసహ్యంగా ఉంది. ఎంతమంది పనివాళ్ళు ఉన్నప్పటికీ, పని చేయించేవాళ్లు లేకపోతే వారు చేసేపనులన్నీ అస్తవ్యంగానే ఉంటాయి. ఇల్లంతా శుభ్రం చేయించి, తాళంవేసి ఉన్న ప్రభాకరం గదిని కూడా తెరిపించి బూజు, చెత్త, చెదారంతో నిండి ఉన్న ఆ గదిని శుభ్రం చేయించింది శారద.

'అక్కా...! నీ పూర్తి వివరాలు నాకు చెప్పవూ?'

'ఎందుకులేమ్మా...! చెప్పి నిన్ను బాధ పెట్టడం దేనికి?'

'లేదక్కా...ఈ రోజు నీవు తప్పకుండా చెప్పాల్సిందే!'

'లేదులేమ్మా...! అవసరం వచ్చినప్పుడు నేనే చెబుతాను. అంతవరకు ఓపికపట్టు.' ఆ గదిలో టేబుల్‌పై ఉన్న ప్రభాకరం ఫోటోను తదేకంగా చూస్తూ అంది శారద.

పరిచయం కలిగిన వారం పదిరోజులలోనే



# మీ ముఖ కాంతికి కొన్ని కళలను తీరుస్తుంది




చిత్రంగా,
మృదువుగా,
యౌవనంగా
వుంచుతుంది—ఏదో తెలుసా ?
పాండ్స్ వ్యానిషింగ్ క్రీము. అందులో గల ప్రత్యేకమైన వర్ణ్యామెంట్ మిమ్ము వాతావరణాలకు తగిన సంరక్షణను ఇవ్వటమేగాక చర్మానికి సహజంగా వుండవలసిన ఆర్ద్రతకు భంగం రానీయదు. తేలికగా మంచులా వుండే పాండ్స్ వ్యానిషింగ్ క్రీము వాడండి. మ్యాట్ ఫినిష్‌కు దానిని ఒక్కటే వాడవచ్చు. లేకపోతే మీ సింగారం చెక్కు చెదరకుండా గంటలకొద్దీ వుండ దానికి పౌడర్ పునాదిగా వుపయోగించవచ్చు. 4 సైజులలో లభించగల వ్యానిషింగ్ క్రీము ఇదొక్కటే: ఎకానమీ - లార్జి - మీడియము - స్మాలు.

## పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్

విశిష్టమైన పౌడరు పునాది.

చీస్‌బ్రో పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమిత బాధ్యతతో యు. ఎస్. ఏలో స్థాపితము)

ప్రశ్నలని 'ప్రశ్నావళి', ఆంధ్ర సచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మదరాసు—1 కి పంపాలి.



## మల్లెలు..

వారికి ఆ పొలంలో జరుగుతూఉండే ప్రతి పనీ కనుపిస్తుంది. తాయారు మోటతో నీళ్లు చెట్లకు పెడుతూ, తదనుగుణంగా ఎడ్లను ముందుకు వెనుకకు నడిపిస్తూ ఉంది. రంగయ్యతాత కొడుకు లిద్దరూ వేరు పడ్డారు. తండ్రివాటాకు, చిన్నన్న వాటాకు వచ్చిన పొలం పనులు తనకు చేతనైనంత వరకు చూస్తూ ఉంది ఆమె.

మోట ఆపుచేసిన తాయారు లక్ష్మయ్యగారి పొలంలో పనిచేయుస్తున్న రామాన్ని బిగ్గరగా కేకవేసి పిలిచింది. ఆ పిలుపు శాంతచెవిన పడడంతో ఆమె ఆశ్చర్యపోయింది. ఏం జరుగుతుందో చూడాలని ఒక ప్రక్కగా నిల్చొని గమనించ సాగింది.

రామం తమ పొలంనుండి రంగయ్యతాత పొలంవైపు నడిచివెడుతూ ఉండడం కనుపించింది ఆమెకు. తాయారుకూడా రామానికి ఎదురుగా నడక సాగించింది. తాయారు అకస్మాత్తుగా కేకవేసి క్రింద కూలబడినట్లు తోచింది శాంతకు. ఆమెకు ఎదురుగా వస్తున్న రామం తన నడకవేగాన్ని హెచ్చిస్తూ తాయారువద్దకువచ్చి తనుకూడా కూర్చున్నాడు. రెండుమూడు నిముషాల తర్వాత రామం చేతిని ఆసరాగా తీసుకొని లేచి నిలబడింది తాయారు. మాటలు మాత్రం వినిపించడంలేదు. జరుగుతున్న విషయమంతా స్పష్టంగా కనుపిస్తూ ఉంది. లేచి నిలబడిన తాయారు రామం ఆసరాతోనడుస్తూ అతని భుజంపై తన చేతినేసి, అతనిపై తన పూర్తిభారాన్ని మోపి మోటబావివైపు నడుస్తూ ఉండడం తనకళ్లారా చూసింది శాంత. రామానికి ఎంతో దగ్గరగా హత్తుకుపోవాలని తాయారు చేస్తున్న ప్రయత్నం ఆమె గమనించింది. అదంతా చూసిన-శాంత మనసు మెరమెరలాడింది. మరుక్షణంలో యిద్దరూ పెద్దగా నవ్వడంతో శాంత యిక ఆ దృశ్యాన్ని చూడలేక రామాన్ని అపార్థం చేసుకొని తోటవైపు వేగంగా అడుగులు వేయసాగింది. ఆమె హృదయంలో తాయారుపై క్రోధావేశాలు ముప్పిరికొన్నాయి.

లోగా జరిగిన సంఘటనలు కూడా సరిగా యిటువంటివే! హుఁ...తాయారుకు బుద్ధిలేకపోతే బావ విచక్షణా జ్ఞానం ఏమైంది? చక్కని ఆదర్శభావాలు గలవాడు; పరోపకార బుద్ధిగలవాడు అని నలుగురూ పొగుడుతూఉంటే మంచి చెడుల తారతమ్యాన్ని కూడా గ్రహించకుండా తన యిష్టంవచ్చినట్లు ప్రవర్తిస్తున్నాడు.నలుగురూ చూసి ఏమనుకుంటారోనన్న ఆలోచనైనా ఉండొద్దూ? ఇవన్నీ నా హృదయాన్ని చిత్రహింస చేస్తున్నాయి. అతనొక్కడే అలా ప్రవర్తించగలడను కుంటున్నాడో ఏమో? దీనికి రెట్టింపు చేస్తాను. నన్నుచూసి తను కూడా బాధపడేటట్లు చేయకపోతే నాపేరు శాంత కాదు. అయినా యిక మాయిద్దరికీ ఎలా పొసుగుతుంది? ఈవిధంగా రంగులు మార్చ గల మొనగాడని నాకేం తెలుసు? నన్ను గాఢంగా ప్రేమిస్తూనే ఉన్నాడనుకుంటున్నాను. అంతా నటన...! ఈరోజు తాయారైంది. రేపు మరొకరు! అసలు...యిటువంటివి ఇంకెన్ని జరుగుతున్నాయో? అందగాడు, గ్రామంలో పలుకుబడి హోదా కలవాడు. అందరినీ ఆకర్షించగల శక్తి కలవాడు' ఈ విధంగా ఆలోచిస్తూ తోట చేరుకుంది శాంత.

పిల్లగాలులను ఆస్వాదిస్తూ ఆస్పత్రి ముందుగల ఆవరణలో కుర్చీలు వేయించి అక్కడ కూర్చొని మెడికలు మ్యాగజీనొకటి తిరగవేస్తున్నాడు సుందరం. ఎదురుగా రెండుకుర్చీలు ఖాళీగా ఉన్నాయి. శాంత రావడం గమనించిన అతను ఖాళీగా ఉన్న కుర్చీ చూపిస్తూ కూర్చోవలసిందిగా ఆహ్వానించాడు.

'ఏం శాంతా...? ఈమధ్య బొత్తిగా కనుపించడం లేదేమిటి? ఐదారు మాసాలకే రోగులపై ఆస్పత్రిపై విసుగు కలిగిందా?'

'అబ్బే! అటువంటిదేమీ లేదు. నీవు కూడా నిరుత్సాహంగా కనుపిస్తూ ఉన్నావు ...ఏమిటీ కథ?' చిరునవ్వుతో అంది శాంత.

'ఆఁ...ఏముంది? రోజులు గడుస్తున్న కొద్దీ బోర్ కొడుతుంది శాంతా! నా స్నేహితులంతా హైదరాబాదులో చక్కగా ఉద్యోగాలు చేసుకుంటూ హాయిగా గడుపుతున్నారు. మొదట్లో నాకెంతో ఉత్సాహంగా గడిచింది కాని రానురాను విసుగ్గా ఉంది.' అని శాంత ముఖంలోకి చూడసాగాడు.

'నాకూ ఎంతో విసుగ్గా ఉంది సుందరం. పనీ పాటా లేకుండా ఊరికే తిని కూర్చో

పాలంకే చికాగ్గా ఉంది.'

'ఈమధ్య నీలో ఏదో మార్పు వస్తూ ఉన్నట్లు గమనిస్తున్నాను.'

'అబ్బే! అటువంటిదేమీ లేదు.'

'లేకపోవడమేమిటి? స్పష్టంగా నీ ముఖంలో కనుపిస్తూ ఉంటేనూ?...'

'............'

'శాంతా! ఈమధ్య రామం ప్రవర్తన...' అని ఏదో చెప్పబోయి ఆగి పోయాడు.

'ఏమిటి...? చెబుతూ ఆగిపోయావేం?'

'ఆఁ... ఏమీలేదులే!'

'కాదు. చెప్పాలి.' బలవంతం చేసింది సుందరాన్ని.

'రామం అమ్మాయిలతో ఎక్కడెక్కడో కనుపిస్తున్నాడని నలుగురూ అనుకుంటూ ఉండగా విన్నాను. ఈ మధ్య ఆస్పత్రి వైపు కూడా సరిగా రావడం లేదు'

'అలాగా!'

'అవును.'

శాంత జరిగిన సంఘటనలన్నీ ఒక్కొక్కటే నెమరు వేసుకో సాగింది.

'ఏమిటి...ఆలోచనలో పడినట్లున్నావు?'

'............'

'మాట్లాడవేం శాంతా...?'

'ఏం మాట్లాడమంటావు?' అంది వేడి నిట్టూర్పులు విడుస్తూ.

'ఈ విషయం యింతకుముందే నీదాకా వచ్చిందా...?'

'నేను కళ్ళారా చూశాను. నన్ను మోసం చేస్తున్నాడు.'

'అదేమిటి? నీ నోట వినవలసిన మాట లేనా యివి...! అటువంటి ఆలోచనలు నీకు ఎందుకు కలుగుతున్నాయి? అయినా రామం మగవాడు. వయసులో ఉన్నవాడు. అధికారం, అవకాశం అందుకు తోడుగా ఉన్నాయి.' అన్నాడు సుందరం.

'ఇలా జరుగుతుందని నేను కలలో కూడా ఊహించలేదు సుందరం.'

ఆమె ముఖంలో విషాదరేఖలు స్పష్టంగా కనుపించ సాగాయి—

తన పాచికపారే సమయం దగ్గరపడుతూ ఉందని సంతోషపడుతూ ఆ భావాలు పైకి కనపడకుండా ఎంతో నేర్పుతో 'ఆఁ ... పెళ్ళిళ్లల్లో యిటువంటివన్నీ సహజంగా జరుగుతూనే ఉంటాయి. వాటి నన్నింటినీ పట్టించుకో కూడదు.' తేలికగా తీసి పారవేశాడు సుందరం.

'ఇంత మాటన్నావు సుందరం ... ? నీకేం తెలుసు నా మతి పోతూ ఉంది? ఇటువంటివి మామూలు అంటున్నావేమిటి?' చిరుకోపం ప్రదర్శిస్తూ అంది శాంత.

'మరింకేం మనమంటావు శాంతా? ఊరికి మకుటంలాంటివాడే యిలా ప్రవర్తిస్తూ ఉన్నప్పుడు ఆ విధంగా అనుకోవడంలో వింతేముంది?'

'వింతో...సంతో ... నాకు మతిపోతూ ఉంది. ఎటూ నిర్ణయించుకోలేక పిచ్చిదాన్నవుతున్నాను. మాఘమాసంలో నాకు, బావకు పెళ్లిచేయాలని పెళ్లిముహూర్తం కోసం వెదికిస్తున్నాడు నాన్న. బావ ప్రవర్తన చూస్తూ ఉంటే నాకేం చేయాలో తోచడంలేదు.' నిర్లిప్తతతో అంది శాంత.

'ఇటువంటి విషయాలన్నీ చూడవలసి వస్తుందనే నేను మొట్టమొదట ఈ పల్లెటూరికి డాక్టరుగా రానన్నాను. నీవుకూడా బలవంతం చేయడంతో నిన్ను తృప్తిపరచడానికి వచ్చాను. లేకపోతే నేనసలే రాకపోయేవాడిని.' విషాదం నిండిన ఆమె కళ్ళల్లోకి ఆశగా చూస్తూ అన్నాడు సుందరం.

'నాకోసం రావడమేమిటి? విచిత్రంగా ఉందే!' కనుగ్రుడ్లను విచిత్రంగా త్రిప్పుతూ అంది శాంత.

'నీకోసం కాకపోతే యిక్కడికి వచ్చేవాణ్ణే కాదు.'

'కృతజ్ఞురాలిని. నా మాటపై మీకింత గౌరవం ఉన్నదన్నసంగతి నా ఊహకు తట్టనే లేదు' అంది శాంత.

అంతలో కాంపౌండరు పిలుపు నందుకొని

## రోగాల రథం

# ఫ్లీ

ఇదొక బాహ్య పరాన్నజీవి. పక్షులు, క్షీరదాలు అనేక జాతులు వీటి బారిన పడతాయి. మానవుడు కూడా ఈ ఫ్లీ వల్ల బాధని అనుభవిస్తున్నాడు. సుమారు 1000 జాతుల ఫ్లీలున్నాయి. వాటిలో ఒక్కొక్కటి ఒకజాతి క్షీరదానికికాని, పక్షికికాని పరిమితమై ఉన్నా, ఇతర వాటిమీద కూడా ఆహారం సంపాదించడం పరిపాటి. మానవ ఫ్లీ [ప్యూలెక్సు] ఎలకఫ్లీ [జీనోప్సిల్లా]— ఇలా రకరకాలుగా ఉన్నాయి.

ఇవి చాలా సూక్ష్మమైనవి. రెక్కలుండవు. కళ్లు కూడా చాలా జాతుల్లో ఉండవు. కాని కాళ్లు పొడవుగా ఉంటాయి. హైజంప్, లాంగ్ జంప్ పోటీలుపెడితే జంతు ప్రపంచంలో వీటిని ఓడించే వేవీ ఉండవు. కీటకాల్లో, కప్పల్లో, కుందేళ్ళూ, కంగారులూ అన్నీ దిగదుడుపే. ఫ్లీ 8 అంగుళాలు ఎత్తుకు దూకుతుందిట. అంటే దానిపైజకు 100 రెట్లు ఎంతు ఉంది. ఈ పోలికకి మనం బ్రహ్మాండమైన మేడలు సునాయాసంగా దూకగల్గాలి. అప్పటికీ దాన్ని ఓడించలేము.

దాని శరీరం ప్రక్కలకు పల్చగా, విరుసు వెంట్రుకల చక్కని అమరికతో ఉంటుంది. వీటివల్ల అది పోషక జీవి శరీరం మీదనుంచి జారిపడిపోదు. వీటినోటి భాగాలు రక్తాన్ని పీల్చడానికి చాలా అనువుగా ఉంటాయి. ఫ్లీలు అంతగా పోషక జీవి శరీరాన్ని పట్టే ఉంటాయని లేదు [పేనులాగా]. అలాగా అని మరీ అట విడువుగా నల్లిలాగా వేరే కాపరం పెట్టవు. ఇట్టంమీద, జంతువుల నివాసాల్లోనూ, పక్షుల గూళ్ళలోనూ ఉంటాయి. శరీరంపైన కూడా ఉంటాయి. అసలు నివాసమే లేని కోతుల్లాంటి వాటి శరీరంమీద ఫ్లీలు అరుదు.

మానవ ఫ్లీ చలిప్రాంతాలలోనే ఎక్కువ. ఉష్ణప్రాంతాలలో లేదు. కొందరికి ఇది ఉంటే నిద్ర పట్టదుట. కొందరికి గొప్పగా ఏమీ అనిపించదు. (నల్లి, దోమల బాధలాగే.) ఇదికాక ఫ్లీలు రోగాలు చేరవేతకు ముఖ్యకారణాలు. అందులో ప్లేగు వ్యాధి వ్యాప్తికి ఇది చాలా ప్రసిద్ధి. 14వ శతాబ్దంలో యూరప్పులోవి సాల్గోవంతు జనాభా (2న్నర లక్షలు) ఈరోగం వల్ల చనిపోయారుట. ఇండియాలో ఏటా 5 లక్షల వరకు చనిపోతూ ఉండేవారుట. కాని ఈ రోజుల్లో అది పూర్తిగా సమసిపోయింది. 10, 12 ఏళ్ళక్రింద, మొత్తం ప్రపంచం అంతా 700 మందికి ఇది సోకిందిట.

1914లో ఇండియా ప్లేగు కమిషన్‌వారు ఈ రోగవ్యాప్తికి కారణాలు కనుక్కొన్నారు. పాశ్చరెల్లా పెస్టిస్ అనే బాక్టీరియము దీనికి కారణము. జీనోప్సిల్లా [ఎలకఫ్లీ] శరీరంలో ఈ క్రిమి ప్రవేశించాక దాని గర్భంలో విపరీతంగా పెరిగి, పీల్చే రక్తంలోపలికి పోక, బయటకు కక్కి వేస్తుంది. అందులో ఈ క్రిములుంటాయి. ఈ రోగం వల్ల ఎలక చనిపోయాక, ఫ్లీ ఎలకని వదలి వేస్తుంది. ఇక ఎవరు దొరికితే వారిని పడుతుంది. సూక్ష్మజీవి కావడం వల్ల, మనకు కనబడదు. పైగా 8 అంగుళాల వరకూ ఎగురుతుంది కాబట్టి కాళ్ళమ పడుతుంది. క్రిమి మన శరీరంలోకి ప్రవేశిస్తుంది.

## మల్లెలు

ఆస్పత్రివైపు నడిచాడు సుందరం. శాంత యింటికి వెళ్ళిపోయింది.

* * *

చల్లని పిల్లగాలివల్ల కలుగుతూన్న కమనీయ సంగీతానికి తోటలోని చెట్లన్నీ తల లూపుతున్నాయి. శాంత సుందరం యిద్దరూ ఆస్పత్రిముందు కూర్చీలలో కూర్చొని కబుర్లలో పడ్డారు.

'శాంతా ఎంతోకాలంగా నీతో ఒక విషయం చెప్పాలని అనుకుంటూ ఉన్నాను. కాని ఆ అవకాశం కలగలేదు. నీవేమి అనుకోనంటే...' సంకోచంతో మాట పూర్తి చేయలేక పోయాడు.

'ఏమిటో ఆ విషయం?' ఓరగా సుందరాన్ని చూస్తూ సిగ్గుతో ముద్దబంతి పూవులా ఐపోయి అన్నది శాంత.

'శాంతా! నాకు తెలియకుండా నీవు నా హృదయంలో నివాస మేర్పరచుకున్నావు. ఆక్షణంనుండీ నీవు ఎక్కడికీ పారిపోకుండా ఆ హృదయంచుట్టూ అభేద్యమైన ప్రహరీ నిర్మించి అహోరాత్రాలు కావలికాయలేక సతమతమౌతున్నాను. నీవు ఊఁ అంటే నాజన్మ ధన్యమౌతుంది. నీవు కాదంటే జీవితాంతం నిన్నే తలుచుకుంటూ బ్రహ్మచారిగా ఉండిపోతాను. నీ సుముఖత నాకు చక్కని జీవితాన్ని సృష్టిస్తుంది. నీ విముఖత నా జీవితాన్ని సుడిగుండాలలోనికి త్రోసివేస్తుంది' శాంత చేతిని తన చేతిలోనికి తీసుకొని మృదువుగానొక్కుతూ, ఆమె చూపులలోతన చూపులు కలుపుతూ ముఖంలో లేనిదైన్యాన్ని తెచ్చిపెట్టుకుంటూఅన్నాడుసుందరం.

ఎవరైనా చూస్తున్నారేమోనని నలువైపులా బెదురుచూపులతో చూస్తూ కళ్లతో తన యిష్టాన్ని వ్యక్తం చేస్తూ సిగ్గుతో తలదించుకొని 'ఎవరైనా చూస్తారు' అని అతని చేతిలో నలిగిపోతున్న తనచేతిని మెల్లిగా విడిపించుకుంది. అతని స్పర్శలోని వెచ్చదనానికి హృదయం పొంగిపోతూ ఉండగా తన్మయత్వంతో కళ్లుమూసుకొని కుర్చీలో వెనుకకు వాలింది.

'శాంతా! ఈ పల్లెటూర్లో నీవేం సుఖపడతావు ? మనుషుల విలువల వర్తించేనుకోలేని ఈ మూర్ఖులమధ్య మనమెందుకు? మనమిద్దరమూ వివాహం చేసుకొని సుఖ సంతోషాలలో విహరిద్దాం

అప్పుడే తన్ను తలపోయకుండా హాయిగా కలల్లో ఏవో ఊహాలోకాలలో విహరిస్తూ అన్నాడు సుందరం.

'ఇదెలా సాధ్యపడుతుంది? ఇందుకు నాన్న ససేమిరా ఒప్పుకోడు. పైగా పెద్ద గొడవచేస్తాడు. బావ మాత్రం ఊరుకుంటాడా?'

'అందుకు ఒక్కటే మార్గముంది శాంతా! నీవు ధైర్యంచేస్తానంటేచెబుతాను.'

'ఏమిటది ... ?' ఆదుర్దాతో ప్రశ్నించింది శాంత.

'ఎవ్వరికీ తెలియకుండా వెళ్ళిపోదాం. హైదరాబాదులో చక్కగా రిజిస్టరుమ్యారేజి చేసుకుందాం.'

'అమ్మబాబోయ్!' ఉలికిపాటుతోఅందిశాంత.

'అందుకే మొదటే చెప్పాను. ధైర్యం కావాలని.'

'సుందరం, ధైర్యం వహించడం, వహించక పోవడమనే సమస్యకాదు. ఆ విధంగా చేసి శాశ్వతంగా నాన్నకు దూరంకాలేను. నలుగురిలో 'శాంత యిలా చేసింది' అనే చెడ్డ పేరు తెచ్చుకోలేను. ధైర్యంగా నాన్న నెదిరిస్తాను. ఆయనే మన వివాహం జరిపించేటట్లు చూస్తాను. నీవు చెప్పినట్లు చేస్తే శాశ్వతంగా మనకు ఈ ఊరిలో ఋణం తీరిపోతుంది. అది నా కిష్టంలేదు' ముఖాన్ని గంభీరంగా మార్చుకుంటూ అంది శాంత.

'అదంత తేలికైన విషయంలా నాకు తోచడంలేదు.'

'ఎందుకుకాదు...? నేను వద్దని మొండికేస్తే బలవంతంగా బావకు, నాకువివాహం జరిపిస్తాడా నాన్న? అలా ఎప్పటికీ చేయలేడు. బావకూడా చాలా అభిమానం, పౌరుషం గలవాడు. తనను మనస్ఫూర్తిగా కోరని స్త్రీని వివాహమాడడానికి ముందుకు రాడని నా ఊహ.'

'అదిఊహమాత్రమే! ఒకవేళ మనయిద్దరి మధ్యరామంపట్టుదలతోఅడ్డుగానిలుస్తే...?'

'అప్పుడు వేరే మార్గమేదైనా ఆలోచిద్దాం. అంతేకాని పెద్దవాళ్ళకు తెలియజేయకుండా నిన్ను వివాహమాడడం నాకే మాత్రం యిష్టంలేదు.' ఏవో ఆలోచనలతో ఉక్కిరిబిక్కిరౌతూ అంది శాంత.

'సరే శాంతా! నీ యిష్టమే నాయిష్టం నీకుమాత్రం నేను ఎందుకుచెప్పను' శాంత తనది కాబోతున్నదనే సంతోషంతో పొంగిపోతూ తన్మయుడై పోయాడు.

(ఇంకా వుంది)

# అనృతం కూడా సత్యమే



ధర్మపథం । బులుసు వేంకటరమణయ్య

భాగవతంలోని 'వారిజాక్షులందు వైవాహికము లందు' అనే పద్యాన్ని చాలామంది వినే ఉంటారు. స్త్రీలను ఆపదలనుండి కాపాడవలసి వచ్చినప్పుడూ, వివాహాలు కుదిర్చే సందర్భంలోనూ, ప్రాణాలకూ, ధనానికీ, మానానికి అపాయం కలిగేటట్లయితే దాన్ని తప్పించుకొనేటందుకూ, భయపడిన గోవులనూ, అగ్రజన్ములనూ రక్షించవలసి నప్పుడూ అబద్ధం ఆడవచ్చునని దాని అభిప్రాయం. అబద్ధం ఆడితే పాపం సంభవిస్తుంది. కాని, పయి సందర్భాలలో పలికిన బొంకువల్ల మాత్రం పాపం కలుగదని ఆప్తవాక్యం.

అలాటి సందర్భాల్లో ఆడిన అసత్యం వల్ల పాపం కలుగకపోవచ్చును కాని 'కుక్క గోవు కాని' విధంగా అసత్యం అసత్యమేకాని సత్యం ఎంతమాత్రమూ కాదు.

అందువల్ల కొందరు సత్యవాదులు— పాపం లేక పోయినా—అసత్యం పలికి—పయి విషయాలలో ఔక్యం కలుగజేసుకోడానికి వెనక తీస్తారు.

ఇట్టివారికి పరోపకారం చెయ్యడంలో ప్రోత్సాహం కలిగించడానికి అసత్యం అవసరమైన సందర్భాలలో పాపంలేక పోవడం సరే కదా—ఆ అసత్యం సత్యమే అని చెప్పవలసి వుంటుంది. దాన్నిబట్టే ఈపద్యం ఏర్పడింది—

'ఉన్నది కన్నది విన్నది
యున్నట్లుగఁ బలుకుటయును ఒరులకు సత్యౌ
న్నత కలుగఁగఁగల్గ్యౌ
న్నతిగల కల్లమాటయును సత్యమగున్.'

ఉన్నదానిని ఉన్నట్లూ, చూచినదానిని చూచినట్లూ, విన్నదానిని విన్నమాదిరిగానూ చెప్పడం సత్యం అవుతుంది. ఆవిధంగానే ఇతరులకు గొప్ప ఆపద కలిగినప్పుడు, ఆ లవటను పోగొట్టి వారికి మేలునూ శుభాన్నీ కలిగించడానికి ఆడిన అబద్ధమునున్నూ సత్యమే అవుతుంది కాని అసత్యంకాదు' అని దీని అభిప్రాయం.

భాగవతంలోని పద్యంలో ఎలాంటి సందర్భాల్లో అబద్ధం ఆడవచ్చునో వివరించబడింది. ఈ పద్యంలో సత్యస్వరూపం ఎటువంటిదో చెప్పబడడమే కాకుండా- అయా సందర్భాలను పేర్కొనకుండా—సర్వ సామాన్యంగా—జాతిమతాది భేదాల్లూ, పక్షపాతాలూ లేకుండా, ఆపదలో ఉండేవారిని అందరిని వాటినుండి రక్షించి, వారికి శుభాన్ని కలిగించడంకోసం ఆడే అబద్ధం సత్యమే అవుతుందని చెప్పడం ఎంతో ఉచితంగా ఉన్నది.

అన్ని రంగాల్లోనూ అభ్యున్నతి కావలసిన ఈకాలంలో ప్రతిభావంతులైన రాజకీయవేత్తలూ, నాయకులూ, సమయానుకూలంగా స్వార్థంకోసం సత్యాన్ని అసత్యంగానూ, అసత్యాన్ని సత్యాన్నిగానూ మార్చివేస్తూ వుండడం అందరికీ తెలుసు! అట్టి స్థితిలో పరోపకారార్థమైన అసత్యం సత్యం కావడం—ప్రశంసనీయమే! ●




కలకత్తాకు టిక్కెట్టు తీసుకున్నానే గాని, నాకంతా అయోమయంగావుంది.

కళ్లు మిరుమిట్లుకొలిపే దీపాలు, ఆదరా బాదరాగా అటూ ఇటూ తిరుగుతూవుండే జనం, అంతకుముందు రెండుమూడుసార్లు మద్రాసు సెంట్రల్‌స్టేషన్‌కు వచ్చివున్నప్పటికీ ఈ రోజు నాకెందుకో భయం భయంగా వుంది.

భుజానికున్న సంచిని సర్దుకొంటూ, టిక్కెట్టు గేట్‌లో చూపించి లోపలికి అడుగు పెట్టాను.

విశాలమైన ప్లాట్‌ఫారం, ఎదురుగా 8—10 చూపిస్తున్న పెద్ద గడియారం, ఎడమవైపు పెద్ద పుస్తకాలషాపు అక్కడ పుస్తకాలను చూస్తున్న కొందరు నాఈడు వాళ్లు—ఫలానాబండి పోనున్నదని చెబుతూ వుండే లౌడ్‌స్పీకర్ల గోల, దూరంగా పోర్టరుతో వాగ్వాదం పడుతున్న ఎవరో పెద్దాయన, బెత్తంతోకొడుతూ ఒక చింపిరి గుడ్డల కుర్రవాడిని బయటకు తరుముతూన్న ఒక రైల్వే అధికారి ...

నా జేబులోవున్న చేతిలో— కలకత్తాకు తీసుకున్న టిక్కెట్టు చల్లగా తగులుతూ వుంది.

మొదటిసారిగావున్న వూరును వదిలి పెట్టా లనుకొంటున్న నా ప్రయత్నం ... తలచుకొంటున్న కొద్దీ...మనసులో కలవరం ఎక్కువవుతూ వుంది.

దూరంగా బెత్తం దెబ్బలకు అరుస్తూ, గేటులోంచి బయటికి పోతూవున్న ఆ పిల్లవాడి సంగతి ఎవరూ పట్టించు కున్నట్టు లేదు.

బహుశః ఆ కుర్రవాడికి ఎవరూలేరేమో ... రైలు అందుకోడానికి ఎవరో పరుగెడు తున్నారు.

ఎవరికి ఏవరున్నా, లేకపోయినా వీళ్లంతా ప్రయాణంచేస్తున్న వాళ్లేకదా!

అయినా పద్నాలుగేళ్లవాణ్ని—ధర్డ్‌ఫారం కుర్రాణ్ని నేనూ వీళ్లలా ప్రయాణం చేయ గలనా ?

పొరబాటు పనిచేయడం లేదుకదా ?

ఈ బయట ప్రపంచంలో ... ఎందరో వింత వింత స్వభావాల మనుషులు చుట్టూ మసలుతూవున్న పరిస్థితుల్లో ఒంట రిగా, ఉన్న దిక్కు వదులుకొని—ఏదిక్కు కని పెరిగ్గా అనుకోకుండా నాలాంటివాళ్ళు ఎంత

దూరం పోగలరు ?

'నీకివ్వాల్సిన కూలి 'రూల్' ప్రకారం ఇంతే...అంతకంటె ఎక్కువడగడానికి నీకధికారం లేదు' పెద్దమనిషి పోర్టర్‌తో అంటున్నాడు.

'రూలూ...గీలూ... ఏం పనికిరావు—నాకువూత్రం రూపాయి ఇచ్చి తీరాల్సిందే... ఎవరితోనన్నా పోయి చెప్పుకోండి' పోర్టర్ ధీమాగా అంటున్నాడు. పెద్ద మనిషి ఏమంటున్నా అతను వినిపించుకోవడంలేదు. పైగా 'రూల్' ప్రకారం ఏం జరుగుతుందో ! చూపించమంటున్నాడు.

నాకివన్నీ చూస్తున్నకొద్దీ భయం వేయసాగింది, 'ఇంటికిపోదామా' అనిపించింది.

ఇల్లు...ఇల్లు...

ముందుకు నడిచాను. అప్రయత్నంగా చుట్టూ చూశాను.

ఒకమూల 'స్క్వాడ్సు' వేస్తున్నారు. అదేం క్రొత్తకాకపోయినా స్టేషన్లో అలా చూడడం వింతగానే వుంది.

ఎడం ప్రక్కకు తిరిగాను. కొరడాతో చెళ్ళున కొట్టినట్లయింది.

అక్కడ పోస్టర్...ఆపోస్టర్...ఆ దృశ్యం తలచుకొంటూ వుంటే నామీద నాకే అసహ్యం వేయసాగింది.

అంతే...మళ్ళా ఏ ఆలోచనలూ రాలేదు.

హపురా మెయిల్‌వున్న ప్లాట్‌ఫారం వైపుగా నడుస్తున్న నా పాదాలు తడబడసాగాయి.

రైలు కదిలింది.

ఎవరో తొందర్లో 'హోల్డాన్ హోల్డాన్' అంటూ రైలుప్రక్కనే పరుగెడుతున్నారు.

కంపార్ట్‌మెంట్ అంత రద్దీగా లేదు.

భుజానికున్న సంచీని అలాగే ఒళ్ళో వుంచుకొని, కిటికీ ప్రక్కనే కూర్చున్న నన్ను కొందరు గమనించడం చూశాను.

నాకు ఇబ్బందిగా వుంది.

గుచ్చిగుచ్చి చూస్తుంటే సిగ్గుపడడానికి నేనేమీ ఆడపిల్లను కాకపోయినా, ఆడపిల్లలు అలా చూసినప్పుడుకూడా నేను 'ఇది'గా ఫీలవుతానని వీళ్ళకెలా తెలియజెయ్యడం?

రైలు లైట్ల వెలుగును చూసుకొంటూ ముందుకు పోతూవుంటే...చాలా వుత్సాహంగా వుంది.

'ఎక్కడిదాకా అబ్బాయ్?' నా ప్రక్కన ముసలిగొంతు వినిపించింది.

'కలకత్తా' అన్నాను.

అతను వులిక్కిపడ్డాడు.

'అంత దూరం ... ఒంటరిగా పోతున్నావా ?'...

...'చుట్టూ వున్నవాళ్ళంతా మనుషులు కారూ' మనసులోనే గొణుక్కుంటూ 'వూ' అన్నాను.

'మీవా ళ్ళెవరూలేరూ?...మీఅమ్మా ... నాన్నా...' పాతగొంతు ఇటు ప్రక్కనున్న గొంతుతో కలిసి ఒకేలా ధ్వనించింది.

కిటికీ మీదుగా తల వుంచి అలాగే బయటికి చూడసాగాను.

చీకటి...దగ్గరగా...దూరంగా...చీకటి... అంతా చీకటిగా వుంది.

'నిద్రొస్తున్నట్లుంది కుర్రాడికి' జవాబు రాకపోవడాన్ని వాళ్ళు అలా సమర్థించుకున్నారు.

నేను నిద్రపోవడం లేదని—ఆ అమ్మా నాన్నల శబ్దమే నన్ను దహిస్తూ వుందని మీకెలా తెలియజేసేది...?

నా చుట్టూ వున్న చీకటి తెరల వెనుక...తెరల...మీద...

ఆ దృశ్యాలు మీకేం తెలుసు?

...చూసివుంటే ఆ తెరలమీద కథలే మీకు తెలుసు ... కాని ... ఆ వెండి తెరల వెనుక...నా గుండె తెరల్లో మండే మంటలు ...మీకు నేనెలా చెప్పను?

ఈపాటికి...ఇలాంటి చీకట్లలో...ఎన్నో నాలుగు గోడల సరిహద్దుల నడుమ ... నేను చెప్పలేను చెప్పలేను...

* * *

చీకటి...చుట్టూ చీకటి...అంతా నిశ్శబ్దంగా వుంది.

డిటెక్టివ్ నేరస్థుడి కోసం నైట్‌క్లబ్‌లోకి వచ్చాడు. ఒక్కసారి లైట్లు వెలిగాయి.

తెరల వెనుక...కొందరు సన్నగా పాశ్చాత్య సంగీతం వినిపిస్తున్నట్లున్న అభినయం.

ఒక్కసారిగా తెరలు తొలిగాయి. వాద్యాలు విజృంభించిన ధ్వని.

మదనమంజరి తన అర్ధనగ్న శరీరంపై అలవోకగా వుంచుకున్న ఒక సన్నని సిల్కు వస్త్రాన్ని డిటెక్టివ్ పైకి విసిరి తన నాట్యాన్ని ఆరంభించింది.

ఆమె నడుము— పిరుదులు— పూనకం పూనినట్లు ఆడుతున్నాయి.

డిటెక్టివ్ గంభీరంగా సిగరెట్ పీలుస్తూ ఆమెనే చూస్తున్నాడు.

మళ్ళా ఒక్కసారిగా చీకటి...చీకటి... చీకటి...అంతే...ఆ తర్వాత...వెలుగు...

... ఈసారి ఎన్నో దీపాల మధ్య ... వెలుగు...చీకటి...చీకటి...వెలుగు...

ఆ గదిలోని నిశ్శబ్దం...ఈ హాలులో తవ్వితచ్చినా దొరకదు. ఎందుకంటె ఇది తవ్వితచ్చిన వాళ్ళందరికీ శబ్దం చేసుకోవడానికి 'లైసెన్స్' ఇవ్వబడింది...

నైట్‌క్లబ్ దృశ్యం.

ఈలలు...చప్పట్లు...గోల...

ఆడవాళ్ళు తమతో కూడావచ్చిన వున్న తండ్రులనూ...అన్నలనూ.. తమ్ములనూ... ఆ సమయంలో చూడడానికి సిగ్గుపడుతున్నారు.

నోరు వెళ్ళబెట్టుకొని అలాగే చూస్తున్న కొందరు భర్తలను భార్యలు లోలోపల తిట్టుకొంటున్నారు.

'ఈసారి...మంజరి బలే గుమ్మగా ఆడతాందిరా.'

'కన్ను కొట్టిన చిన్నది' అని సినిమా పేరెట్టినందుకు... మాబాగా వుందిరా ... గుంట...'

'మంజరట ... మంజరి ... మా భలేగా ఆడిస్తా వుందిరా...లం...'

ముందు బెంచీలవాళ్ళు జోరుగా వ్యాఖ్యలు చేస్తున్నారు...చీకటి...అంతా చీకటి...

* * *

ఆ హైస్కూల్ కాంపౌండులో 'కాడిలాక్' ఆగింది. చక్కగా 'టాయిలెట్' అయిన ఆ అబ్బాయి కారు దిగి క్లాస్ రూమ్‌లోకి అడుగు పెట్టబోతుండగా — డ్రైవర్ వెనకాలే పరుగెత్తుకొంటూ — ఏదో మరచి పోయిన ఒక పుస్తకాన్ని ఇచ్చాడు. ఆ అబ్బాయి ఒకసారి అలాగే నిలబడి 'నోట్సు' సరిగ్గా వుందో— లేదో చూసుకోసాగాడు డ్రైవర్‌ను వెళ్ళమని.

'సుధాకర్ రా...సుధాకర్' దూరంగావున్న బెంచీల్లో విద్యార్థుల కలకలం.

'సుధాకర్...ఏమిటెరా... నీ తంకాయ... మదనమంజరి కొడుకనకుండా...'

'చూపు చూస్తావా...బుడ్డి వేస్తావా...' నవ్వులు.

'ఒరేయ్...వెధవా...ఎగతాళి చేస్తున్నావ్ గాని ... ఆ పాట రాసిందెవరో తెలుసా ... భయంకర విప్లవ జానపద కవి 'నిశాశ్రీ'

నాడు.'

'ఛా ... ఛా ... మళ్ళా అలా అంటేనే తంతాను...మన మదనమంజరిగారి మొగుడంటే...చాలు.'

'హో హోహో...ఏంపాట ... దానికి తగినట్లు ఆ ... మదన మంజరిగారి ఆట ... చూపు చూస్తావా...బుడ్డివేస్తావా...'

ఆ అబ్బాయి ఇక వినలేక పోతున్నాడు.

ఈ లోగా ఇంకొకవిద్యార్థి బయటికి వస్తూ...'గురూ...మీ అమ్మ కొత్తపిక్చర్ నిన్ననే చూశాను...ఇంతకుముందు సినిమాలని 'బీట్' చేశారంటే నమ్మ...ఆ...అది సరే...నువ్వుకూడా మెల్లిగా సినిమాల్లో దూరిపోకూడదూ...ఈ చదువూ...అదీ ... అంతా దండగగురూ...వీలైతే...నన్నుకూడా ...మెల్లిగా...మర్చిపోవుకదూ ... అదంతా మంచి 'కళ' గురూ...'

అతనికి దూరంగా వెనకాల కొందరు గొల్లుమన్నారు మళ్ళా.

కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ప్రతీసారి ఎలాగోలా సర్దుకుంటున్నాడు. ఇక భరించలేక పోయాడు. క్లాసులోకి వెళ్ళకుండానే బయటికి వచ్చాడు. చుట్టూ నవ్వులు ఇంకా వెంటాడుతూనే వున్నాయి.

స్కూలుబయట పార్కులో ఒంటరిగా ఒకమూల కూర్చొని ఏడ్చాడు— తనివితీరా

# నన్ను రక్షించండి

ఏడ్చాడు.

అతన్ని ఓదార్చడానికి అక్కడ ఎవ్వరూ లేరు.

ఆ రాత్రి భవంతిలో తన రూమ్‌లోంచి 'ఎప్పుడూ అనుమతి లేకుండా తమ ప్రైవేట్ రూమ్‌లలోకి రాకూడదన్న తల్లిదండ్రుల ఆంక్షను' కాదని మొదటిసారిగా తండ్రిగదిలోకి అడుగుపెట్టాడు.

మంచంమీద ఆయన లేడు ...

ఆశ్చర్యంగా చుట్టూ చూశాడు.

మంచంక్రింద వెల్లకితలా పడివున్నాడు. అతని చేతిలోని 'బాటిల్' మీద వి. ఎ. టి. 69 అని వుంది.

గదంతా అదోరకం వాసన.

దూరంగా తెల్లకాగితాలు చిందర వందరగా పడివున్నాయి. వాటిలో కొన్నిటిమీద... ఏదేదో వ్రాసివుంది.

అసహ్యంగా బయటికివచ్చి ... మేడమీద తల్లిగది వైపుగా నడిచాడు ఆ అబ్బాయి.

గదిలోంచి నవ్వులు వినిపిస్తున్నాయి.

మధ్య మధ్య మాటలు—అక్కడే ఆగాడు.

'చూడండి...ఇప్పుడు హీరో...మీ నడుము ఇలా పట్టుకొని ... అలా దగ్గరకు లాక్కుంటూ...బుగ్గమీద...'

మెల్లా నవ్వులు.

తలుపు తోసుకొంటూ లోపలికి వెళ్ళిన ఆ అబ్బాయి అలానే నిలబడిపోయాడు.

లోపల అమ్మ 'బికినీ'లో వుంది. ఎవరో అతను అమ్మను...

'అమ్మా...స్కూల్లోనే...'

ఎర్రని 'బికినీ'లో వున్న ఆమె మొహం కందగడ్డ అయింది.

ఆ అబ్బాయి చెంప చెళ్ళుమంది.

'రాస్కెల్...ఎన్నెప్పుడూ...ఇక్కడికి వచ్చి 'డిస్టర్బ్' చెయ్యవద్దని చెప్పానా ... పో ... గెటవుట్ ... ఏదైనావుంటే మీ 'డాడీ'తో చెప్పు' ఆమె అటువైపు తిరిగి 'సారీ' అని చెప్పి—ధభీమని తలుపు వేసేసింది.

ఆ అబ్బాయి త న గ ది లో కూర్చొని రాత్రంతా ఏడ్చాడు. బలహీనులకు ఏడుపుకంటే మంచి 'టానిక్' ఎక్కడుంటుంది?

మర్నాడూ హైస్కూల్‌లో ఆ విధంగానే జరిగింది...ఏమూల...ఎక్కడికి వెళ్ళినా ... తనను వేలెత్తి చూపిస్తున్నారు.

...'అడుగో...రా...మన మదనమంజరి కొడుకు ... దాని పోలికే బాగా వచ్చింది కదూ...'

'ఆ హో హో ...వాళ్ళనాన్న సినిమాలకు రెండర్థాల పాటలు...మంచి నిషాలో రాస్తాడు ...అమ్మ ఆడుతుంది...వీడే...ఇంకా...చదువులో వున్నాడు...పాపం...'

'ఛీ...ఛీ...ఇంకా స్కూలుకు రావడానికి నీకు సిగ్గు వేయడంలా ... వుందిగదా బోల్డు డబ్బు...మీ అమ్మను పోయమనరా ... ఎవరైనా...మీ ఇంటికేవచ్చి చెప్తారు?...

ములుకుల్లాంటి మాటలు తగులుతూ వుంటే ఆ అబ్బాయి రక్తాశ్రువులు రాల్చేవాడు.

వాళ్ళను మరచి పోదామని ... ఎక్కడికి వెళ్ళినా...ఏ గోడవైపు చూసినా...ప్రతీ చోట దర్శనమిచ్చేవి...ఆ దృశ్యాలే ...

మమ్మీ...కాదు...కాదు... మదనమంజరి.

ఈ స్థితి భరించలేని విధంగా వుంది. తన జీవితం తనకే అసహ్యంగా వుంది.

ఈ వాతావరణం వదిలి...ఎవరికీ తెలియని స్థలానికి తాను పోవాలి ... అక్కడ తనకు ఎవరూ లే క పో యి నా సరే ... ...తనను గేలిచేయనివారు... తనంటే జాలిపడేవారు...వుండే స్థలం...అయితే చాలు.

—కాని...కాని...ఇదేమిటి ... తను పారి



# పశువులకు గూడా ప్రేమ కావాలి



మీ పశువులను తగినంత శ్రద్ధతో చూచి వాటికి కావలసిన రక్షణ నియ్యండి, అవి మీకు ఎంతో పని చేస్తాయి, ఎక్కువ లాభాలను చేకూర్చుతాయి. సిమెంట్‌తో, ఏసిసి సిమెంట్‌తో, వాటికి ఆరోగ్యకరమైన వసతులను కల్పించండి. ఏసిసి సిమెంటు పగిలి పోదు, పొడిగా పరిశుభ్రంగా ఉంటుంది. ఎంతో తేలికగా శుభ్రం చేసుకో వచ్చును. అగ్ని ప్రమాదాల భయం ఉండదు. పశువుల కొట్టములకు, నీళ్ళ తొట్లు. మేత తొట్లకు కొద్ది ఖర్చులైతే చాలు.

మీ సిమెంటు అవసరాలకు దగ్గరలో ఉన్న ఏసిసి సిమెంట్ స్టాకిస్టుతో గాని లేక ది సిమెంట్ మార్కెటింగ్ కంపెనీ ఆఫ్ ఇండియా లిమిటెడ్, బహదూర్ బిల్డింగ్, 66ఏ, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాదుతో గాని సంప్రదించండి.

ది కాంక్రీట్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా, బహదూర్ బిల్డింగ్, 66ఏ, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాదు నుండి ఉచిత సాంకేతిక సహాయం లభిస్తుంది.

**ACC**
రైతు మిత్రులు

ది అసోసియేటెడ్ సిమెంట్ కంపెనీస్ లిమిటెడ్
ది సిమెంట్ మార్కెటింగ్ కంపెనీ ఆఫ్ ఇండియా లిమిటెడ్

# రచయితలకు మనవి

### కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరించబడని తమ వ్రాత ప్రతులని తిప్పిపంపకోరే రచయితలు వ్రాత ప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్ళలు అతికించిన, స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంప రాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాతప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరించబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

### నవలలు

ప్రచురణకి స్వీకరించబడని నవలల వ్రాత ప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాత ప్రతులతో స్వంత చిరునామాకల, తగిన మాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంప నవసరం లేదు. 100 ఆరఠావు పేజీల పైబడిన ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణింప బడుతాయి.

### కార్టూన్లు

ప్రచురణకి స్వీకరించబడని కార్టూన్లు తిప్పి పంపకోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

షరా: వ్రాతప్రతులని, కార్టూన్లని వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయములో ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్లు పంపగలరు.

*సంపాదకుడు*

*ఆంధ్రసచిత్రవారపత్రిక*

# నన్ను రక్షించండి

పోతున్నా ..ఇంకా...వెనకాల్నించి ... తరుముతున్నారు...తనని ... ఎవరు ...ఎవరు వీళ్లంతా...

ఎవరు...ఎవరు...ఎవరు మీరు...?

* * *

'ఏంటబ్బాయ్ ... ఎవరు మీరు అంటున్నావ్...బడుసుకున్నావా?'

ఎవరో భుజాలు పట్టుకుని కుదుపుతూ వుంటే...ఉలిక్కిపడిలేచి ... కళ్ళు తుడుచుకున్నాను...

ఏదో స్టేషన్‌లో రైలు ఆగినట్లుంది. ట్యూబ్‌లైట్లు వెలుతురు ... అక్కడక్కడా కనబడుతూ వుంది.

'అబ్బే...ఏమీ లేదండీ' అన్నాను నావైపే చూస్తున్న ఆ ముసలాయనతో.

'టీ' తాగాను బుర్ర వేడెక్కిపోయినట్లుగా...ఏదో... గజిబిజిగా వున్నట్లుంది.

'నీ పేరేంటబ్బాయ్...'ముసలాయన వదిలేటట్లు లేదు.

'సుధాకర్' అన్నాను జేబు రుమాలుతో మొహం తుడుచుకుంటూ.

* * *

హౌరా స్టేషన్‌లో దిగానన్న మాటేగాని...ఎటు పోవాలని అంతుబట్టడం లేదు. అందరూ బెంగాలీలోనే మాట్లాడుతున్నారు.

ముందు ఏదైనా సత్రంలో చోటు సంపాదించాలనుకొని ... ఒకతన్ని అడిగాను. అతనికి నామాటలు అర్థంకాలేదు. ఇంగ్లీషులో అడిగాను.

'సౌత్ ఇండియన్...మద్రాసీ...' అన్నాడు ప్రశ్నార్థకంగా — అవునన్నాను. స్టేషన్‌కు దగ్గరగా ఒక సౌత్‌ఇండియన్ హోటల్ వుందని, అక్కడడిగితే వాళ్లభాషలో అన్నీ చెబుతారనీ - వచ్చీరాని ఇంగ్లీషులో చెప్పాడు— ఆహోటల్‌పేరు కూడా చెప్పాడు.

స్టేషన్ బయట బిట్కావాడు— ఆ హోటల్ ఎంతోదూరమని చెబుతూ... అయిదు నిమిషాల్లో తీసుకొచ్చి నాదగ్గర రూపాయి తీసుకున్నాడు.

ఇంకా నాదగ్గర ఏభై రూపాయలు... ఆపైన కాస్త చిల్లరా వుంది. నాచిల్లర సేవింగ్స్ తొంభై రూపాయలు ఇలా పని కొస్తాయని... నేనసలెప్పుడూ వూహించనే లేదు.

ఆ హోటల్‌ముందు నిలబడి చూశాను పరిశుభ్రంగానే వున్నటనిపించింది. లోపలికి వెళ్తుండగానే ఎడంచేతి వైపుపైన సరస్వతి, లక్ష్మి, పార్వతుల పటాలు — క్రింద కాషియర్‌బల్ల ఇతర సరంజామా కనిపించింది.

'ఏమండీ...ఇక్కడ...ఏమైనా...రూ...'

'పని దొరుకునా...అంటువు...' అతను నామాట పూర్తిచెయ్యకుండానే అడ్డు తగిలాడు. ఆక్షణంలో నాకోవిషయం చటుక్కున స్ఫురించింది. నాదగ్గరున్న డబ్బు తొందర్లో అయిపోవడం ఎలాగూ ఖాయం ... అలాంటప్పుడు ఇప్పుడే...ఏదైనా పని దొరికితే మంచిదేకదా...ఇంతకీ...ఏంపని ంటాడో... ఇంతవరకూ తానసలు...ఏపనీ చేసి ఎరగడు...

నేనేమీ పలుకలేదు అతనలాగే నన్ను పరిశీలించసాగాడు.

'అంతా ఈ...మాదిరి ... గిరాకీదా... నిండాజాస్తి...పని...గిని లేదు...పో అప్పా...' అన్నాడు.

నాకు లోలోపల కాస్త కోపం వచ్చింది. 'నీబోడి హోటల్‌లో పనెవడూ అడగలేదు' అని చెబుదామనుకొంటూనే వెనక్కి తిరిగాను.' 'ఉండు తంబి... ఒరు నిమిషం ...' అన్నాడు మళ్ళీ. నేను ఆగాను. అతను లోపలికి వెళ్ళి రెండు నిమిషాల తర్వాత వచ్చాడు.

'ఏవూరుతంబీ...నీది' అన్నాడు.

'విజయవాడ' ముందుగానే ఆలోచించి పెట్టుకున్నాను.

'అంత దూరంనుండి ఎందుకు వస్తివి? మీ మనుష్యులు ఎవ్వరూ లేరా?'

'నాకు అమ్మా...నాన్నా లేరండి...నన్ను పెంచిన మనిషికూడా చచ్చిపోయాడు — ఈవూరు వస్తే పని దొరుకుతుందని అక్కడివాళ్లు చెప్పారు' నేనెలా చెబుతున్నానో నాకే ఆశ్చర్యం కలుగ సాగింది.

'ఏం చదివితివి?

'ధర్డుఫారం'

'నీపేరు'

'సుధాకర్' అని నాలుక్కొరుక్కున్నాను.

'సరి.. బిల్లులు రాస్తువా . . మూడు పూటలు తిండి పెడుతుము...పణిలు బాగా చేస్తే—ఆపైన జీతం...ఏమి?'

తల వూపాను.

'సరే...సంచీ... అదీ లోపలపెట్టి పని చూసుకో'

* * *

చిట్కాలు రాసేసాని రెండుమూడు రోజులుగా నాకంత కష్టం అనిపించలేదు. ఒక రోజు ఒక 'సెర్వర్' ఏదో పనిమీద బయటికి వెళితే ఆ 'టేబిల్'కు నన్ను 'సెర్వ్' చేయమన్నారు.

నాకు ఏడుపు వచ్చినంత పనైంది.

అయినా నన్నెవరూ ఏడిపించడం లేదన్న భావం—స్వతంత్రంగా జీవిస్తున్నానన్న ధీమా—కష్టపడి పనిచేయడంతో తప్పేమీ లేదన్న ఉద్దేశ్యం—నన్నాపని చేయడానికి పురికొల్పాయి—

ఆరోజు రాత్రి నాకు తెలియకుండా నేను ఎంతగానో ఏడ్చాను.

* * *

ప్రొద్దున్న లేచేటప్పటికి మనసంతా తేలిగ్గా హాయిగా వుంది.

ఉదయిస్తున్న సూర్యుడు — హోటల్ ప్రొప్రయిటరు— తోటి పనివాళ్ళూ—కొంప మునిగిపోయినట్లు అటూ ఇటూ పరిగెట్టే కార్లు, బస్సులు— కలకత్తా రహదార్లు— అంతా కొత్తగా, చైతన్యవంతంగా కనబడ్డాయి.

ఆరోజు ఒక 'సెర్వర్' సెలవు పెట్టడం వలన నేనా 'టేబిల్' చూసుకోవాల్సి వచ్చింది.

అప్పుడే ఎవరో ఒక మధ్య వయస్కుడు నా 'టేబిల్'లో కూర్చొని ఇంగ్లీషు పేపరు చూసుకొంటున్నాడు. నేను ఆయన్ని ఏం కావాలని అడగబోతూ యధాలాపంగా పేపర్ చూశాను. ఆ పేజీలోవున్న 'ఫోటో' చూసి ఉలిక్కిపడ్డాను— తర్వాత సర్దుకొంటూ ... ఆయనను 'ఏం కావాలి?' అని అడిగాను— ఆ ప్రకటన వైపు ఆందోళనగా చూస్తూనే — అందులో నన్ను పట్టిస్తే వెయ్యిరూపాయలు బహుమతి ఇస్తామని వుంది.

నేను అతను చెప్పింది సరిగా వినిపించుకోకుండానే కాఫీచేసే వైపుగా వెళ్ళాను.

'సుధాకర్' అన్న పిలుపు వినబడింది ఒక వైపుగా. గాభరాగా అటుచూశాను—కాషియర్ పిలుస్తుంటే అటు వెళ్ళాను. నా 'టేబిల్'లో కూర్చున్నతను నన్ను గమనించినట్లుంది — నాకు ముచ్చెమటలు పోయసాగాయి. కొంపతీసి ఆయన 'కాషియర్'తో ఈ సంగతి చెప్పేసి నన్ను మద్రాసుకు తీసుకుపోడు గదా!

[illegible] ఆ [illegible] ... ఆ [illegible] వరణం...అందులో మళ్ళీ నేను — తలుపు కొంటేనే...

కాషియర్ అడిగినదానికి బదులు చెప్పి ఒక మూలగా వచ్చి — నా 'టేబిల్'లో కూర్చున్నతన్ని గమనించ సాగాను.

నేననుకున్నట్లే అయింది.

ఆయన పేపరు పట్టుకుని—కాషియర్‌కు చూపిస్తూ—ఏదో చెబుతున్నాడు.

కాషియర్ మధ్య మధ్య తల ఆడిస్తున్నాడు. సందేహం లేదు. వాళ్ళు నన్ను పట్టించి ఆ బహుమతి పంచుకోవాలని చూస్తున్నారు.

నేను ఇక్కడ ఒక్క క్షణం వున్నా ప్రమాదమే. ఒక ప్రక్కన నా సంచి — లోపల గదిలో వుందని జ్ఞాపకం వున్నా అది తీసుకొనేలోగా ఏమవుతుందోనని ... ఆ మూల నుంచి కాషియర్ టేబిల్ దగ్గర వాళ్ళకు కనబడకుండా...మూల మూలల నుంచి, స్తంభాల చాటుగా ... బయటి గుమ్మందాకా వచ్చాను. ఇక్కడ ... ఒక్క క్షణం...వాళ్ళు చూడకుండా వుంటే...రహదారి జనసందోహంలో కలిసిపోవచ్చు.

[illegible] గంతు వేశాను..

'అదుగో... అట్లా... వెళిపోతుండాడు ... సుధాకర్... సుధాకర్...' అరుపులు వెనుక నుంచి...

కొంతదూరం పరుగెట్టి వెనక్కి చూశాను.

—ఆ మధ్య వయస్కుడు. హోటల్‌లో ఇంకో సెర్వరు నావైపే అరుస్తూ — చూపిస్తూ—పరుగెడుతూ వస్తున్నారు.

వాళ్ళతో...కారణంతెలుసుకోకుండా...మరికొందరు...

.............

నేను ఇంకా నా శక్తికొద్దీ ముందుకు పరుగెత్తసాగాను. అలిసి పోతున్నాను—చెమటలు కక్కుకుంటున్నా—నా పరుగు నాపలేదు.

'స్వార్థపరుల్లారా! నేనేం పాపం చేశాను ... వెక్కిరింతల పాలవుతున్న నా విలాస జీవితాన్ని కాదని, మంచిగా బ్రతకడం కోసం— నేను కష్టపడుతుంటే ... ఇంకా నన్ను చంపడానికి ప్రయత్నిస్తున్నారా?... మీకు జాలి లేదు...? తోటి ప్రాణం మీద సానుభూతి లేదూ...? మీరు మనుషులు కారూ...? అయ్యో... రక్షించండి... నన్ను రక్షించండి...' ●



# ప్రశ్నోత్తరం

...కె. రామలక్ష్మి

**వి. ఎల్, వి**

**మీరు సన్నగా ఉంటారా? లావుగా ఉంటారా? ఎలా ఉంటే మీ కిష్టం?**

నే సన్నంగా ఉండే రోజుల్లో లావుగా ఉన్న వాళ్ళంటే సరదా పడేదాన్ని. తీరా నే లావెక్కాక సన్నటి వాళ్ళంటే సరదాగా వుంది. నువ్వెలా ఉంటే ఏం? నాతోబాటు నువ్వూ నడుస్తూంటే నా కోటులో గులాబి తురుముకున్నట్టు గర్వంగా ఉంటుంది అంటారు మా వారు. (అబద్ధం గులాబి కాదు జయంట్ పొద్దు తిరుగుడు పువ్వు అనాలి అంటారు నా కూతుళ్ళు)

**సాగర శ్రీ, అర్లగడ్డ**

**లౌ ఇంగ్లీష్ బ్లయిండ్. ఇక్కడ బ్లయిండ్‌కి అర్థం?**

ఎలాంటిదైనా తను ప్రేమిస్తే తంతగా లోపించ చేసేదే ఆ గుడ్డితనం.

**ఎ. ఎస్. డి. తుని**

**వాదించి గెలవాలంటే ఎలాంటి పుస్తకాలు చదవాలి?**

వాదనలో ఎప్పుడూ గెలుపే రావాలంటే— వాదనకి దిగకుండా ఉండాలి. అంతే.

**ఎమ్. ఆర్. ఆర్, చింతలగర్వు**

**భార్యా భర్తల మధ్య తరుచు తగాదాలు ఎందుకు వస్తాయి అప్పుడేం చేయాలి?**

ఈ సంసార జీవిత యుద్ధాలకి కూడా సంధి సూత్రాలు పాటించాలి. చినికిచినికి గాలివానంటే— చివ్వుతో ఒకప్పుడు ఎగబడి దెబ్బలాడేసుకోవడం పోయి. ఇద్దరి మనస్సులూ తేలికపడతాయి. దెబ్బలాడుకోని భార్యాభర్తలుండరు. కొందరు డబ్బుకీ, నాటికీ దెబ్బలాడుకుంటే— కొందరు మళ్లెప్పూలా? తెల్లటివా? అని కూడ దెబ్బలాడుకుంటారట... చేసు చేవరికి తేర్చుతారు? సంసారంలోకి దిగిన స్త్రీకి అప్పుడేం చేయాలో ఎవరూ చెప్పనక్కరలేదు. పైవాళ్ళ కలగచేసుకోకుండా ఉంటే చాలు. వారే సర్దుకుంటారు.

**ఎల్. జి భీమవరం**

**ఈనాటి యువతులు పిలీ కటేములు చేయుచున్న ఫేషన్లను అనుకరించుటకు కారణం?**

అబద్ధం. అంతకంటే ఆధునికంగా అలంకరించుకునే అందమైన అమ్మాయిలెందరో ఉన్నారు. మన తారామణుల్లో— ఎవరు లుంగీ కట్టారు? ఎవరు గాగరా కట్టారు— ఫేషనబుల్ అనడానికి?

**బి. ఎస్. కె, రాయికల్**

**భర్తకు అనుకూలవతిగా ఉంటే ఆ భార్య ఏడు జన్మాంతరాలు స్త్రీగా జన్మిస్తుందంటారు.**

అందుకే కొంచెం గయ్యాళిగా ఉంటాను నేను— ఈ జన్మ స్త్రీజన్మ చాలునని!

**ఎక్. ఎస్. డి, వ్యాఘ్రేశ్వరం**

**...ఇలాంటివాళ్లు మహాకవులెలా అవుతారో అర్థం కాదు.**

బాగుంది మీ వరస. నాకు తోచినట్టు నన్నుండనిస్తే నా అంత సంతృప్తుడే ఇలలో ఉండడు అన్నాట్ట వో పెద్దమనిషి. అలాంటి పెద్ద మనిషిని సంతృప్తి పరచడానికి ఎందరి మీదనైనా బురద చల్లడానికి సంసిద్ధత తెలియచేస్తూన్న భజన సంఘం ఉంది. ఇంకేం కావాలి?

**ఆర్. ఎస్. ఆర్, కదిరి**

**ఆరుద్ర శ్రీ శ్రీల వివాదంలో మీరు కృష్ణార్జునుల మధ్య పోరులో సుభద్రవలె యిరుకున పడ్డట్టే కదా?**

ఇంతకీ ఎవరు కృష్ణుడు? ఎవరు అర్జునుడు స్వామీ— నేను మటుకు పాతకాలపు సుభద్రను కాను —దెబ్బలాటలో తల దూర్చడానికి. మీరూ మీరూ తేల్చుకోండి అని సూటిగా చెప్పడానికి ఆంకను అవసరం అయితే.

**ఎమ్. ఎస్, వడ్లమూరు**

**రామలక్ష్మిగారూ ఖర్చులు తగ్గించి పొదుపు చేయమంటున్నారు. మీకు కార్డు రాస్తే పదిపైసలు కర్చు కదాండీ?**

ఇక ఇలా దండుగ పని చేయక ఆ పది పైసలకీ పొయింత్రంపూట బటాణీలు కొనుక్కో చిట్టితల్లీ. మా కిక్కడ కరివేపాకిస్తాడు పది పైసలకి. కూరకి డబ్బులేదని పిండ్రాసిగా ఏ ఆడదైనా ఉంటుందా? ముఖం కడిగి బొట్టు పెట్టుకోవడం డబ్బు దండుగ అనుకోదు. అలాగే అలాంటి చిన్నచిన్న పదిపైసల సరదాలు!

**శ్రీప్రియ, హైదాబాదు**

**ఉద్రేకం పురకలు వేస్తూంటే భావపరంపరలను కాగితం మీద పెట్టాలన్న యోచన వచ్చింది. ప్రోత్సహించే నాథుడు కన్పించడం లేదు—**

మీ కాగితం, మీ కలం, మీ ఉద్రేకం, మీ భావ పరంపరలు రాయడానికింకో నాథు డెందుకు. కానేయండి.

**కె. ఎస్. ఆర్, జక్కం**

**మా సంభాషణల్లో ఎక్కువ భాగం మీ గురించే ఉంటుంది కారణం ఏమిటంటారు?**

ఏముందీ— నలుగురు మగవారు చేరితే— ఆడవారిని ఆడిపోసుకోవటం సహజమే అనుకుంటాను నేను!

**పి. వి. ఎమ్. ఆర్, ముంగపాక**

**రామలక్ష్మిగారూ, భారతస్త్రీకి భర్తే ప్రత్యక్షదైవం కదా మరి వేరే దైవమును పూజించుట ఎందుకు?**

ఈ ప్రత్యక్ష దైవాన్ని సవ్యంగా వుండేలా చూడమని వేడుకొందుకు.

**వై. కె, తాడేపల్లిగూడెం**

**మీకే కనుక వోటిస్తే మీ వోటు పాత కాంగ్రెసుకా? కొత్త కాంగ్రెసుకా?**

ఎవరెక్కువిస్తే వారికి!— ఎవరొచ్చినా మన కొరిగేదేముంది కనుక! వ్రతం చెడ్డా ఫలం దక్కాలి. ఏమంటారు?

**డి, ఎస్. ఎస్, విశాఖపట్నం**

**ఈమధ్య ప్రముఖ కవులు అనబడేవారు పత్రికా ముఖంగా తిట్టుకుంటున్నారు చూశారా?**

అయ్యోరామా, ఇద్దరు దెబ్బలాడుకుంటూంటే ఇంట్లో పని మానేసి వింటాను. నా కంత సరదా!

**వి. ఆర్. టి, గొల్లగుండుపాలెం**

**నాగలి గొప్పదా? తుపాకి గొప్పదా?**

నే చదువుకునే రోజులనుండి మా టివ్వ దాకా యిదే విషయంపై కాంపోజిషన్లు, డిబేట్లు సాగించారు. కత్తా? కలమా? రైతా? యోధుడా? పైగాడ్—విముగ్గా లేదూ?

**ఎస్. వి. ఆర్. ఆర్, కొల్లాపూర్**

**ఉదయించే కిరణాలలో కదలాడే మీ భావాలను తెలుసుకోవాలని ఉంది,**

ఆనేం అంత రసవత్తర కావ్య గుళికలు కావండీ, కాఫీపొడి ఉందా? లేదా? అప్పుడే తెల్లారిందేమిటి? ఈ పూట పనిమనిషి నామంపెట్టదు కదా? .... యిలాంటి నేలబారు ఊహలతో లేస్తాను నేను— ఉదయించే సూర్యుని అందం, గట్రా చూడాలనిపిస్తే మహాబలిపురం వెడతాను.

**జె ఎమ్, భద్రాచలం**

**నాకు పెళ్లి చేస్తామంటున్నారు. ఎందుకో నాకు వివాహం అంటే భయంగా ఉంది.**

భయపడనవసరంలేదు— వివాహం చాలా మటుకు అదృష్టంమీద ఆధారపడి ఉంటుంది కనుక. అదృష్టవంతునికి పెళ్లి బంగారు రెక్కలనిస్తే దురదృష్టవంతునికి కాళ్ళకి బేడీలుగా తయారవుతుంది. ●

## సినిమా

## డబ్బు ఏమైయినా చేయిస్తుంది

విశ్వభారతి ప్రొడక్షన్స్‌వారి 'శ్రీమంతుడు' రష్‌ష్ చూసాను చక్కటి సాంకేతిక ప్రమాణాం, బిగువయిన కథాబలం, ప్రతిభా వంతమయిన దర్శకత్వం వున్న యీ పిండయిన కథకు అక్కినేని నటన నిర్మాతకి లాభకారులు కాగలవు.

తాపినేని చలపతిరావు సమకూర్చిన అన్ని బాణీలు బాగున్నాయి. ప్రత్యగాత్మ టేకింగ్ చక్కగా ఉంది. ముళ్లపూడి కలం పిండించిన 'శ్రీమంతుడు' కథ అన్నిరకాల ప్రేక్షకులను మెప్పించేది అని చెప్పడం ఉచితం. పాత్రలకు తగ్గ నటీనటులు ఆయాపాత్రల్లో జీవించినట్లు నటించారు.

'దురాశ దుఃఖము చేటు' 'చెరపకురా చెడేవు' అనే సామెతలను బుజువు చేస్తుంది కథ. డబ్బుకోసం కక్కుర్తిపడే ఒకస్త్రీ, అన్నెం పున్నెం యెరుగని ఒక అమాయక యువకుని జీవితంతో చెలగాటమాడి, ఆ యువకుని ప్రాణానికి ఎసరు పెట్టడానికి పూనుకుని, చివరకు డబ్బుపిచ్చి పట్టి, కారాగార వాసానికి ప్రయాణమవుతుంది. ఆయింటి బిడ్డ (రాజా) అక్కినేనికి చెడు అలవాట్లను చేయించి, లౌకిక ప్రపంచ సారాన్ని తెలియనీకుండా పెంచుతుంది, ధనవ్యామోహం వున్న సూర్యకాంతం. రాజాకు రథ (జమున) కళ్లు తెరిపించి, అతని మనస్సులో మమతాను బంధాలను జొప్పించి, ఒతగాడ్ని ఒక మనిషిని చేస్తుంది సాంఘిక చిత్రాలెన్నో వచ్చాయి; వస్తున్నాయి. కానీ 'శ్రీమంతుడు' చిత్రం సరికొత్త పంథాలో నడుస్తుంది. భారీ ఎత్తున నిర్మింపబడుతున్న ఈ చిత్రానికి ముళ్లపూడి కథకుడు రామకృష్ణారావు ఛాయాగ్రాహకుడు. కె. ప్రత్యగాత్మ దర్శకత్వంలో నవరస భరితంగా రూపొందించబడుతున్న 'శ్రీమంతుడు' చిత్రానికి చలపతిరావు సంగీతాన్ని, జి. వి. సుబ్బారావు కళాన్ని, అక్కినేని వెంకటరత్నం ప్రొడక్షన్ వ్యవహారాన్ని, సుబ్బారావు సహాయ దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు. జి. రాధాకృష్ణమూర్తి నిర్మించే ఈ చిత్రానికి సహాయంగా పంపిణీదారులు.

## కథని నడిపించే రెండు జంటలు

ఉషశ్రీవారి 'విచిత్ర దాంపత్యం' రష్‌ష్ చూసాను. విజయనిర్మలను సుఃదేవ్ చాలా అందంగా ఫొటోగ్రాఫ్ చేసారు. విచిత్రమయిన కథాపాత్రల్లో గుమ్మడి, సావిత్రి ఒక జంటగా; శోభన్ విజయనిర్మల ఒక జంటగా కథను నడిపిస్తారు విజయలలిత, ప్రభాకరరెడ్డి పాత్రలు కథ సాఫీగా సాగడానికి పనికివచ్చాయి. రాజబాబుపాత్ర కథకు ఆయువుపట్టు. కథ దిట్టమయినది; మాటలు బాగా వచ్చాయి. అశ్వద్ధామ సంగీతంలో కొత్త అందం కనిపిస్తోంది. పి. చిన్నపరెడ్డి నిర్మిస్తున్న ఈ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

## వెరైటీపాట-కొత్త గాయని

వాహినీ 'ఏ' థియేటర్లోకి ప్రవేశించాను. నాకు పరిచయంలేని ఒక 'వాయిస్' కమ్మగా






ఏదో ఆలోచనలో వాని (శ్రీ...స్. ... వారి 'సిందూర దంపతులు' చిత్రంలో)



"ప్రేమనగర్"లో వాణిశ్రీ

వినిపించింది. ట్యూనులోకూడా వెరైటీ కని పించింది. రాకెట్ స్పీడుతో సంగీతం సాగి పోయింది. ఈ వెరైటీ పాటకు స్వరకర్త చలపతిరావు; ఆ పాటను పాడిన గాయని రమోలా;కవి నారాయణరెడ్డి. ఆపాటయొక్క పల్లవిని తెలియచేస్తాను.

'ఏయ్—ఏయ్...వో మాట
నాపేరు రీటా
రాము...సోము. జానీ...నానీ నాన్సీ—'

## సినిమా

ఈపాట నందమూరి సాంబశివరావు నిర్మిస్తున్న చిత్రంలో వినిపిస్తుంది. చిత్రకళా ఫిలిమ్స్ నిర్మిస్తున్న కలర్ 'క్రయిమ్' షూటింగు ఏప్రిల్ 1 నుండి 4 వరకు ఊటీలో జరగగలదని పాఠకులకు తెలిపాను. కానీ యిప్పుడు 'ఇన్ డోర్'ను చేసి అవుట్‌డోర్ ప్రోగ్రామును జూన్‌లో పెట్టుకున్నట్లు నిర్మాత సాంబశివ రావు తెలియజేశారు. — అంతేగాక తారాగణంలోకూడా కొంతమార్పు చేర్పడింది. హీరోపాత్రను శోభన్‌బాబు, హీరోయిన్ భూమికను చంద్రకళ ధరిస్తున్నారు. సత్య నారాయణ, రావికొండలరావు, రాజబాబు, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు అండ్ జ్యోతి లక్ష్మి ప్రధాన పాత్రధారులు. ఆర్. కె. ధర్మరాజు కథకు మహారథి మాటలను సమ కూర్చారు. నందమూరి రమేష్ దర్శకత్వాన్ని చలపతిరావు సంగీతాన్ని, వెంకటరత్నం ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నారు. జయ లక్ష్మి విడుదల.

*　　*　　*

వాహినీలో పాటను విని, యెదురుగావున్న గార్డెన్స్‌కు వెళ్ళాను. ఆ సమయంలో అక్కడ ఏదో షూటింగు జరుగుతూ వుండింది. MSW 7189 కనిపించింది. శోభన్ వున్నారని పసిగట్టాను.

## కలలో కనిపించిన చంద్రకళ

చంద్రకళ పచ్చరంగు లంగా ఆరెంజి రంగు వోణి ధరించి చిలిపిచూపులు విసు రుతూ శోభన్‌ముందు నిలబడింది. శోభన్ ఏం చేసాడో మీకు చెప్పాలిగా. చంద్రకళను సూటిగా చూసాడు. 'నిన్ను ఎక్కడో చూసినట్లువుందే' అని ఆమెను పదేపదే చూసాడు. ఆమెను చూడగా చూడగా, అతని హృదయం ఏదో చెప్పినట్లు ఒక్క సారిగా త్రుళ్లిపడ్డాడు. (ఆచార్య ఆత్రేయ వ్రాసిన) నిన్నరాత్రి నిన్నుచూస్తి కలలో నే పిల్లా (ఘంటసాల పాడిన) అది నిజమైంది మూసుకోవే తెల్లారేకల్లా' అంటూ చంద్ర కళను తన హృదయానికి హత్తుకున్నాడు. కట్ అన్నారు దర్శకుడు మాధవరావు. ఈ వలపు సన్నివేశం భానూమూవీస్‌వారి మాతృ ప్రేమలో కనిపిస్తుంది; ఎం. కె. రాజా ఛాయాగ్రాహకుడు.

## శ్రీ వేంకటేశ్వర వైభవము

కలియుగ వైకుంఠమైన తిరుమల క్షేత్రం పరమపవిత్రమైన స్వామివారి నిలయం.

ఏడుకొండలవాడా! వేంకటరమణా
గోవిందా...గోవింద; అడుగడుగు
దండాలవాడా గోవిందా ; ఆపదమొక్కుల
వాడా గోవింద; వడ్డీకాసులవాడ గోవింద.
అనాథ రక్షకా గోవింద—



"మోసగాళ్లకు మోసగాడు"లో జ్యోతిలక్ష్మికి దొరికిపోయిన విజయనిర్మల

అనేది గోవిందనామ సంకీర్తనంతో, మాడు పందల అరవై అయిదురోజులూ ఏడు కొండలూ మారు మ్రోగుతుంటాయి. విరామం లేకుండా కొండలెక్కే భక్తుల పాదాలతాకిడికి బండరాళ్ళు సైతం అరిగిపోయాయి. ముఖ్యంగా బ్రహ్మోత్సవసమయంలో జరిగే రథోత్సవ దృశ్యం చూడటానికి దేశం నలుమూలలనుండి లక్షలాదిభక్తులు తిరుమలకు చేరుకుంటారు.

## స్వామి చిత్రానికి కొత్త దర్శకుడు

'సప్తశైలావాసా; కరుణా సాగర శ్రీ
శ్రీనివాసా!
నవరత్నములు పొదిగినరథమున, నీవూరేగిన
నగరవీధులను; నయనమ్ముల ఆనంద
చంద్రికలు
నాట్యమాడెనో జగదీశా'—

అని గానంచేస్తూ, భువనఘోష పుట్టిస్తూంటే. ఆ జగన్నాథుని రథం ముందు సాగిలబడి మొక్కువారు, వేలకొలది ప్రణామాలు చేసేవారు, భక్తిభావంలో కరిగిపోయి పరిశుద్ధ ఆత్మలై, ఆనందబాష్పాలు రాల్చేవారు బంగారురథంతోపాటు మెల్లిగా ముందుకు సాగిపోతూంటే కన్నులపండువ గావించే ఆ రథోత్సవం దృశ్యం చూసి పరవశించనివారుండరు అన్నది నిర్వివాదం. తిరుమల తిరుపతి దేవస్థానంవారు నిర్మిస్తున్న 'శ్రీ వేంకటేశ్వర వైభవము' చిత్రంలో ప్రేక్షకులు సందర్శించనున్న అనేక పుణ్యవ దృశ్యాలలో స్వామివారి యీ రథోత్సవదృశ్యం అపూర్వమైనది. భక్తుల పాలిట కల్పతరువు యీ చిత్రం అనడం సమచితం. ఈభక్తిరస ప్రధానమైన చిత్రాన్ని యువదర్శకుడు సి. ఎస్. ప్రసాద్ అద్భుతంగా డైరెక్టుచేసాడు.

## హాస్య కంత్రీటాక్టరుగా రాజబాబు

ఆంధ్రప్రేక్షకుల ప్రత్యేక అభిమానాన్ని చూరగొన్న హాస్యనటుడు ఎవరు అని అడిగితే, 'రాజబాబు' అంటారు మీరు. కారణం యిటీవల రాజబాబు విభిన్నపాత్రలను విశిష్టంగా పోషించడంవల్లనే. ఇంతవరకు తెరపై చూడని ఒక కొత్తతరహా భూమికను రాజబాబు నిర్వహిస్తున్నారు. ఏ

# డేరింగ్ డామ్సెల్ నటి విజయగౌరి



తారాపథంలో ప్రథమశ్రేణి తారకావాలనుకునే. వాళ్ళలో యీమె ఒకతె. ఈమె అసలు పేరు ఆదిలక్ష్మి సినిమాపేరు విజయగౌరి. ఈమెను గతవారం శారదా స్టుడియోలో కలిసాను నేను వేసిన ప్రశ్నలకు ఆమె యిచ్చిన సమాధానాలను మీకు తెల్పుతున్నాము.

ప్ర: మీరు మద్రాసుకు ఎప్పుడు వచ్చారు ?

జ: 1962 లో (అక్టోబరు.)

ప్ర: ఏం పని మీద వచ్చారు ?

జ: సినిమాల్లో వేషాలు వేద్దామని వచ్చాను.

ప్ర: రాగానే ఛాన్సులు లభించాయా ?

జ: లేదండీ. అందుకే శ్రీ వేణుగోపాల్‌వద్ద డాన్సు నేర్చుకున్నాను.

ప్ర: ఏఏ నృత్యాలు తెలుసు ?

జ: కథక్, భరతనాట్యం, ట్విస్టు డాన్సుల్లో మంచి ప్రాక్టీసు వుంది.

ప్ర: డ్రామా అనుభవం వుందా?

జ: అక్కడక్కడ అడపాదడపా నాటకాల్లో వేషాలు వేసేదాన్ని.

ప్ర: మీకు సినిమాల్లో వేషం ఎప్పుడు దొరికింది ?

జ: 'అనుబంధాలు' చిత్రంలో ఒక చిన్నపాత్ర (మగవేషం) దొరికింది.

ప్ర: ఆతర్వాత ఎన్ని చిత్రాల్లో నటించారు ?

జ: అయిదారుంటాయండీ.

ప్ర: ప్రస్తుతం ఎన్ని చిత్రాల్లో నటిస్తున్నారు ?

జ: రెండు చిత్రాల్లో.

ప్ర: అర్ధనగ్న దృశ్యాల్లో నటించగలరా ?

జ: నో. నాకు విశాంటి అభ్యంతరం లేదు.

ప్ర: తెరపై ముద్దు ప్రవేశపెడితే, ఆ దృశ్యంలో మీరు నటించడానికి అంగీకరిస్తారా ?

జ: 'ముద్దు' పెట్టడం తప్పు కాదనుకుంటా. ముద్దు పెడతావంటే 'వద్దు' అనను.

ప్ర: మీరు నాయిక పాత్రలకు పనికివస్తారనే నమ్మకం మీకుందా ?

జ: నాయిక పాత్రలే కావాలని కోరడం లేదు. ఏ పాత్ర యిచ్చినా ఆపాత్రకు న్యాయం చెయ్యడానికి ప్రయత్నిస్తాను.

ప్ర: శాశ్వతస్త్రీకి శీలం గొప్పది కదా ? మరి మీరు 'ముద్దు'...?

జ: స్త్రీని పరాయి మగవాడు తాకకుండా వున్నపుడు. 'ముద్దు' నిషేధం ఎలా అవుతుంది చెప్పండి.

ప్ర: మీకు యీ పరిశ్రమలో పైకి రాగలరనే నమ్మకం వుందా?

జ: ఏమో. ఎవరు ఎప్పుడు ఎంతకు పైకి వస్తారో ఆ భగవంతుడికే తెలుసు.

ఇంటర్వ్యూ: శ్రీనివాస్.



"రాజకోట రహస్యం"లో మీనాకుమారి, దేవిక

చిత్రంలోనో తెలుసా ? రవి చిత్రవారి 'రివాల్వరు రాణి' చిత్రంలో.

* * *

రాజబాబు కుస్తీ కంట్రాక్టరుగా నటిస్తున్నాడు. ఆరుగురు ఛాంపియన్ పహిల్వానులను చేరదీస్తాడు. వాళ్లద్వారా డబ్బు సంపాయించాలని ప్లాన్ వేసాడు. కానీ ముందు డబ్బు యిస్తేగాని గోదాలోకి దిగమంటారు వస్తాదులు వాళ్లను పూట

## సినిమా

పూట మేపడానికే రాజబాబు దగ్గిర పైసాలు లేవు కంట్రాక్టు సొమ్ము ఎక్కడ నుంచి తెచ్చిస్తాడు తనగోడు వాళ్లకు నచ్చచెప్పి ఎలాగో అలా ప్రదర్శన ఏర్పాటు చేద్దామని వస్తాదుల విడిది కెళతాడు. వాళ్ల బొమ్మను విసిరేసినట్టు రోడ్డుమీదకు విసిరేస్తారు. రాజబాబు తర్వాత ఏంచేస్తాడు?

ఆరు ఏనుగులముందు అతనొక చిట్టెలుక. ఇలాంటి రసవత్తరమైన సంఘటనలతో మిమ్మల్ని నవ్వించి, కవ్వించి, మురిపిస్తాడు రాజబాబు 'రివాల్వరు రాణి'లో. ఈ చిత్రం అతిత్వరలో పూర్ణాద్వారా విడుదలవుతుంది. వై. వి. రావ్ నిర్మిస్తున్న ఈ చిత్రంలో విజయలలిత రివాల్వర్‌రాణి. కె. వి. ఎస్. కుటుంబరావు దర్శకత్వాన్ని, సత్యం సంగీతాన్ని, దేవరాజు ఛాయను నిర్వహించే ఈ క్రయిమ్ థ్రిల్లర్‌లోని ప్రధాన పాత్రలను సత్యనారాయణ, చంద్రమోహన్, రామదాసు,



'పట్టిందల్లా బంగారం', మరో నది చిత్రాలలో నటిస్తున్న బేబి మున్ని

[illegible] గోపాలరావు, జగ్గారావు, ఆజాద్ పహిల్వాన్, మాధవన్ పోషిస్తున్నారు.

### మా ఇలవేల్పు

తమిళంలో 'నమ్మవీట్టుదైవం' చిత్రం సంచలనాన్ని కలిగించింది. ఇప్పుడు తెలుగులో 'మా ఇలవేల్పు' రూపంలో రాబోతూంది. కామాక్షీ ఏజెన్సీస్ నిర్మిస్తున్న ఈ చిత్రానికి జి. వి. ఆర్. శేషగిరిరావు దర్శకుడు. పన్నెండురీళ్లు పూర్తయింది. కైలాసకోన వద్ద మూడురోజులపాటు షూటింగు జరిగింది. 'దుర్గ దేవాలయం', మునిసిఫ్ మాణిక్యాలరావు గృహంసెట్టులు

## సినిమా డైరీ

● రవీంద్రా ఆర్ట్సు పిక్చర్స్ సినీంద్ర చిట్టిబాబు షూటింగు మార్చి 22 నుండి 27 వరకు ప్రసాద్‌లో జరిగింది శోభన్ శారద, ప్రభాకర్ పాల్గొన్న దృశ్యాలను సంజీవి చిత్రీకరించారు.

● మార్చి 22న చిత్రకళాఫిలిమ్స్ వారి రెండు పాటలను చలపతిరావు వాహినీ ఎ థియేటర్లో రికార్డు చేసారు సి నా రె పాటను రమోలా పాడింది రమేష్ దర్శకుడు

● సురేష్‌మూవీస్ ప్రేమనగర్ కలర్ చిత్రం షూటింగు వాహినీ 8,9 ఫ్లోర్లలో మార్చి 20 నుండి 31 వరకు కె ఎస్ ప్రకాశరావు సారథ్యంలో జరిగింది నాగేశ్వరరావు, వాణిశ్రీ, శాంతకుమారి, పుష్పకుమారి పాల్గొన్నారు

● శ్రీకృష్ణసత్య కలర్ చిత్రం షూటింగు మార్చి 17 నుండి 23 వరకు వాహినీలో జరిగింది. కె.వి.రెడ్డి దర్శకత్వంలో ఎన్ టి. రామారావు, ఎస్వీరంగారావు, కాంతారావు నటించారు.

● పూర్ణాఆర్ట్సు పిక్చర్స్ కూతురు—కోడలు షూటింగు ప్రసాద్‌లో మార్చి 19 నుండి 22 వరకు జరిగింది, లక్ష్మీదీపక్ దర్శకత్వంలో విజయలలిత, జమున, సంధ్యారాణి, అల్లురామలింగయ్య కె. వి. ఎలవ, పాల్గొని నటించారు

● నందినీ ఫిలింస్ అత్తలూ కోడళ్ళు మార్చి 23న ప్రారంభం అయింది. పి చంద్రశేఖర రెడ్డి దర్శకుడు

జను విందొనర్చే విధంగా పి. రామ్ చౌదరి నిర్మించారు.

'నమ్మినబంటు దైవంగా' తమిళ ప్రజల హృదయాల్లో స్థానాన్ని శాశ్వత పరచుకున్న కె. ఆర్. విజయ 'మా ఇలవేల్పు'గా ఆంధ్ర ప్రేక్షకుల ఎదలో నిలిచిపోయే విధంగా ఆ పాత్రను పోషించింది. చిత్రకథ స్క్రీన్‌ప్లే జి. వేలుమణి వ్రాయగా, రాజశ్రీ మాటలను సమకూర్చారు. జి. కె. వెంకటేష్ సంగీతాన్ని, శ్రీ హరిరావు కూర్పును భాస్కరరావు ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్న ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను రామకృష్ణ, నాగభూషణం, పద్మనాభం, మిక్కిలినేని, జి. వి. రామచంద్రరావు, కె. వి. చలం, పొట్టి ప్రసాద్, భూసారపు, మనోహర్, అమరేశ్వరరావు, గీతాంజలి, ఛాయాదేవి, పద్మాంజలి, విజయశ్రీ పోషిస్తున్నారు.

## సిసింద్రీ చిట్టిబాబు

'బాలరాజుకథ' ఫేం మాష్టర్ ప్రభాకర్‌ను 'సిసింద్రీ చిట్టిబాబు'గా పరిచయం చేస్తున్నారు రవీంద్రా ఆర్ట్స్ పిక్చర్స్ అధినేత తమ్మారెడ్డి కృష్ణమూర్తి. నెల్లూరు దగ్గరవున్న మైపాడు, ఇందుకూరుపేట గ్రామాల్లో కొంత అవుట్‌డోర్ షూటింగు జరిగింది. రెండుపాటలను (ఒకటి పచ్చని పంట పొలాల్లోను, మరొకటి పడవపైన) దర్శకుడు అక్కినేని సంజీవి చిత్రీకరించారు. ఇది ఒక కొత్తతరహా కుటుంబ చిత్రం. నాయకీ నాయకులుగా శారద శోభన్ నటిస్తున్నారు. ముఖ్యపాత్రల్లో గుమ్మడి, సూర్యకాంతం, అల్లు రామలింగయ్య, జ్యోతిలక్ష్మి కనిపిస్తారు. ఈ చిత్రానికి కథ మాటలను పినిసెట్టి, ఛాయను వెంకటరత్నం, సంగీతాన్ని చలపతిరావు, శిల్పాన్ని జి. వి. సుబ్బారావు నిర్వహిస్తున్నారు. టి. ఎల్. బాబు నిర్మాత; 'ధర్మదాత' ఫేం సంజీవి దర్శ



ఎస్. వి. ఎస్. ఫిలిమ్స్‌వారి 'నిండుదంపతులు' చిత్రంలో [illegible]

## చెల్లెలి కాపురం

నటుడు బాలయ్య సమర్పిస్తున్న చిత్రం సంస్థపేరు అమృతాఫిలింస్; దర్శకుడు కె. విశ్వనాథ్. కథ బాలయ్యదే; స్క్రీన్‌ప్లేను విశ్వనాథ్ రూపొందించారు. బి. కృష్ణస్వామి, ఎ. సూర్యనారాయణలు నిర్మిస్తున్న ఈచిత్రం 13 రీళ్లు తయారైంది. ప్రజాహృదయాన్ని ఆకర్షించే యితివృత్తంగల ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను శోభన్, వాణిశ్రీ, నాగభూషణం, మణిమాల, సంధ్యారాణి, ఛాయాదేవి, మీనాకుమారి, నిర్మల, అల్లు రామలింగయ్య, కె. వి. చలం, పొట్టిప్రసాద్, రావు గోపాలరావు, మోదుకూరి సత్యం పోషిస్తున్నారు. సత్యనారాయణ, చంద్రమోహన్ అతిథి నటులు. శ్రీ ఫిలిమ్స్ విడుదలచేసే ఈ చిత్రానికి ఎస్. ఎస్. లాల్ ఛాయను; మహాదేవన్ సంగీతాన్ని, కుదరవల్లి నాగేశ్వరరావు శిల్పాన్ని నిర్వహిస్తున్నారు.

## మోడరన్ థియేటర్స్ 110 వ చిత్రం

ఇప్పటికి 109 చిత్రాలను నిర్మించింది ఒక సంస్థ; ఆ సంస్థ వుండేది సేలంలో. అక్కడ స్వంతస్టుడియో వుంది; పేరు మాడరన్ థియేటర్స్. తమ 110 వ కానుకగా తెలుగుచిత్రం నిర్మిస్తున్నారు ఈ సంస్థాధీశులు. ఇన్‌డోర్ షూటింగు సేలంలో చాలావరకు అయింది. మార్చి మూడవ వారంలో ఆంధ్రాలో కొంత అవుట్‌డోర్ కూడా జరిగింది. ఈ చిత్రానికి శేషగిరిరావు

దర్శకుడు. ఈ కథ హిందిలో 'దోభాయ్' పేరుతో విడుదలైవుంది. కాబట్టి కథాంశం మీకు తెలిసేవుంటుంది. పటుత్వమైన కుటుంబగాథకు చక్కని సెంటిమెంటు+ మరింత సస్పెన్సును మేళవించి, అడుగడుగునా ఆశ్చర్యపరచేలా నవ్యంగా నిర్మిస్తున్నారు నిర్మాత సుందరం.

క్యారెక్టరు నటుడు గుమ్మడి ముఖ్య పాత్రధారి ఆయన తమ్ముడుగా కృష్ణ, క్రిష్ణ ప్రేయసిగా కాంచన నటిస్తున్నారు. సహాయ భూమికలను సత్యనారాయణ, కె వి. చలం, జయకృష్ణ, ప్రసాద్, జి. రామచంద్రరావు, శకుంతల, సురేఖ, అర్జా జనార్దనరావు, బేబీ శ్రీదేవి ధరిస్తున్నారు. సంభాషణలను రాజశ్రీ, సంగీతాన్ని వేదా, ఛాయను మణి నిర్వహించే ఈ 'సోషియో క్రయిమ్' కు జి. వి. ఆర్. శేషగిరిరావు దర్శకుడు.

## రాజస్థాన్, సిమ్లాలలో వర్ణచిత్రం షూటింగ్

హీరో కృష్ణ సమర్పిస్తున్న శ్రీ పద్మాలయా మూవీస్ వారి 'మోసగాళ్లకు మోసగాడు' వర్ణచిత్రం — కిందటి నెల అంతా భయంకరమైన రాజస్థాన్ థార్ ఎడారిలోను, ప్రకృతి రమణీయకతకు పేరొందిన సిమ్లాలోను అవుట్‌డోర్ షూటింగ్ జరుపుకున్నది.

ఎడారిలో షూటింగ్ అంటే మాటలు కాదు. ఆ ఎడారికి 150 మైళ్లకు అటూ, ఇటూ ఏ గ్రామమూ కనిపించదు. మంచి నీళ్లు దొరకవు. మనుషులు సంచరించని చోట, మంచినీళ్లు దొరకని చోట—ఏ సౌకర్యమూ లేని అలాంటి స్థలానికి వెళ్లి షూటింగ్‌చేసి నెగ్గుకు రావటం సాహసమే అని చెప్పాలి.

కృష్ణను టీజ్‌చేస్తూ, నాగభూషణం, జ్యోతిలక్ష్మిలమీద ఒక పాట, కొన్ని ముఖ్య దృశ్యాలను — థార్ ఎడారిలోనూ, బికనీర్ కోటలోను, శివబాడి దేవాలయం దేవీకుంట్ సాగర్‌వద్ద చిత్రీకరించారు. ఎడారిలో ప్రాణాలకు తెగించి ఛేజ్ సీన్లు తీశారు. అద్భుతమైన గుర్రాలు, ఒంటెలు, ఒంటె బళ్లు ఈ షూటింగ్‌లో పాల్గొన్నాయి.

రాజస్థాన్‌లో షూటింగ్ ముగించుకున్న తర్వాత ఈ యూనిట్ సిమ్లాకు తరలి వెళ్లింది. అక్కడికీ, యిక్కడికీ ప్రకృతిలో, పరిసరాల్లో ఎంతో తేడా కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. మండే ఎండతో మంచినీళ్లు దొరకనిస్థలం అదయితే—ఎటు చూసినా మంచుతో కప్పబడిన పర్వత శ్రేణులతో నేలకు కొన్నివేల అడుగుల ఎత్తున మంచు నిండిన స్థలం యిది.

సిమ్లాకు 10 మైళ్లలో ఉన్న కుఫ్రీలోను, టిబెట్‌కు సమీపానగల నార్కండా 'స్నోఫాల్'లోను కృష్ణ, విజయనిర్మలల మీద ఒక యుగళగీతం; నలదీరా గోల్ఫ్‌క్లబ్‌లో జ్యోతిలక్ష్మి కృష్ణను అల్లరిచేస్తూ పాడే పాటా చిత్రీకరించారు.

చైనా—పాకిస్తాన్ సరిహద్దుల మధ్య, విశేష వ్యయప్రయాసలకోర్చి ప్రేక్షకులకు కొత్తదనం తోపింపచేసేలా, ఒక మధురానుభూతి కలిగించేలా నిర్మాత శ్రీ జి. ఆదిశేషగిరిరావు భారీఎత్తున, ఆంగ్లచిత్రాల స్టాయిలో ఈ మోసగాళ్లకు మోసగాడు చిత్రాన్ని పూర్తిగా రంగుల్లో ఎన్నో హంగులతో నిర్మిస్తున్నారు.

కృష్ణ, విజయనిర్మల, జ్యోతిలక్ష్మి నాగభూషణం, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, రామదాసు, సాక్షి రంగారావు, ధూళిపాళ, కె. జగ్గారావు, త్యాగరాజు, కాకరాలు, రావు గోపాలరావు, గోకిన రామారావు ముఖ్య పాత్ర ధారులు. గుమ్మడి, అంజలీదేవి, యస్. వరలక్ష్మి గెస్ట్ ఆర్టిస్టులు గా పాల్గొన్న ఈచిత్రం ఆంధ్రప్రదేశ్ అంతటా శ్రీ ఫిలింస్ ద్వారా అతి త్వరలో విడుదల అవుతుంది.

రచన: ఆరుద్ర: సంగీతం: ఆదినారాయణరావు: నృత్యాలు: హీరాలాల్, కళ



"మాస్టర్ కిలాడీ"లో విజయనిర్మల, క్రిష్ణ



వడ్డించేది ఎవరు ? చలం, జమున "మట్టిలో మాణిక్యం"లో

తోట, దుస్తులు: బాబూరావు, వెంకట్రావు, ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్: యస్. పి. వెంకన్నబాబు, ప్రొడక్షన్ మేనేజరు: వాసు, స్టిల్స్: ఓ. రాధాకృష్ణమూర్తి, కెమెరా: వి. యస్. ఆర్. స్వామి, కూర్పు: గోపాల్ దర్శకత్వం: కె. యస్. ఆర్. దాస్, నిర్మాత, జి. ఆదిశేషగిరిరావు.

—శ్రీనివాస్

## అవీ...ఇవీ!

### రాంచీలో 'ప్రగతి'

రాంచీ హిందూస్థాన్ స్టీల్ సంస్థవారి హెడ్డాఫీసు మరియు సెంట్రల్ ఇంజనీరింగ్ అండ్ డిజైన్ బ్యూరోలలో పనిచేస్తున్న ఆంధ్రులందరూ కలసి ఏర్పాటు చేసిన తెలుగు సంఘానికి 'ప్రగతి' అని నామకరణం చేయబడింది. ఫిబ్రవరి 26వ తేదీన జరిగిన ఈ సంఘం సర్వసభ్య సమావేశంలో సమితి పేరు నిర్ణయించటం, వివిధములని ఎన్నిక చేయటం జరిగాయి. (ఒ. వి.)



"అమ్మాయిగారు"లో నాగేశ్వరరావు కోపానికి గొండన భయపడుతున్నట్లుందా ?

## ఖరగ్‌పూర్‌లో ప్రవాసాంధ్ర నాటక కళాపరిషత్

ప్రవాసాంధ్ర నాటక కళాపరిషత్ పదునాల్గవ వార్షికోత్సవాలు ఫిబ్రవరి 19వ తేదీ సాయంత్రం 8 గంటలకు స్థానిక రవీంద్ర ఇన్‌స్టిట్యూట్‌లో ప్రారంభించబడ్డాయి పరిషత్ అధ్యక్షులు శ్రీ యు. ఎస్. రాజుగారు ప్రారంభోత్సవం జరిపారు.

ఈ వార్షికోత్సవాలు 19, 20, 21, తేదీల్లో జరిగినాయ్, మూడు నాటకాలు, పదకొండు నాటికల్లు ప్రదర్శించబడ్డాయి. స్థానిక నాటక సమాజాలే గాకుండా భిలాయ్, బిలాస్‌పూర్, కలకత్తాకు చెందిన నాటక సమాజాలు కూడా యీపోటీలో పాల్గొన్నాయి. 21వ తేదీ ఉదయం నటీనటుల సమ్మేళనం ఏర్పాటు చేశారు. కార్యనిర్వాహకులు, పలుసమాజాల సభ్యులు ఈ సమావేశంలో పాల్గొని తమ తమ అభిప్రాయాల్ని, నాటకాలు ప్రదర్శించడంలో తాము ఎదుర్కొంటున్న యిబ్బందులను వెల్లడి చేశారు. ఎన్నో సమస్యలను పరిష్కారం చర్చించుకోవడం జరిగింది.

ఈ నాటక, నాటిక పోటీలకు సర్వశ్రీ ఆర్. వి. చలం, జయంతి కామేశ్వరరావు గారలు న్యాయనిర్ణేతలు. (ఓ. వి.)

### 'పల్లవి'కి తండ్రిఅయిన గాయకుడు

ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యానికి యిటీవల కూతురు పుట్టింది. ఆ సమయంలో విజయా గార్డెన్స్‌లో ఒక పాటయొక్క పల్లవిని పాడుతూవుండిన ఎస్. పి. బి. ని కూతురికి పేరు ఏం పెడతారు? అని ప్రశ్నించాను. 'పల్లవి' అన్నాడు. చెప్పినట్టే నామకరణం చేసాడు.

—టి. ఆర్. ఎస్.

## బొబ్బిలి సాహిత్య సమితి

బొబ్బిలి సాహిత్య సమితి అయిదవ వార్షికోత్సవం యిటీవల బొబ్బిలి కళాశాల ఆవరణలో ప్రిన్సిపాలు శ్రీ బి. సుబ్బారెడ్డిగారి అధ్యక్షతన జరిగింది. రచయిత్రి కుమారి వాశిరెడ్డి సీతాదేవి, ముఖ్య అతిథిగా విచ్చేశారు. —ఒ. వి.

# పుస్తకాలు

1. ఝంఝ

గేయ సంకలనం, 60 పేజీలు, వెల ఒక రూపాయి.

2. దిక్సూచి

రచయిత: చెరబండ రాజు, 96 పేజీలు. వెల: రూ 2.50

ప్రతులకు: నిఖిలేశ్వర్, 46 విద్యానగర్ కాలనీ, హైదరాబాదు—13.

## 1. ఝంఝ

దాదాపు ముప్పై మంది విప్లవ రచయితలు వ్రాసిన గేయాలిందులో వున్నయ్. మహాకవి శ్రీశ్రీ, శ్రీ కె. వి. రమణారెడ్డి గాక మిగతా వారందరూ దాదాపు క్రొత్తవారే. కుటుంబరావుగారు వంటి వారలు యీ సాహితీ క్షేత్రాన్ని సాగుబడి చేసి మేలి పంటలు పండించారని, కొత్త గుండెల చప్పుళ్ళు వింటారా అంటూ శ్రీ రమణారెడ్డి చెప్పారు. ఇప్పటి విప్లవ రచయితలు యెలాంటి పంటలు పండిస్తున్నారో యిందులో చూడొచ్చు. ఝంఝలో చాలామంది అరుణకిరణుడి చుట్టూ పరిభ్రమించారు. సాంఘిక ప్రయోజనా సాహిత్యానికి యిలా టిది తప్పనిసరా? అన్న విషయం తెల్సుకోవాల్సింది. ఏ పార్టీ తోకుచ్చుకుని పోని రచయితలం అని చెప్పుకొనే వారి రచనల్లో యీ పోలిక గమనించ తగ్గది. పార్టీలకూ, యిజాలకూ దూరంగా, నిజానికీ నిజాయతీకి దగ్గరగా వచ్చిననాడు విప్లవ రచయితలు సమాజానికి నిజమైన మేలు చెయ్య గలుగుతారు. రెండో విషయంలో దగ్గరగా వచ్చారుగానీ మొదటి విషయంలో దూరంగా వుండగలిగారా అన్నది అనుమానం. ఇది జరగనంత కాలం రచనలు నిష్పక్షపాతంగానూ, ఆవేశరహితంగానూ వుండలేవు.

కసి, వర్గ పోరాటాన్ని ఆసరాగా తీసుకుని యెవరిన్నో మసి చేద్దామన్న ఆవేశం నీటిలో బాగా కనుపిస్తయ్. జనాన్ని వుత్తేజపరుస్తానికీ సామాగ్రి అవసరమేమో! కానీ రాజకీయ నాయకుడికీ, రచయితకీ భేదం వుండాలి కదా. సాంఘిక ప్రయోజనాన్ని సాధించటానికి రచయితలో ఆవేశం కంటే ఆవేదన ముఖ్యం. మూడు కోతులుగా, బోడి నవ్వులూ జాతిని నిర్వీర్యం చేసేస్తే (పేజి 35) అంటూ బాధపడే వారు దీనికంత ప్రాముఖ్యం యివ్వక పోవటం సహజమే. కానీ శ్రీ శ్రీ ని చదవండి—

ఘోషించేను మంచిగా వుండండ్రా అంటూ,
గింజపెట్టాను అవగాహకులజోలికి పోకండ్రా
అంటూ, ......... విన్నారు కారు (ఝంఝ పేజీ 51)

దీంట్లో ఆవేదన వుంది, యెంతో అర్థం వుంది. అర్థంకాని ఆవేశం లేదు. ఆదేవిధంగా శ్రీ శ్రీ వ్రాసిన విన్నటి జబ్బ్యానాలా కూడాను.

క్రమం తప్పటంలో కూడా ఒక క్రమం వుంది అన్నట్లు రమణారెడ్డిగారి గేయం (జననం ఆకాశం యెంత్రబడింది, మొదలైనవి కూడా) ఝంఝలో అసలు సిసలు కవిత్వం లేదని విమర్శించ బోయే వాళ్ళ నోళ్ళు మూస్తుంది.

స్వతంత్ర భారతంలో ప్రయోజనం యేమీ కనిపించటం లేదు వీరికి. అతిశయోక్తయినా నిజం లేకపోలేదు.

తెల్లారితే సంతోషించని వాళ్ళ
రాక్షసులూ, గుడ్లగూబలూ మాత్రమే (అజ్ఞాతవాసి వ్రాసిన నిజం

ఎక్స్—రే వ్రాసిన తెర వెనుక భాగోతం అర్థవంతంగా వుంది. విప్లవ రచయితల్నుంచి మరి కొన్ని మచ్చుతునకలు—

ఈ జాతీయ వంచకుల బద్మాష్ డ్రామాలో
ఫూల్‌గా నటించ లేను (లోచన్)

చెప్పదలుకుంది చాలా నీట్‌గా చెప్పారు.

ఆకలి మంటల్తో అలమటిస్తున్న వాడికి
అహింసను బోధించేవాడు లుచ్చా (సి. విజయలక్ష్మి.

సైన్యంలో చేరకు (జి. సోమయ్య) లో ఒకే ప్రపంచం అన్న ఆశయం గొప్పది. ఇక పోతే చదువరిని కొంచెం శ్రమపెట్టే విషయాలూ వున్నయ్.

ధనమదాంధ రావణుల (?) సంకెళ్ళను బలం కొద్దీ తెంచందే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు వూడి పడుతాయని ...... వూదింది లేదు. (మల్లెల నారాయణ)

వర్గపోరాట దృక్పథంతోగాక, వ్యక్తిగతమైన దుర్గుణాల మీద దృష్టి కేంద్రీకరిస్తే విప్లవ రచయితలు మరింత ప్రయోజనాన్ని సాధించ గలరు. ఉదాహరణకు—

రాజరక్షం తప్పు చెయ్యదనే విశ్వాసాల్ని,
మామూళ్ళూ, మొహమాటాల్నీ,
ధూర్త భూస్వాములను,
చక్రవడ్డీ వ్యాపారులను,
కిరాయి పోలీసులను..... (వరవరరావు)

దీనిలో విశేషణాలు గమనించ తగ్గవి.

విప్లవ రచయితలు మహాకవి శ్రీ శ్రీని అనుసరిస్తూ సమ్యక్ దృష్టితో ప్రయోజనకరమైన రచనలు చేస్తారని ఆశించొచ్చు.

రచనల ద్వారా రచయితలు కూడా వుత్తేజం పొందలేని దుస్థితినుంచి రచయితలే గాక పాఠకులూ, ప్రజలూ వుత్తేజం పొందగల స్థితికి సాహిత్యాన్ని కొనిపోవాలనేది మా సంకల్పం అన్నారు శ్రీ కె. వి. రమణారెడ్డి. ఆశయాలు గొప్పవి. మొదటి ఆశయం నెరవేరింది. రెండో ఆశయం నెరవేరిందా అన్న విషయం కాలమే నిర్ణయించాలి. అందుకు పది మంది వీటిని చదవటం అవసరం.

విప్లవ రచయితల సంఘం ఏ సాహిత్య సంస్థకూ పోటీగా ఏర్పాటు కాలేదని శ్రీ రమణారెడ్డి చెప్పారు. ఈ పుస్తకం చదివిన వారందరూ శ్రీ రమణారెడ్డి మాటలను ఒప్పుకుంటారు.

## 2. దిక్సూచి

పీడితలోకం పిడికిలి బిగించి పిలిచిన పిలుపు నందుకుని కలం పట్టిన దిగంబరకవి చెరబండరాజు.



వొలంపిక్ క్రీడాకారుల సహాయార్థం ఫ్రాంక్‌ఫర్ట్ (ప. జర్మనీ)లో నిర్వహించబడిన ప్రత్యేకమైన సంగీత క్రీడోత్సవానికి జర్మన్ ఛాన్సెలర్ శ్రీ విల్లీ బ్రాంట్ హాజరయ్యారు. చిత్రంలో ప్రపంచ ప్రఖ్యాత జర్మన్‌గాయని రోథెన్ బెర్గర్‌తో ప్రసంగిస్తున్న శ్రీ విల్లీ బ్రాంట్‌ను చూడవచ్చు. ఈ ఉత్సవానికి అమ్మబడిన టిక్కెట్ల వసూలు: 7 లక్షల మార్కులు (రూ. 14 లక్షలు) ఒలంపిక్ క్రీడల్లో పాల్గొనే జర్మన్ క్రీడాకారుల నిధికి సమర్పించ బడుతోంది. (యు. పి. యస్. డాడ్.)

ఈ పుస్తకంలో ఆవేదన ద్వారా వచ్చిన ఆవేశం సమపాళ్లల్లో వున్నయ్. వ్యక్తిగతమైన దుర్గుణాలను చాలాచోట్ల విమర్శించటం జరిగింది.

మరోసారి యీ దేశం మోసపోగూడదంటూ జాతి పిత లాంటి బికారులు మళ్లీ పుట్టగూడదంటున్నారు. ఏసుకూ మోహమ్మదానుకూ వెల కట్టలేని... అంటూ యీ మధ్యే ఒక ప్రఖ్యాత కవి వివరించారు. ఛందోబద్ధ సాహితీ వృక్షం పుచ్చి రాలిపోతుందిట [9 వ పేజీ]. ఛందోబద్ధ సాహిత్యం ద్వారా సాంఘిక ప్రయోజనం సాధించలేమా? కొందరికి అసాధ్యమైనది మరికొందరికి సాధ్యం కావచ్చు గదా! పెద్ద చెట్టు క్రింద చిన్న మొక్క బ్రతుకు లేదని పెద్ద చెట్టును పడగొట్టాలా?

వందేమాతరంలో యెండిన స్తనాల మీదికి ఎగబడ్డ బిడ్డల్ని పోదార్చలేని దేశమాత కనిపించింది. ప్రస్తుత దేశపరిస్థితికి సవ్యమైన, సమగ్రమైన వ్యాఖ్య. రాజధాని లేఖలో సామాన్యుడికి ఎవరు పోయి ఎవరొచ్చినా ఒక్కటే అంటూ ప్రత్యేక తెలంగాణా సమస్యకి గద్దె దిగిన ఎమ్డీ నాయకుడూ, పార్టీ అండతో బండలా కూర్చున్న ముఖ్యమైన మొండి మనిషి కారణం అంటున్నారు.

అర సెంటిమీటరు భూమికి అంతర్జాతీయ తగాదాలు సంకుచిత స్వభావాలకు కొలబద్దలట!





# హస్తకాలం

ప్రపంచపు మనిషి కావాలన్న ఆరాటం. దేశమేమైతే నేం? మట్టంతా ఒక్కటే., అమ్మ ఎవరైతేనేం...

రక్తపింజలో పదహారు జతల ఎడ్లబండి మీద దేవుడిలా వూరేగించిన ప్రజా ప్రతినిధి నల్ల బజారు వ్యాపారిని రక్షిస్తూ, తాజమహలు లాంటి భవనాల్ని కాపాడుకునేందుకు నల్లనల్లా పిల్లల్ని కంటూ, కూలినాలి జనానికి మాత్రం అయిదు పదులు ఆశపెట్టి కుటుంబ నియంత్రణ గురించి గొంతు చించుకుంటాడుట. ఆలోచనల్లో క్రమం వుంది. ఆలోచనల్ని రేకెత్తించి అందరి ఆమోదం పొందేది.

నేటి సమాజంలో చెరబండరాజుకు కనిపించిన కొన్ని భాగాలు—

కొవ్వెక్కిన పిట్ట గూళ్ళ లాలి
బుట్టల దాబాలే, చక్రవర్తుల్లా
వూరేగే జగద్గురు సాములార్లే
ఈ కుష్ఠు వ్యవస్థకు మూల విరాట్టులు.
పట్టెనామాల పొట్టలు
విల్లు గోచి బల్లులు
జందెం పోగుల పందులు.

ఊహలూ, వుద్దేశ్యాలూ వున్నతమైనవే. అక్కడక్కడ వుపయోగించిన వుపమానాలు అంత వున్నతమైనవి అయితే చదువరికి అయామాటల యెబ్బెట్టుగా తోచటానికి ఆస్కారం వుండేది కాదు.

వేలకోట్ల బుద్ధుల్ని క్రీస్తుల్ని
తొలిదన్నే విప్లవ సంతతి కోసం
దిగంబర కవితా వీర్యం [?]
దిక్కుల్నిండా కుమ్మరిస్తాను.

చెరబండరాజు కవితలో అందరూ అర్థం చేసుకోవాల్సిన ఆవేదన వుంది. ఇలాంటి వారు మరికొంత మంది ముందుకు వస్తే దేశం బాగుపడినట్టే.

రసాస్వాదనకోసం పుస్తకం విప్పితే ఎండమావులే నని ముందే హెచ్చరించారు.

—చక్రధారి.

# ఉత్తరాలు

(4 వ పేజీ తరువాయి)

## వ్యాసాలు

26-2-71 పత్రికలో మంత్రి శ్రీ పిడ్డారెడ్డి గారికి సంబంధించిన సంక్షిప్తమైన సంఘటన చదివి నా మనస్సు కుంచించుకు పోయింది. తాము ప్రజలుచే ఎన్నుకోబడ్డ ప్రతినిధులన్న సంగతి ఈ నాటి మంత్రులు ఎందుకు విస్మరిస్తారో అవగతం కావడం లేదు. ఇంతకు మునుపు కాలేదు, ముందు కాదు కూడా. ముఖ్యంగా అవమానించబడ్డ యిద్దరిలో ఎస్. ఇ. [నా. సా. కార్మలు.] గారు స్వాభిమానం కొంచెం ఎక్కువగా కలవారు. కాబట్టి మర్యాదగానైనా సమాధానం ఇచ్చారు.

తరచి చూస్తే గవర్నమెంటు ఉద్యోగాల్లోనూ, ఇతర సంస్థలలో ఉద్యోగాలు చేస్తున్నవారు కలసి దేశాన్ని ముందుకు నడుపుతూంటే ఈ రాజకీయ నేతలే దేశాన్ని అధోగతికి కూలదోస్తున్నారని ఎంతటి సామాన్యుడికైనా బోధపడుతుంది.

ప్రస్తుతం గవర్నరు శ్రీ పిడ్డారెడ్డి మీద ఎటువంటి చర్య తీసుకుంటారో చూడాలని మావంటి వారికి ఆసక్తిగా ఉంది. గవర్నమెంటు ఆఫీసర్లకి మంచి రోజులు వచ్చేదెప్పుడు? మంత్రులు అమానుషంగా ప్రవర్తించడం మానేదెప్పుడు?

ఒకటే మాత్రం నేను రాసివ్వగలను. ఏపార్టీ వచ్చినా దాన్ని సరిదిద్దలేరు. ఎందుకంటే ప్రతివారు పదవికోసం ప్రాకులాడేవారు. దాన్నే అంటారు దేశం కుక్కలకి పోవటం అంటే.

కె. కృష్ణమూర్తి, [ఆనందపూర్]

## రాయల కళాసమితి
## నాటక కళాపరిషత్తు

రాయల కళాసమితి, హిందూపురం, కార్యనిర్వాహక సంఘం యీ సంవత్సరం, మే నెల మొదటి వారంలో ద్వితీయ నాటక కళా పరిషత్తు పోటీలు నాటక నాటిక ఏక పాత్రాభినయములలో రాష్ట్రవ్యాప్తంగా భారీ ఎత్తున జరుపడానికి నిశ్చయించింది. ఆంధ్ర ప్రదేశ్‌లోనూ, ఆంధ్రేతర ప్రాంతాలలోనూ వుంటూ కళాసేవ చేస్తున్న అవుత్సాహిక ఆంధ్ర నాటక సంస్థలన్నీ యీ పోటీలలో పాల్గొనవచ్చును. పోటీల చివరి రోజున బహిరంగసభలో విజేతలకు ప్రఖ్యాత చలనచిత్ర కళాకారులచే ట్రోఫీలు, షీల్డులు బహూకరింపబడును. పోటీలలో పాల్గొనదలచు ఔత్సాహిక కళాకారులు తమ నాటక సంస్థల ద్వారా వెంటనే హిందూపురం రాయల కళాసమితి సంయుక్త కార్యదర్శి, సాసెప్పనగర్, హిందూపురంకు వ్రాసి వివరములు పొందవచ్చును.

* * *

నూతనముగా నేర్పడిన ఒంగోలు జిల్లాకు చెందిన రచయితల నందరిని సంఘటిత పరచి వారి మధ్య సుహృద్భావం పెంపొందించి సాహిత్యానికి దోహదం చేస్తూ, రచయితలను ప్రోత్సహించడం లక్ష్యంగా జిల్లా రచయితల మహాసభలు ఒంగోలులో మే 1971లో జరుపడానికి నిర్ణయించబడింది. అందుకుగాను ఒక ఆహ్వాన సంఘం కూడా ఏర్పడింది. ఈ సందర్భములో మండలములోని రచయితల వివరాలతోనూ, జిల్లా సాహిత్య చరిత్రకు సంబంధించిన వ్యాసాలతోను ఒక సావనీర్ ప్రచురించడానికి కూడా నిర్ణయం జరిగింది.

కనుక తమరు తమ వివరాలనే కాక ఈ జిల్లాకు సంబంధించి తమకు తెలిసిన యితర రచయితల, రచయిత్రుల వివరాలు జిల్లా సాహిత్య చరిత్రకు సంబంధించిన వ్యాసాలు ఈ దిగువ నివ్విన చిరునామాకు పంపి మా ప్రయత్నానికి దోహదం చేయాలని ప్రార్థిస్తున్నాం.

కెరాఫ్ శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు, జిల్లా రచయితల సభల ఆహ్వాన సంఘం, రావినూతల పోస్టు, ఒంగోలుజిల్లా, లేక శ్రీ ఎం. వి. ఎస్. శర్మ, లెక్చరర్, తాయరుపేట, ఒంగోలు.

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press; 6 & 7 Thambu Chetty Street, Madras-1. Chief Editor; S. Sambhu Prasad.

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.